




ఖజానా అందిస్తోంది
సరికొత్త మరియు
ప్రత్యేక కలెక్షన్లు

మీలోనే ఉన్న
విభిన్న
నారీమణుల కోసం

KHAZANA JEWELLERY
Across India & Middle East









హైదరాబాద్ – అబిడ్స్ రోడ్ | సోమాజిగూడ | కూకట్‌పల్లి | A.S. రావు నగర్ | దిల్‌సుఖ్‌నగర్ | చందానగర్ • కరీంనగర్ • వైజాగ్ – ద్వారకా నగర్ 1 | ద్వారకా నగర్ 2 | గాజువాక • విజయవాడ • గుంటూరు • కాకినాడ • రాజమండ్రి • భీమవరం • తిరుపతి • నెల్లూరు • వరంగల్ • శ్రీకాకుళం • ఒంగోలు
ఖమ్మం • అనంతపురం • విజయనగరం • కడప • కర్నూల్ • చెన్నై - టీ. నగర్ | కథెడ్రల్ రోడ్ | అన్నానగర్ | పురసైవాక్కం | వేలచేరి • కోయంబత్తూరు • సేలం • వెల్లూర్ • కాంచీపురం • పుదుచ్చేరి • తిరునెల్వేలి • తిరుచి • మదురై • తూత్తుక్కుడి • నాగర్‌కోయిల్ • తేని • బెంగళూరు – డికెన్సన్ రోడ్ | జయనగర్
మారతహళ్ళి | కోరమంగళ | మల్లేశ్వరం • మంగళూరు • బళ్ళారి • దుబాయ్ – కరామా సెంటర్ | మీనా బజార్ | గోల్డ్ సూక్ • షార్జా • అబుదాబి. (అన్ని రోజులు షాపు తెరచి ఉండును.) www.khazanajewellery.com

## సరదాగా....

### ఎంత ఘాటు ప్రేమయో...!

కాఫీ తాగుతూ పేపర్ చదువుతున్న భర్తని గోముగా అడిగింది భార్య.

**భార్య:** మీరు నన్నెంతగా ప్రేమిస్తున్నారో ఒక ముక్కలో చెప్పండి.

**భర్త:** 72 శాతం వరకూ నీ మీద ప్రేమ ఉందోయ్...

**భార్య:** నేనేం తక్కువ చేశాను మీకు. ఆ 28 శాతం ఎందులో తగ్గింది? చెప్పండి ముందు... అంటూ నిల దీసింది.

**భర్త:** ఎందుకంటే లగ్జూరియస్ వస్తువుల మీద 28 శాతం జీఎస్టీ ఉంది కదా! అందుకు...అంటూ పేపర్లో తలదూర్చేశాడు.

### ఒక ప్రశ్న?

వీకెండ్ విహారానికి గోవా వెళ్ళాడు ఆదర్శ్. బీచ్‌లో సేదదీరాడు. సర్ఫింగ్ చేశాడు. రెస్టారెంట్‌కి వెళ్ళి గోవాలో మాత్రమే స్పెషల్‌గా దొరికే వంట కాలను రుచి చూశాడు. ఇక అన్నీ అయ్యాక ఏమీ తోచక, అలా ఒంటరిగా బీచ్‌లో నడుస్తూ వెళ తున్నాడు. పరిసరాలను చూస్తూ ఆనందిస్తున్నాడు. కొంతదూరం వెళ్ళాక, జనసంచారం అంతగా లేని ప్రదేశంలో అతనికో వ్యక్తి, దిక్కులు చూస్తూ కనిపిం చాడు. అతని దగ్గరగా వెళ్ళాడు ఆదర్శ్. ఆ వ్యక్తి ముందు ఓ పెద్ద కార్డ్‌బోర్డ్ బాక్స్, అందులో కొన్ని గోలీలు కనిపించాయి. ఆరా తీశాడు ఆదర్శ్. ఆ వ్యక్తి ఇలా చెప్పాడు. ఈ బాక్సులో 33 పసుపురంగు గోలీలు, 35 ఆకుపచ్చరంగు గోలీలు ఉన్నాయి. బాక్సు బయటేమో 34 ఆకుపచ్చ గోలీలు ఉన్నాయి. అయితే మీరు ఏం చేయాలంటే, బాక్సు లోపలినుంచి రెండేసి గోలీల చొప్పున తీయాలి. అలా తీసిన గోలీల్లో రెండూ కూడా వేరు వేరు రంగుల్లోవి వస్తే మాత్రం, పసుపురంగు గోలీని బాక్సు లోపల పెట్టేయాలి. అలాకాకుండా రెండు గోలీలూ ఒకే రంగువి వస్తే, వాటిని బాక్సు బయట పెట్టాలి. ఇలా బాక్సులో ఒకే ఒక్క గోలీ మిగిలేవరకు చేయాలి. అయితే ఇక్కడ నిబంధన ఏంటంటే... మీరు ముందుగానే ఆ చివ రిగా మిగిలే గోలీ రంగు ఏదో చెప్పాలి. అలా మీరు చెప్పిన రంగు గోలీ ఆఖర్న మిగిలితే మీరు గెలిచి నట్టే! ఇప్పటివరకూ చాలామంది ఈ ఆట ఆడారు కానీ ఎవరూ గెలవలేకపోయారు. మరి మీరు గెలవ గలరేమో ప్రయత్నించండి అన్నాడా వ్యక్తి. సరేనని ఆదర్శ్ తన లెక్కల పాండిత్యాన్ని అంతా ఉపయో గించి, మనసులోనే లెక్కగట్టాడు. ముందుగానే ఏ రంగు గోలీ మిగులుతుందో చెప్పి, ఆట మొదలుపె ట్టాడు. ఆఖర్న అతను చెప్పిన రంగు గోలీనే మిగి లింది. ఇంకేముంది... ఆటలో ఆదర్శ్ గెలిచాడు. మరి మీరూ ప్రయత్నించి చివరగా ఏ రంగు గోలీ మిగి లిందో కనిపెట్టండి.

పసుపురంగు

సమాధానం













**44**

## నవ్వు! నవ్వించు! నవ్వులు పండించు!

బాధలకు ఉండే లక్షకారణాలపై ఒక నవ్వుతో విజయం సాధించవచ్చు. జీవనశైలి, అభద్రతాభావం వంటివాటివల్ల మనిషి కొత్తగా నవ్వడం నేర్చుకోవాల్సిన దుస్థితి దాపురించింది. మనస్ఫూర్తిగా నవ్వితే సమస్యలన్నీ ఇట్టే ఎగిరిపోతాయి. ఆ నవ్వే మార్గాలేంటో, ఆ ప్రయోజనాలేంటో చదవండి.

**8**

### టాయ్స్‌లో రారాజు టెడ్డీబేర్

చిన్నాపెద్దా అందరినీ ఆకర్షించే అందమైన బొమ్మ టెడ్డీబేర్. 117 ఏళ్ళ చరిత్రగల టెడ్డీబేర్‌కు నేటికీ ఆదరణ తగ్గలేదు. సెప్టెంబరు 9న టెడ్డీబేర్ డే సందర్భంగా ఆ సంగతులు.

**38**

### కొంచెం దూరం-ఎంతో మేలు

సమాజంలో మనచుట్టూ ఎంతోమంది ఉంటారు. నమ్మకస్తులు, మన వ్యక్తిత్వాన్ని దెబ్బతీసేవారు, రెండునాల్కల ధోరణి గలవారు...వీళ్ళందరితో ఎలా డీల్ చెయ్యాలి?

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: శ్రీయ
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com


## మార్నింగ్ కాఫీ

### ముచ్చట

ఓ పెద్దమనిషి రోడ్డుపక్కన నిల్చుని టాక్సీకోసం ఎదురు చూస్తున్నాడు. అతని దగ్గరికి అప్పుడు ఓ బెగ్గర్ వచ్చాడు. 'ధర్మం చెయ్యండి బాబూ' అని చెయ్యి జాపాడు. పట్టించుకోలేదు పెద్దమనిషి. బెగ్గర్ విసిగిస్తూనే ఉన్నాడు. కాసేపు కళ్ళు మూసుకుని ఆలోచించి, తర్వాత కళ్ళు తెరచి, బెగ్గర్‌ని అడిగాడిలా ఆ పెద్దమనిషి.

"నేను ధర్మంచేస్తాగాని, ఆ డబ్బుతో నువ్వేం చేస్తావు?"

"గుక్కెడు టీనీళ్ళు తాగుతానయ్యా." అన్నాడు బిచ్చగాడు.

"టీనీళ్ళు తర్వాత తాగుదూగాని, ముందు ఓ సిగరెట్ ఇస్తాను తాగు." అని సిగరెట్ ఇవ్వబోయాడు పెద్దమనిషి.

"సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరంవయ్యా! నేను తాగనయ్యా" అన్నాడు బిచ్చగాడు.

"సరే సిగరెట్ తాగొద్దుగానీ, ఎంచక్కా బ్రాంది తాగు! తీసుకో" అని బ్యాగులోంచి బ్రాందీబాటిల్ తీసి ఇవ్వబోయాడు పెద్దమనిషి.

"వద్దుబాబూ! మందు తాగితే లివర్ చెడిపోతుందయ్యా! మందు నాకు అలవాటు లేదు" అన్నాడు బెగ్గర్.

"అలా అంటావా? అయితే ఓ పని చెయ్! నేను ఇప్పుడు గుర్రప్పందాలకి వెళ్తున్నాను, నాతోపాటు రా! నీ పందానికి నేనే డబ్బులు కడతాను. ఆడుకో! నీ అదృష్టాన్ని పరీక్షించుకో!"

"అయ్యబాబోయ్ గుర్రప్పందాలా! అదో పెద్ద వ్యసనం బాబయ్యా! నేను దాని జోలికేపోను."

"అయితే దయచేసి నాతో పాటు మా ఇంటికి ఓసారి వస్తావా?" అడిగాడు పెద్దమనిషి.

"ఎందుకు బాబూ?"

"ఎందుకంటే... ఏ దురలవాట్లు లేనివాడు ఎలా ఉంటాడో చూడాలని మా ఆవిడ తెగ ముచ్చటపడుతోంది, అందుకు." అన్నాడు ఆ పెద్దమనిషి.

### చుక్కలు

"అవునే లక్ష్మీ! మీ ఆయన ఇంటిలోనే తాగుతాట్టగా."

"అవునమ్మా! ఎంచక్కా పూటుగా తాగుతాడు."

"ఇది న్యాయంవాc అని చొక్కాపట్టుకుని అడగాల్సింది."

"అడిగానమ్మా! ఒక్కనాడు కూడా రెండుచుక్కలు పొయ్యలేదు."

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 28

13-9-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# పాత్రుడుకోనేరు

బోడికొండ. కొండమీద ఓ కుగ్రామం. పాతిక గడప ఉంటుందేమో! ఆ పాతికగడపకీ నీళ్ళకరువు. దూరంగా రెండు చిన్నబావులు ఉన్నాయి. వాటి నీరు గొంతు తడుపుకోవడానికే సరి. మిగిలిన అవసరాలకీ, పశువుల పెంపకానికీ నీరు కావాలంటే... ఏడుకిలోమీటర్లు నడవాలి. నడిచి, అక్కడెక్కడో అడవిలో ఉన్న సెలయేరు నుంచి నీరు తెచ్చుకోవాలి. ప్రాణభయంతో ప్రయాణించాలి. ఏ మూల నుంచి ఏ క్రూరజంతువు మీదపడుతుందో, ఏ అడుగు ఏ పాముమీద పడి కాటు కొనితెచ్చుకుంటుందో తెలియదు. పాత్రుడికి పదిహేనేళ్ళు వచ్చేనాటికి పులినోటపడి, పాముకాటు తిని గ్రామంలోని పెద్దలు పది పన్నెండుమంది పోయారు. వాడి తండ్రికూడా పాపం! అలాగేపోయాడు. భుజాన్న కావడి వేసుకుని అడవిలోనుంచి వస్తోంటే పులి మీదపడింది. నీళ్ళు నేలపాలు కాకూడదని జాగ్రత్తపడ్డాడేగాని, పులి మీదపడుతోంది, తప్పించుకోవాలని తాపత్రయపడ లేదతను. పులికి ఆహారమైపోయాడు. నీటికోసం తండ్రి పులినోట పడ్డాడని తెలిసి, నెత్తీనోరూ కొట్టుకున్నాడు పాత్రుడు. వెక్కి వెక్కి ఏడ్చాడు. వాడికన్నీరు కాలువలు కట్టింది. ఆ కాలువల్లోంచి ఓ ఆలోచన పుట్టింది. గ్రామానికి ఓ చెరువుకావాలి. ఆ చెరువు తాను తవ్వాలి. ఆ మాటే చెప్పాడు తల్లికి. నీ ఒక్కడివల్లా అవుతుందా అయ్యా? అడిగిందామె. అవుతుంది అన్నాడు పాత్రుడు. పలుగూ, పారా తీసుకుని అడవిలోనికి నడిచాడు. అక్కడ ఓ స్థలాన్ని ఎంచుకున్నాడు. తవ్వడం ప్రారంభించాడు. పాత్రుడుకి పిచ్చిపట్టింది అన్నారు పెద్దలు. పిన్నలేమో చేతులు కలిపారు. చిన్నది పార్వతి, పాత్రుడు మీద మనసుపడింది. అతనిమీద మనసు పడడమేకాదు, అతని ఆశమీదా, ఆశయంమీద కూడా మనసు పడిందామె. దాంతో రెండుచేతులు నాలుగయ్యాయి. రెండు మనసులు ఒకటయ్యాయి.



పాత్రుడు చెరువు తవ్వుతున్నాడు. పార్వతితో పెళ్ళయిందతనికి. పాత్రుడు చెరువు తవ్వుతున్నాడు. తండ్రి అయ్యాడతను. పాత్రుడు చెరువు తవ్వుతున్నాడు. తల్లిని కోల్పోయాడు. పాత్రుడు చెరువు తవ్వుతున్నాడు. పాతాళ గంగ పైకి లేచింది. ఆకాశగంగ ఉరిమురిమి పడింది. చెరువు నిండింది. ఆసరికి పాత్రుడికి నలభైరెండేళ్ళు నిండాయి. ఇరవై ఏడేళ్ళ శ్రమ, చెరువునిండుగా కనిపిస్తూ ఉంటే పాత్రుడి ఆనందానికి పట్టపగ్గాలు లేకపోయాయి. చెరువు నీళ్ళలో పసుపుకుంకుమలు వేశాడతను. పువ్వులు జల్లాడు. భార్యాబిడ్డసహా నీటికి సాష్టాంగపడి, మాతల్లి మాయమ్మే అన్నాడు. మమ్మేలుకో అన్నాడు. నీటిని ముద్దు పెట్టుకున్నాడు. నీటి అద్దంలో పార్వతినీ, పిల్లాణ్ణీ చూసి మురిసి పోయాడు.

కోనలో కోనేరును చూసి కొంగలు వచ్చి వాలాయి. కోతులువచ్చి తాగాయి. గొడ్డూగోదా, పిల్లామేకా ఒకటినొకటి కవ్వించు కున్నాయి. కోనేట దిగి గంతులువేశాయి. పాత్రుడుకోనేరు అని పేరుపెట్టి పిలిచాయి. ఆ పిలుపుకి చెరువులో తామరలు విరి శాయి. ఆ తామరలు గట్టుమీది శివుణ్ణంటి మెరిశాయి.

పాత్రుడిపేరు ఆనోటా ఈనోటా నలిగి, ఎమ్మెల్యే రాయుడు చెవినపడింది. గొప్పవాడు పాత్రుడు, చూడదగ్గవాడంటూ బయ ల్దేరారాయన. కోనేటికి చేరుకున్నారు. పాత్రుణ్ణి చేరపిలిచి, కౌగిలించుకున్నారు. అభినందించి, యాభైవేలు అందజేశారు. ఎందు కయ్యా ఇది? అంటే నీ శ్రమకి నా కానుక అన్నారు. నీ పట్టుదలకి నా కట్టుబడి అన్నారు. నవ్వాడు పాత్రుడు. వద్దయ్యా అని తిరిగిచ్చేశాడు. చేతనైతే, చెయ్యాలనుకుంటే చిన్నసాయం చెయ్యయ్యా అని, బోడికొండకు ఆ వైపుగా గల గ్రామానికి చెరువు కావాలన్నాడు పాత్రుడు. ఆ చెరువుకి ఈ డబ్బుని ఖర్చు చెయ్యమన్నాడు. అంతేకాదు, పలుగూపారా పట్టిన పదిహేడేళ్ళ తన కొడుకుని చందాగా ఇచ్చాడు. తీసుకెళ్ళు అన్నాడు రాయుడుతో.

సముద్రాలు కావాలని చెరువులు ఆశపడవు. చల్లగా చెరువులుగానే ఉండాలనుకుంటాయి. వీలైతే మరో చెరువును సృష్టిం చాలనుకుంటాయి. పాత్రుడంతే! పాత్రుడుకోనేరూ అంతే! ఆ మాట నిజం అన్నట్టుగా చెరువులో చేపపిల్ల ఎగిరిపడింది. నీటి బొట్టు తుళ్ళిపడి, తామరనంటింది. ముత్యమైంది.




**బుధవారం: 6 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** పూర్ణిమ మ. 12.33 తదుపరి పాడ్యమి
**నక్షత్రం:** శతభిషం మ. 12.56 తదుపరి పూర్వాభాద్ర
**వర్జ్యం:** రా. 7.20 నుంచి 8.56 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 11.49 నుంచి 12.39 వరకు
**అమృతఘడియలు:** శే. 7.13 వరకు, తె. 4.57 మొదలు
**రాహుకాలం:** మ. 12.00 నుంచి 1.30 వరకు
**సూర్యోదయం:** 6.06
**సూర్యాస్తమయం:** 6.22

**గురువారం: 7 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**
**తిథి:** పాడ్యమి ఉ. 11.52 తదుపరి విదియ
**నక్షత్రం:** పూర్వాభాద్ర మ. 12.57 తదుపరి ఉత్తరాభాద్ర
**వర్జ్యం:** రా. 10.23 నుంచి 11.57 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 10.11 నుంచి 12.00 వరకు, మ. 3.05 నుంచి 3.54 వరకు
**అమృతఘడియలు:** శే. 6.33 వరకు
**రాహుకాలం:** మ. 1.30 నుంచి 3.00 వరకు
**సూర్యోదయం:** 6.06
**సూర్యాస్తమయం:** 6.21

**శుక్రవారం:8 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**
**తిథి:** విదియ ఉ. 10.44 తదుపరి తదియ
**నక్షత్రం:** ఉత్తరాభాద్ర మ. 12.31 తదుపరి రేవతి
**వర్జ్యం:** రా. 12.05 నుంచి 1.38 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 8.33 నుంచి 9.22 వరకు, మ. 12.38 నుంచి 1.27 వరకు
**అమృతఘడియలు:** ఉ. 7.49 నుంచి 9.23 వరకు
**రాహుకాలం:** ఉ. 10.30 నుంచి 12.00 వరకు
**సూర్యోదయం:** 6.06
**సూర్యాస్తమయం:** 6.20

**శనివారం: 9 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**
**తిథి:** తదియ ఉ. 9.13 తదుపరి చవితి
**నక్షత్రం:** రేవతి ఉ. 11.43 తదుపరి అశ్విని
**వర్జ్యం:** లేదు
**దుర్ముహూర్తం:** ఉ. 6.05 నుంచి 6.55 వరకు
**అమృతఘడియలు:** ఉ. 9.23 నుంచి 10.56 వరకు, మ. 3.45 నుంచి 5.17 వరకు
**రాహుకాలం:** ఉ. 9.00 నుంచి 10.30 వరకు
**సూర్యోదయం:** 6.06
**సూర్యాస్తమయం:** 6.19

**ఆదివారం: 10 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**
**తిథి:** చవితి ఉ. 7.25, పంచమి తె. 5.24 వరకు
**నక్షత్రం:** అశ్విని ఉ. 10.37 తదుపరి భరణి
**వర్జ్యం:** ఉ. 6.48 నుంచి 8.20 వరకు, రా. 7.42 నుంచి 9.13 వరకు
**దుర్ముహూర్తం:** సా. 4.41 నుంచి 5.30 వరకు
**అమృతఘడియలు:** తె. 4.48 మొదలు
**రాహుకాలం:** సా. 4.30 నుంచి 6.00 వరకు
**సూర్యోదయం:** 6.07
**సూర్యాస్తమయం:** 6.19

**సోమవారం: 11 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**
**తిథి:** షష్ఠి తె. 3.15 తదుపరి సప్తమి
**నక్షత్రం:** భరణి ఉ. 9.20 తదుపరి కృత్తిక
**వర్జ్యం:** రా. 8.38 నుంచి 10.08 వరకు
**దుర్ముహూర్తం:** మ. 12.37 నుంచి 1.25 వరకు, మ. 3.03 నుంచి 3.52 వరకు
**అమృతఘడియలు:** శే. ఉ. 7.11 వరకు
**రాహుకాలం:** ఉ. 7.30 నుంచి 9.00 వరకు
**సూర్యోదయం:** 6.07
**సూర్యాస్తమయం:** 6.18

**మంగళవారం: 12 సెప్టెంబర్ 2017**
**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**
**తిథి:** సప్తమి రా. 1.02 తదుపరి అష్టమి
**నక్షత్రం:** కృత్తిక ఉ. 7.56 తదుపరి రోహిణి
**వర్జ్యం:** రా. 10.57 నుంచి 12.27 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 8.33 నుంచి 9.22 వరకు, రా. 10.10 నుంచి 10.55 వరకు
**అమృతఘడియలు:** తె. 3.28 నుంచి 4.58 వరకు
**రాహుకాలం:** మ. 3.00 నుంచి 4.30 వరకు
**సూర్యోదయం:** 6.07
**సూర్యాస్తమయం:** 6.17

## మెయిల్ బాక్స్

### నా మనవడికి చెబుతున్నా

సాయిపల్లవి ముఖచిత్రంతో ముస్తాబైన సంచికలో మొదటిపేజీ 'ప్లీజ్!చెప్పండిసార్!' కబుర్లలో కామాక్షి కుంటిరాజు గాణ్ణి అలా వదిలి వెళ్ళిపోతుందని ఊహించలేదు. పాపం వాడికి తోడేదీ? ఎంతైనా మనిషి కదా, అందుకే వదిలెళ్ళిపోయింది అనిపించింది. జైనిగారి సీరియల్ లాకర్ నెంబర్ 369 పాఠకులను మోహ... సమ్మోహనాల్లో ముంచేస్తోంది. బ్యాంక్‌లో ఎన్ని రకాల కిరికిర్లు జరుగుతాయో అర్థమవుతోంది. నూరుకట్ల పిశాచం కథలు, హరివంశం కథలు నా మనవడికి వారం వారం చెబుతున్నాను. మురళీమోహన్ జీవితవిశేషాలు, సినీముచ్చట్లు, ఇతర శీర్షికలు చదువుతుంటే మాకు నిజంగా మంచి శీర్షికలతో 'నిధి' దొరికినట్టే అనిపిస్తోంది.

**–మల్లిడి విజయభాస్కరరెడ్డి, కుతకులూరు. తూ.గో.జిల్లా**

### పసందైన మార్నింగ్ కాఫీ

దొంగగారి నమ్మకం ఇండియన్ తెలివితేటల మార్నింగ్‌కాఫీ పసందుగా ఉంది. రాజుగాడు విశ్వాసం గల శునకం. కామాక్షి కుంటిదికాదు, కుటిలమైన దనిపించింది మొదటిపేజీ చదివాక. సీతమ్మపాదం కథారచయిత వాణిశ్రీగారికి అభినందనలు. మిస్టరీ చెట్లు అబ్బురపరచాయి. నవ వరూధిని కవిత భావ గర్భితంగా ఉంది. విజయవిలాసం–2 మెట్రోమేన్ శ్రీధరన్ గురించి బాగా రాశారు. జీవనతరంగాలు విభిన్నంగా ఆకట్టుకుంటోంది.

**–నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం**

### నాలుగూ పోటాపోటీ సీరియల్సే

ఈ వారం నవ్య వీక్లీ చదివిన తర్వాత ఈ ఉత్తరం రాయకుండా ఉండలేకపోతున్నాను. సీరియల్స్ నాలుగూ పోటాపోటీగా అలరిస్తున్నాయి. ఈ సీరియల్స్ చూస్తుంటే 1980 దశకంనాటి జ్యోతి వీక్లీలో పోటాపోటీగా సాగిన సీరియల్స్ గుర్తుకువస్తున్నాయి. లాకర్ నెంబర్ 369 చదువుతుంటే గుండెలు గుబగుబలాడుతున్నాయి. బ్యాంకుల్లో ఉన్నతోద్యోగాలలో ఉన్న మిత్రులు చాలాటెన్షన్ పడుతున్నామంటే నమ్మలేకపోయాం. కానీ ఈ సీరియల్ ద్వారా బ్యాంకుల్లోని కుంభకోణాలు చదివి విస్తుపోతున్నాం. రచయితకు అభినందనలు.

**–కె.వి.దుర్గామోహనరావు, హైదరాబాద్**

### నవ్య వీక్లీ ఒక్కటే

నవతరానికి నమ్మకమైనది నవ్యవీక్లీ. యువతరాన్ని ఉత్తేజపరిచేది, తరం తరం మారినా అక్షర సిరులు కురిపించేది. ఆణిముత్యంలాంటి సాహిత్యం అందించేది నవ్య వీక్లీ.

నవరసాలకు నాణ్యత పెంచేది, రమ్యమైన అంశాలకు ఆదర్శంగా నిలిచేది. నవ్య వీక్లీ సంపాదకీయం మేధస్సుకు ఉపయోగిస్తుంది. మార్నింగ్‌కాఫీ నవ్విస్తూ, మెయిల్‌బాక్స్ ఆకర్షిస్తూ వివేకానికి నిలువుటద్దంగా ఉంటుంది వీక్లీ.

**–పువ్వాడ హనుమాన్‌ప్రసాద్, హైదరాబాద్**

### వహ్వా!

నాలుగు సీరియల్స్, కథలు, రాజకీయరివ్యూలు, సినీరంగవార్తలతో పాఠకులకు ఆనందం పంచుతోంది నవ్యవీక్లీ. పాఠకులతో వహ్వా..అనిపించుకుంటోంది. సినీతారల ముఖచిత్రాలు వారం వారం ఆకర్షణీయంగా ఉంటున్నాయి.

**–టి.బాల్‌ముకుంద్‌సింగ్, అమరచింత**




**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి


# హెర్పిస్ సమస్య మళ్లీ రాలేదు

**మా ఊరు** రాజమండ్రి. నా పేరు రాజేష్. ఏడాది క్రితం ఆత్మహత్యకు ప్రయత్నించాను. అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డాను. నా కథ ఏంటంటే ఒకరోజు స్నేహితుల బలవంతంపైన ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో నాకు హెర్పిస్ ఉందని నిర్ధారణ అయింది. ఆ నీటిపొక్కులకు కారణం అదే అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఇక నా జబ్బు తగ్గదని నిర్ధారణకు వచ్చేశాను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. వైరస్ ఏమీ చేయలేని స్థితిలోనే ఉండిపోతుందన్నారు. డాక్టర్‌గారు చెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

హెర్పిస్‌కు కారణం హెచ్ఎస్‌వి(హెర్పిస్ సింప్లెక్స్ వైరస్). ఇది ఒకరకమైన వ్యాప్తి చెందే వ్యాధి. ముఖ్యంగా నోరు, పెదాలు, నాలుక, జననాంగాలలో వచ్చే వ్యాధి ఇది. నోటిలో వచ్చే వ్యాధిని ఓరల్ హెర్పిస్ అంటారు. బుగ్గలపై, ముఖంపై రావచ్చు. జననాంగాలపై వచ్చే వ్యాధిని జెనెటల్ హెర్పిస్ అంటారు. ఇందులో రెండు రకాలుంటాయి. ఒకటి హెచ్ఎస్‌వి 1. రెండోది హెచ్ఎస్‌వి2.

### హోమియో చికిత్స

హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి.

# హెపటైటిస్ బాధ ఇలా తగ్గింది

**ఒకరోజు** సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

**లక్షణాలు :** హెపటైటిస్ బి వ్యాధి బయటపడటం చాలా ఆలస్యంగా జరుగుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత కూడా వ్యాధి బయటపడవచ్చు. వైరస్‌కి పరిసరాలు సహకరించేంతవరకు అది వేచి ఉంటుంది. ఆ తర్వాతే అది దాడి చేస్తుంది. వాంతి వచ్చినట్లుగా వికారంగా ఉండటం, వాంతులు రావడం. ఆకలి వేయక పోవడం, ఆహారం సహించకపోవడం. మూత్రం పసుపు రంగుతో, కళ్లు పచ్చగా ఉండటం ఉండటం. ఆర్థరీస్ వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి,రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది. కొన్ని సార్లు లివర్ కేన్సర్‌కు కూడా దారితీస్తుంది.

### చికిత్స తరువాత

హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో ఉంది. వైరల్ లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంత మైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయ సమస్య లకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు.

# ఆస్తమా శాశ్వతంగా పోయింది

**ఆస్తమా** ఒకసారి వస్తే తగ్గదని అనుకుంటారు. కానీ అది నిజం కాదని మా విషయంలో రుజువయింది. సరైన డాక్టర్‌ను ఎంపిక చేసుకుని చికిత్స తీసుకుంటే ఆస్తమా ఆనవాళ్లే కనిపించకుండా పోతాయి. మా బాబుకు ఇన్‌హేలర్ వాడటం తప్పనిసరి అన్నారు. కానీ మాకు హోమియో వైద్యంపై నమ్మకం ఉంది. అందుకే డాక్టర్ రవికిరణ్‌గారిని కలిసి చూపించాను.

మా బాబు వయస్సు ఏడేళ్లు. చిన్నప్పటి నుంచి జలుబు సమస్య ఎక్కువగా ఉండేది. సాధారణ జలుబే కదా అనుకున్నాం. కానీ తరువాత ఆస్తమా మొదలయింది. రాత్రి పడుకున్నప్పుడు పిల్లికూతలు వచ్చేవి. శ్వాస తీసుకోవడానికి ఇబ్బంది పడేవాడు. దగ్గు వచ్చేది. కొంచెం దూరం పరుగెత్తినా ఆయాసపడేవాడు. చలికాలంలో ఈ సమస్య మరింత ఎక్కువ ఉండేది. అల్లోపతి డాక్టర్‌ను కలిస్తే ఇన్‌హేలర్ వాడమని సూచించారు. ఇంత చిన్న వయసులోనే ఇన్‌హేలర్ వాడకం మొదలుపెడితే ఎలా? మాకు అసలు ఇష్టం లేదు. అందుకే డాక్టర్ రవికిరణ్‌గారి దగ్గరకు వెళ్లాం. మేం చెప్పినదంతా ఓపిగ్గా విని భయపడాల్సిన అవసరం లేదని ప్రారంభ దశలోనే ఉంది కాబట్టి హోమియో మందులతో సులభంగా తగ్గిపోతుందని చెప్పారు. ఒకటి రెండు నెలలు మందులు వాడి మానేస్తే ఫలితం ఉండదని, పూర్తి కోర్సు తీసుకున్నప్పుడు ఫలితాలు బాగుంటాయని చెప్పారు. డాక్టర్ గారు చెప్పినట్టుగా పూర్తి కోర్సు మందులు వాడాం. ఇప్పుడు మా బాబు పూర్తి ఆరోగ్యంగా ఉన్నాడు. ఆస్తమా ఆనవాళ్లే లేకుండా పోయింది.

జీవనవిధానం మార్చుకోవడంతో పాటు హోమియో చికిత్స తీసుకుంటే ఆస్తమా ఇట్టే దూరమవుతుంది. మూలకారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత ఆస్తమా తిరిగి రావడం అంటూ జరగదు.

# టాయ్స్‌లో రారాజు టెడ్డీబేర్

(సెప్టెంబర్ 9 నేషనల్ టెడ్డీబేర్ డే)




**రంగురంగుల బొమ్మలు చూస్తే ఎవరికైనా ఆనందం కలుగక మానదు. వాటిని కొనివ్వమని పిల్లలు మారాం చేస్తూ ఉంటారు. కొనివ్వకపోతే అలుగుతారు కూడా. బొమ్మలు కేవలం ఆటవస్తువులు మాత్రమే కాదు, అవి మనసులోని భావాన్ని వ్యక్తీకరిస్తాయి. బొమ్మలు మానసిక పరిపక్వత పెంచుతాయని అనేకమంది విశ్లేషకులు, పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.**

బొమ్మలంటే కేవలం చిన్నపిల్లలకు మాత్రమే కాదు, పెద్దవాళ్లు కూడా బొమ్మల్ని ఇష్టపడతారు. చిన్నపిల్లల నుంచి పెద్దవాళ్లదాకా ఇష్టపడే బొమ్మల్లో తనకంటూ ఓ ప్రత్యేకత సంపాదించుకున్న బొమ్మ టెడ్డీబేర్. ముచ్చటైన అమ్మాయిలు హత్తుకుని పడుకునే బొమ్మ టెడ్డీబేర్. రంగురంగులతో, మెత్తగా వివిధ రకాల పరిమాణాల్లో, వివిధ ఆకారాల్లో ఉండే టెడ్డీబేర్‌లను ఎవరైనా అమితంగా ఇష్టపడతారు. టెడ్డీబేర్ తమ నేస్తం అని గొప్పగా చెప్పుకుంటారు. బేర్‌మంటూ ఏడ్చేసే పిల్లలుసైతం టెడ్డీబేర్‌తోనే జతకడతారు. మరి అంతలా అందరినీ తనతో కట్టిపడేసుకున్న ఆ టెడ్డీబేర్‌కు ఓ ప్రత్యేకమైన రోజు ఉంది. అదే టెడ్డీబేర్ డే! సెప్టెంబర్ 9న నేషనల్ టెడ్డీబేర్ డే ఘనంగా సెలబ్రేట్ చేసుకుంటారు. ఈ సందర్భంగా ఆ విశేషాలు!

### టెడ్డీబేర్‌కు 117 ఏళ్ళ చరిత్ర

చిన్నారులతో పాటు పెద్దవాళ్లను కూడా అమితంగా ఆకర్షిస్తుంది టెడ్డీబేర్. అందం ఉట్టిపడే టెడ్డీబేర్‌ను అమెరికావాసి మోరిస్ మిచ్‌థమ్ సృష్టించాడు. అయితే ఈ బొమ్మ పుట్టుకకు ఒక కారణం ఉంది. అమెరికా 26వ అధ్యక్షుడు థియోడర్ రూజ్‌వెల్ట్. 1901–09లో అధ్యక్షుడిగా చేసిన రూజ్‌వెల్ట్‌ను 'టెడ్డీ రూజ్‌వెల్ట్' అని కూడా పిలుస్తారు. మంచి షూటర్‌గా ఆయన పేరు పొందారు. ఎలుగుబంటిని చంపడం అంటే ఆయనకు ఎంతో ఆసక్తి. అడవికి వెళ్లి ఎలుగుబంట్లను వేటాడేవాడు. ఓసారి ఇలానే మిస్సిసిపీలోని ఓ అడవికి తన పరివారంతో కలిసి వేటకు వెళ్ళినప్పుడు వారిమీద ఎలుగుబంటి దాడి చేసింది. ఎంతో అందంగా ఉన్న ఆ ఎలుగుబంటిని చూసి చేతిలో పిస్టల్ ఉన్నా కాల్చకుండా, భయపెట్టి తరిమేశారు. ఎలుగుబంటి దాడి గురించి అప్పటి అమెరికా మీడియాలో బాగా ప్రచారం జరిగింది. ఈ సంఘటన స్ఫూర్తితో కార్టూన్లు, కామిక్స్ పుట్టుకొచ్చాయి. ఓ పత్రిక దాన్ని టెడ్డీబేర్ అని రాసిందట.

ఇదే ఊపులో మోరిస్ అండ్ రోజ్ మిక్టమ్ టాయ్స్ కంపెనీ ఉద్యోగి మోరిస్ మిచ్‌థమ్ ఎలుగుబంటిబొమ్మ తయారు చేశాడు. అదొక సాఫ్ట్‌టాయ్. దానికి 'టెడ్డీబేర్' అని పేరు పెట్టాడు. మార్కెట్‌లో దానికి బ్రహ్మాండమైన ఆదరణ లభించింది. ఆ తర్వాత అమెరికాలో ఓ బొమ్మల తయారీ సంస్థ టెడ్డీబేర్ పేరిట బొమ్మల తయారీ ప్రారంభించింది. మరికొంత కాలానికి మరో జర్మన్ సంస్థ కూడా వీటి తయారీ మొదలుపెట్టింది. ఇలా మన ఈ బుజ్జి టెడ్డీలు పుట్టి ఇప్పటికి 117 ఏళ్లయ్యిందన్న మాట. ఇలా కాలక్రమంలో టెడ్డీబేర్ ఒక ఐకానిక్ టాయ్‌గా మారింది.




## టెడ్డీబేర్ డే సెలబ్రేషన్స్

చిన్నా, పెద్దా తేడా లేకుండా అందరినీ ఆకర్షిస్తోంది టెడ్డీబేర్. అందుకే దీనికోసం ఒకరోజు కేటాయించారు. దాన్నే టెడ్డీబేర్ డేగా పిలుచుకుంటారు. చాలామంది ఈరోజును సెలబ్రేట్ చేసుకుంటారు. ఆరోజే సెప్టెంబర్ 9. చాలా దేశాల్లోనూ చాలామంది ఇదేరోజును అనుసరిస్తున్నారు. అయితే వాలెంటైన్స్ డే తర్వాత తొమ్మిదోరోజు, ఫిబ్రవరి 22న కూడా కొందరు టెడ్డీబేర్ డే చేస్తారు. టెడ్డీబేర్ డే పాటించడానికి ప్రత్యేక కారణమంటూ ఇప్పటి వరకు తెలియదు. అయితే, ఇలాంటి రోజులు చిన్నారులు కాస్త ఉత్సాహంగా ఉల్లాసంగా, గడపడానికి దోహదపడతాయి. ఇక అమెరికాలోనైతే ఈరోజున టెడ్డీబేర్లను ఒకరికొకరు బహుమతులుగా ఇచ్చి పుచ్చుకుంటారు. ఇంట్లో వాడకుండా ఉన్న పాతవాటిని స్థానికంగా ఉండే స్వచ్ఛంద సంస్థల్లో ఇచ్చేస్తారు. వాళ్లు వాటిని శుభ్రం చేసి అనాథ పిల్లలకు పంచుతారు. బేర్ అంటే ఎలుగుబంటని అర్థం. వాటి గురించి పిల్లలకు బోలెడు విషయాలు చెప్పేందుకు అక్కడ జూల్లో ఈ వారమంతా ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తారు.

వీటి కార్టూన్ సినిమాలు, పుస్తకాల్లాంటి వాటిని ప్రదర్శిస్తారు. అమెరికాలో టెడ్డీబేర్‌లు ఉపయోగించి ఓ కార్యక్రమం కూడా చేపట్టారు. విపత్తులు, ప్రమాదాలు తలెత్తినప్పుడు విధులు నిర్వర్తించే పోలీసులకు అమెరికా ప్రభుత్వం టెడ్డీబేర్ బొమ్మలు ఇస్తుంది. విపత్తుల్లో చిక్కుకున్న చిన్నారులకు ఈ బొమ్మలు ఇస్తే, వారు తేలికగా ఊరట చెందుతారనే ఉద్దేశంతో చేపట్టిన ఈ కార్యక్రమం విజయవంతమైంది.





## అంతరిక్షంలోకి టెడ్డీబేర్

ప్రపంచదేశాల్లో అనేకతరాల ఆదరణ పొందిన టెడ్డీబేర్ రోదసీలోకి కూడా దూసుకెళ్లి రికార్డు సృష్టించింది. భూమికి లక్ష అడుగుల ఎత్తులోకి వెళ్లి ఔరా! అనిపించింది. జీవం ఉన్న మనుషులే అంతరిక్షంలోకి వెళ్లడానికి అనేక కష్టాలు పడుతుంటే జీవం లేని ఈ టెడ్డీబేర్ ఆకాశంలోకి ఎలా వెళ్లిందనేగా మీ డౌట్! ఒక హీలియం బెలూన్‌కు దాన్ని కట్టి కొందరు ఔత్సాహికులు గాల్లోకి వదిలేశారు. దీంతో అది ఎంచక్కా రోదసీలోకెళ్లింది. యూకేలోని కింగ్స్ రోచెస్టర్ పాఠశాల విద్యార్థులు ఈ ప్రయోగం చేశారు. ఓ భారీ హీలియం బెలూన్‌ను రూపొందించి దానికి టెడ్డీబేర్‌ను కట్టారు. దీనికి రోఫా అని పేరు కూడా పెట్టారు. రోఫా అంతరిక్షంలో మొత్తం 29 కిలోమీటర్లు ప్రయాణించింది. అయితే పైకి వెళ్లేకొద్ది వాతావరణంలో ఒత్తిడిపెరిగి ఆ బెలూను పేలిపోయింది. బెలూన్‌కు అమర్చిన ఓ కెమెరా రోఫా ఎగిరిన దృశ్యాలను చిత్రీకరించింది. ఈ ప్రయోగం చేపట్టింది 8 నుంచి 13 ఏళ్లలోపు విద్యార్థులే కావడం గమనార్హం. 'రోఫా ది బేర్' పేరిట ఓ ట్విటర్ అకౌంట్ కూడా తెరిచి ఈ ప్రయోగానికి సంబంధించిన వీడియోలు, వివరాలు అందులో పొందుపరిచారు. అలా మన టెడ్డీ విజయవంతంగా రోదసీ యానం పూర్తి చేసుకుందన్నమాట.

## ఆ గుర్రానికి టెడ్డీనే ప్రాణం

టెడ్డీబేర్ అంటే మనుషులే కాదు, జంతువులు కూడా ఇష్టపడతాయి! టెడ్డీబేర్ పక్కన లేకపోతే ఒక గుర్రం అసలు నిద్రపోదంటే నమ్మగలరా? నమ్మశక్యం కాకపోయినా ఇది మాత్రం అక్షర సత్యం. మూడేళ్లుగా ఆ గుర్రం టెడ్డీబేర్‌తోనే కాలం గడుపుతోంది. ఇంగ్లండ్‌లోని డార్ట్‌మూర్ నేషనల్ పార్క్‌లో బ్రీజ్ అనే మగ గుర్రం ఉంది. బ్రీజ్ పుట్టిన కొన్ని గంటలకే దాని తల్లి చనిపోయింది. అప్పట్నుంచి తల్లి ప్రేమకు దూరమైన బ్రీజ్ దిగాలుగా ఉండేది. ఆ సమయంలోనే మారె అండ్ ఫోల్ అటవీ సిబ్బంది బ్రీజ్‌ను చేరదీశారు. అయితే అదిఎప్పుడూ దిగాలుగా ఉండటం గమనించిన సిబ్బంది దానికి బటన్స్ అనే పెద్ద టెడ్డీబేర్ అందించారు. అప్పట్నుంచి బ్రీజ్ బటన్స్‌తోనే పెరిగింది. అది లేకుండా ఒక్కక్షణం కూడా ఉండదు. చెప్పాలంటే బటన్స్ ఒడిలోనే నిద్రపోయేది. మూడేళ్లు వచ్చినా బ్రీజ్ బటన్స్ లేకుండా ఉండలేకపోతోంది. దాన్ని చూసి జూ నిర్వాహకులు, పర్యాటకులు అందరూ ఒకింత ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు. ప్రేమ, ఆప్యాయత మనుషులకే కాదు జంతువులకూ ఉంటాయంటున్నారు. బ్రీజ్, బటన్స్ చిన్నప్పటి ఫొటోలు, ప్రస్తుత ఫొటోలు సోషల్ మీడియాలో పెట్టారు. వాటికి మంచి స్పందన వస్తోంది. ట్వీట్లు, కామెంట్లతో నెటిజన్లు గుర్రం టెడ్డీబేర్‌ల చక్కని స్నేహాన్ని మెచ్చుకున్నారు కూడా! మనుషులకు దీర్ఘకాల బంధాలు కొనసాగించటం తెలుసు. కానీ జంతువులూ దానికి ఏం తీసిపోవనడానికి ఈ గుర్రమే మంచి ఉదాహరణ.

# టెడ్డీ విశేషాలు

*ప్రపంచంలో అందరికంటే ఎక్కువ టెడ్డీబేర్లు పోగేసిన మహిళ జాకీ మెలెయ్. ఆమె దగ్గర ఏకంగా ఎనిమిది వేలకుపైగా బొమ్మలున్నాయి. ఇది గిన్నిస్ రికార్డు కూడా. అతిపెద్ద టెడ్డీబేర్ దక్షిణ కొరియాలోని ఇంచెన్‌లో ఉంది. అది 32 అడుగుల పొడవుంది. అతి చిన్న టెడ్డీబేర్ పరిమాణం 4.5 మిల్లీ మీటర్లు. అంటే అది మన గోటి కంటే చిన్నగానే ఉంటుంది. దక్షిణాఫ్రికాలో తయారైన ఇది ఇప్పుడు దక్షిణ కొరియాలోని ఓ మ్యూజియంలో ఉంది. ప్రపంచంలో మొదటి టెడ్డీబేర్ మ్యూజియంని ఇంగ్లండ్‌లోని పీటర్స్‌ఫీల్డ్‌లో 1984లో ప్రారంభించారు. 1990లో ఫ్లోరిడాలోని నేపుల్స్ (naples)లో ఇంకో టెడ్డీ మ్యూజియం కూడా ప్రారంభమైంది. అయితే కొన్ని కారణాలవల్ల ఈ రెండు మ్యూజియాలు 2006లో మూతపడ్డాయి. ప్రపంచవ్యాప్తంగా ఉన్న లాభసాటి వ్యాపారాల్లో టెడ్డీబేర్ బొమ్మల వ్యాపారం ఒకటి. 2006 నాటికి ఈ వ్యాపారం టర్నోవర్ 1,300 కోట్ల డాలర్లకు పైమాటే. 1980 సంవత్సరం తర్వాత టెడ్డీబేర్ బొమ్మల వ్యాపారం విపరీతంగా పుంజుకుంది.*



## టెడ్డీబేర్‌తో హ్యాకింగ్

హ్యాకింగ్ ఇప్పుడు సైబర్ ప్రపంచాన్ని వణికిస్తోంది. ఎప్పుడు ఏమవుతుందో తెలియక నెటిజన్లు భయపడిపోతున్నారు. సాధారణంగా హ్యాకింగ్ కోసం స్మార్ట్‌ఫోన్ల నుంచి స్మార్ట్‌హోమ్‌ల వరకు, ఆటోమొబైల్స్ నుంచి ఏరోప్లేన్స్ దాకా, ఇంటర్నెట్‌తో ముడిపడి ఉన్న ప్రతి వస్తువును ఓ ఆయుధంలా ఉపయోగించుకుంటారు హ్యాకర్లు. అయితే అవి మాత్రమే కాదు మనం ఆడుకునే టెడ్డీబేర్‌లను కూడా హ్యాకింగ్‌కు ఉపయోగించవచ్చట. ఈ విషయాన్ని స్వయంగా నిరూపించాడు పదకొండేళ్ల బాలుడు రూబెన్ పాల్. 'ఇంటర్నేషనల్ వన్ కాన్ఫరెన్స్'లో సైబర్ సెక్యూరిటీ నిపుణుల మధ్యే హ్యాకింగ్ చేసి ఔరా అనిపించాడు రూబెన్. కాన్ఫరెన్స్ హాల్‌లో కూర్చున్న సభ్యులందరి మొబైల్ ఫోన్లను ఓ టెడ్డీబేర్ ద్వారా ఈ కుర్రాడు హ్యాక్ చేయడం విశేషం. అందరి డివైజ్‌లు హ్యాక్ చేసేందుకు రూబెన్ వైఫైతో అనుసంధానమై ఉన్న ఓ టెడ్డీబేర్‌ను ఎంచుకున్నాడు. ఇలా వైఫైతో అనుసంధానం చేసిన ప్రతి వస్తువుతోనూ హ్యాకింగ్ చేయవచ్చుని, అందుకని హ్యాకింగ్ విషయంలో జాగ్రత్తగా ఉండాలని అతను చెబుతున్నాడు.

– సంతోషలక్ష్మి దహగాం

# అయ్యవారికీ చాలు అయిదు కలహాలు

తులసి బాలకృష్ణ

**గుర్నాధం మేస్టార్ని ఎరుగుదురా మీరు? ఎరిగి ఉంటే... అతగాడితో మీకు ఏదో సందర్భంలో 'కలహక్రీడ' ఆడిన ఎక్స్‌పీరియన్స్ ఉండే ఉండి ఉంటుంది కదూ? "అబ్బే లేదండీ ఆయనా, నేను కూడా చాలా శాంతస్వభావులం" అని మీరంటే, మీరు పచ్చి అబద్ధాల కోరనే అభిప్రాయానికి రావాల్సివస్తుంది నేను. కారణం, ఏ గేమూ ఆడడం బొత్తిగా రాని గుర్నాధానికి దెబ్బలాటే ఫేవరెట్ గేం. అందువల్ల తనతో పరిచయమున్న...ఆ మాటకొస్తే తనతో ఒక్క మాటైనా మాట్లాడిన ప్రతివ్యక్తితో ఏదోఒక కారణం చూపించి పోట్లాడి అమితానందం పొందే జీవి అతను. ఇంకో విషయం, అతని పోట్లాటకి అవతలివ్యక్తి పసివాడా, పడుచువాడా, ముసలాడా అనే వయోభేదంగానీ, ఆడామగా అనే విచక్షణగానీ ఏ మాత్రం అడ్డుకావు.**



ఓ రోజు...

ఆరవతరగతి పిల్లలకి గుర్నాధం క్లాసు తీసుకుంటూ, "రాజమహేంద్రవరం ఏ పుణ్యనది తీరాన ఉన్నది?" అని ప్రశ్నించి, ఆఖరిబెంచీలో ఓ కుర్రాడిని ఆ ప్రశ్నకు జవాబు చెప్పమని అడగబోతుండగానే, ఓ చురుకైన ముందు బెంచీ కుర్రాడు ఉండబట్టలేక 'గోదావరి' అనేసి, ఠక్కున నోరు నొక్కుకుని, భయంతో వణికిపోతూ మిడిగుడ్లు వేసుకుని గుర్నాధంవైపు చూశాడు. అంతే! గుర్నాధానికి కోపం ప్రమాదసూచిక దాటి తన్నుకొచ్చింది. వాడిని మండుటెండలో నిలబెట్టడానికి డిసైడ్ చేసుకుని, బయటికి చెయ్యి చూపిస్తూ "గెట్టౌ....ట్" అని అరిచాడు నోరుని గుహలా తెరిచి.

ఆ కుర్రాడు అవమానభారంతో తలొంచుకుని బయటకు నడిచి గుమ్మంబయట మండుటెండలో నుంచున్నాడు. క్లాసయ్యాక బయటకి వెళ్తూ వాడితో "లోపలికి పో" అని చెప్పాలనిపించింది గుర్నాధానికి. "బయటకు పో" అనడానికి "గెట్టౌట్" అని ఇంగ్లీష్‌లో అన్నాడు కాబట్టి, ఇదీ ఇంగ్లీషులోనే అంటే తన లెవెల్‌కి బ్యాలన్స్ అవుతుందని కూడా అనిపించింది. కాని దానికి ఇంగ్లీషులో ఏమనాలో తెలియక, బయటకు నడిచి, "గెట్టౌ....ట్" అని ఉరుముతూ, క్లాసురూమ్‌లోకి చెయ్యి చూపించాడు. గుర్నాధం ఇంగ్లీష్ ప్రతిభకి, ఎర్రటిఎండలో మాడిపోయి నీరసంతో వేళ్ళాడిపోతున్న ఆ కుర్రాడికి కూడా నవ్వు సునామీలా తన్నుకు రాగా ఫక్కున నవ్వేశాడు. అంతే! కరిగిన తారు మీద కాలువేసినట్లు చిందులు ప్రారంభించిన గుర్నాధం చెయ్యి రైల్వేగేట్‌లా పైకి లేచింది. అతనిచేతిలో వాడి చెంపలు వాచిపోయేవే. సమయానికి అప్పటికే అక్కడికి వచ్చిన ఇంగ్లీష్‌మేస్టారు గుర్నాధం మాటలకి తనలో నుండి కూడా తన్నుకొస్తున్న నవ్వుని పంటిబిగువున నొక్కిపట్టి, 'కిసిక్కు' మంటూ ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో వదుల్తూ, ఆ కుర్రాడిని తన వెనుక దాచుకుని రక్షించారు. మొహం కందగడ్డలా చేసుకుని అక్కడ నుంచి కదిలాడు గుర్నాధం.

ఇంకోసారి,

ఓ ఆదివారంనాడు, క్షవరం చేయించుకోడానికి సెలూన్‌కి వెళ్ళాడు గుర్నాధం. అక్కడ క్షవరాలు చేస్తున్న కుర్రాణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు. వాడు తన స్టూడెంటే. "ఏవిరా,

# తురగా కృష్ణమోహనరావు హాస్యకథలపోటీలో రూ. 5,000 బహుమతి పొందిన కథ

చదువుకుంటూనే మీ నాన్నకి సాయపడాలని ఆది వారాల్లో కటింగ్‌లు కూడా చేస్తున్నావా?" అడిగాడు కనుబొమలెగరేస్తూ.

"అబ్బే లేదండి. ఇంకిది పెర్మనెంటేనండి. మా అయ్య సదువు మానెయ్యమన్నాడండి, 'సదువుకుంటే ఉజ్జోగాలెక్కడున్నాయిరా. సక్కగా మన కులవృత్తి సేసుకుంటే నాలుగురాళ్ళు సంపాయించుకోవొచ్చు' అన్నాడండి" అన్నాడు.

అంతే! అందుకున్నాడు గుర్నాధం. అక్కడలేని వాడి నాన్నని, అక్కడున్న వాడినీ, నీచాతినీచమైన సంబోధనలతో అలసట వచ్చేంతసేపు తిట్టి, "చదువు కోవద్దని చెప్పిన గాడిదకి పుట్టిన అడ్డగాడిద" అని ముక్తాయించి, ఇంక తిట్టడానికి సబ్జెక్ట్ మిగలక, "సర్లే పనికానియ్" అంటూ తలను వాడికి అప్పజెప్పాడు.

వాడు మేస్టారిమీదున్న భయభక్తులతో అతి జాగ్రత్తగా ఒక్కొక్క వెంట్రుకనీ కొలిచి కత్తిరిస్తుంటే కోపం నసాలాన్నంటింది గుర్నాధానికి. "ఏఁవిరా డబ్బులియ్యకుండా ఫ్రీగా క్షవరం చేయించుకుపోవ డానికి వచ్చిన ఉల్ఫాగాడిననుకుంటున్నావా, అలా కొసలుమాత్రం కత్తిరిస్తున్నావు, సరిగ్గా చెయ్యి" అని ఉరిమాడు.

"చచ్చ.. అది కాదండీ మేస్టరుగారూ, తవఁ తల మీద ఎంట్రుకలు బాగా పలసపడిపోయాయి గదండీ, అందుకని జాగర్తగా చూసి కొంచెం కొంచెం కత్తిరిత్తు న్నానండి" అన్నాడు వినమ్రంగా.

"ఒరేయ్ ఈ లోకంలో ఆవలిస్తే పేగులు లెక్కెట్టే వాళ్ళు కొందరుండచ్చు. కాని నేను ఆవలించ కుండానే పేగులసంఖ్యే కాకుండా ధమనులు, సిరల సంఖ్య కూడా చెప్పెయ్యగలను. చదువు మానేస్తున్నందుకు నేనిందాక నిన్ను తిట్టా నని మనసులో పెట్టుకుని, ఏదో పైపైన నాలుగు కొసలు కత్తిరించి, డబ్బులు దొబ్బేసి, వెళ్ళిరండి అని తోసేద్దామని చూస్తున్నట్లున్నావు. చంపేస్తాను. వెధవ్వేషాలెయ్యాక సరిగ్గా ఏడువు" వార్నింగ్‌గా అరిచాడు ఈసారి.

దువ్వెన, కత్తెర పక్కనపెట్టి, చేతులుకట్టుకుని, అత్యంత వినయంగా, "కాదు మేస్టారూ! మరీ ఎక్కువగా తీస్తే మీ మొహానికి అంత బావుండదండి. నేను సక్కగా సేత్తానుగా. మొత్తం పనయ్యాక సూసుకుంటే తవఁరే ఆశ్చర్య పోతారండి" అన్నాడు ఆ కుర్రాడు నిజాయితీగా.

కానీ, ఆ మాటలకు గుర్నాధం ఆపాదమస్తకం కోపంతో ఊగిపోయాడు. "అంటే, నేను నా తల మీద జుట్టు ఎంత ఉండాలో కూడా తెలియని మూర్ఖపు గాడిదకొడుకుననే కదా నీ ఉద్దేశం? నాకే టోకరా ఇద్దామని చూస్తున్నావురా పుండాకోరు వెధవా" అంటూ కుర్చీలోంచి జువ్వలాలేచి, అమాంతం వాడి జబ్బలు పట్టుకుని బలవంతంగా అదే కుర్చీలో కూలేసి, కత్తెర అందుకుని, వాడినెత్తిమీద చకచకా కథాకళి ఆడించేశాడు. ఎంతో ప్రేమతో పెంచుకున్న గిరజాలజుట్టు కుచ్చులు కుచ్చులుగా అలా నేల రాలిపోతూంటే గుడ్లనీళ్ళు తిరిగాయి వాడికి. షాపుకి వచ్చినవాళ్ళు కూడా మతులుపోయి చూస్తున్నారు గుర్నాధం చేష్టని.

"ఇదుగో ఇప్పుడు చూసుకో అద్దంలో. నీకు అర్థ మవ్వాలనే నేను చేశాను క్షవరం నీకు ఫ్రీగా. నేనే ఇంత ఎక్కువ తగ్గిస్తే, డబ్బులు తీసుకుంటున్న వెధవ్వి, దానికితగ్గట్టు తగ్గించొద్దూ? పైగా మేస్టార్ని, నాకే ఎదురు చెబుతున్నావా గాడిద.. గాడిదాని" అంటూ ఒగర్చసాగాడు గుర్నాధం.

"సరే. ఈపాలి ఒళ్ళు దగ్గరెట్టుకు బాగాసేత్తా, కూచోండి" అని గుర్నాధాన్ని కూర్చోబెట్టి, కత్తెరకి అందినంత మట్టుకు చకచక కత్తిరించి పారేసి, "ఇప్పుడు సూస్కోండి మేస్టారూ, తవఁరు సెప్పినట్టే జేసా" అన్నాడు ఆ కుర్రాడు.

అద్దంలో చూసుకున్న గుర్నాధం ఖంగుతిన్నాడు. గచ్చునేలమీద మిరియాలు జల్లినట్టున్న జుట్టుతో 'జూ'లో చింపాజీలా ఉంది మొహం. కానీ బాగా ఎక్కువగా తగ్గించమన్నది తనేగనక ఏమనలేక, పూడుకుపోతున్న గొంతుని ప్రయత్నపూర్వకంగా పెగల్చుకుని, "గూ....డ్! ఇదిరా పనివాడితనమంటే" అని తప్పనిసరై మెచ్చుకుని, వద్దంటున్నా బలవంతంగా డబ్బులు వాడిచేతిలో కుక్కి, గజంబద్ద మింగిన వాడిలా బోర విరుచుకుని, బయటపడ్డాడు. వెనగ్గా షాపులో మిగిలినవాళ్ళ తాలూకు కిచకిచ నవ్వులు అతనిచెవిన పడకపోలేదు. అందులో ఒకడెవరో "క్రాపింగ్ జాగర్తగా నిదానంగా సెయ్యడం కంటే అంటకత్తెర ఎయ్యడం గొప్ప వీజీ గదరా నీకూ, పిచ్చోడు" అంటూ ఘొల్లున నవ్వడమూ వినిపించింది. విని పించనట్లు నటిస్తూ, మిలట్రీ మార్చ్‌లా ముందుకే సాగిపోయాడు గుర్నాధం.

ఇలాంటి సంఘటనలు ఒకటా రెండా? కోకొల్లలు. ఇవన్నీ ఒకెత్తు. ఇప్పుడు వేడివేడిగా 'పోట్లాట' గేము మీద అతనికున్న మోజు కారణంగా తిన్న షాకు ఒక ఎత్తు. దిమ్మ తిరిగిపోయే షాకు కదండి మరి ఇదీ?

ఏం జరిగిందంటే, ఈ మధ్యనే పరిచయ భాగ్యం లభించిన స్వామి భోజనానందస్వాములవారు గుర్నాధానికి ప్రస్తుతం గురువు, దైవం, మార్గదర్శి ఎట్సెట్రా. ఆయన దగ్గర అంతులేని అలౌకిక శక్తులూ, పవిత్రమైన క్షుద్రశక్తులూ ఉన్నాయని, ఆయన ఆశీర్వ దించినా, శపించినా అది ఖచ్చితంగా జరిగి తీరు తుందని అతగాడి ప్రగాఢ విశ్వాసం.

ఆ స్వామీజీ కరుణారుణ దృక్కులు గుర్నాధం మీదకు ఎలా ప్రసరించాయీ అంటే, గుర్నాధానికి సింగినాధం అని ఓ ప్రాణస్నేహితుడున్నాడు. అత గాడు అప్పటికే ఈ స్వామీజీకి సీనియర్ భక్తుడు. ఓ రోజున స్వామీజీ తన అరవైమంది ముఖ్య శిష్య గణంతో సహా ఈ ఊరొచ్చి సింగినాధం ఇంట్లో రెండ్రోజులపాటు తిష్టవేసినప్పుడు పనుల్లో సాయా నికి గుర్నాధాన్నికూడా ఆహ్వానించిన మిత్రుడు, స్వామీజీకి ఇతగాడిని పరిచయం చేశాడు. షడ్రసోపేత భోజనాలతో స్వామీజీని సంతుష్ట పరచిన సింగినాధం తాలూకు రెండు కోరికలూ ఆయనగారి చలవతో ఆర్నెల్లు తిరక్కుండానే నెరవేరిపోవడం కళ్ళెదురుగా కనిపించేసరికి, తను కూడా ఆయన భక్త పరమా ణువైపోయి, సింగినాధాన్ని మించి లాభపడాలని



డిసైడ్ అయిపోయి, ఊరెళ్ళి ఆశ్రమంలో ఉన్న స్వామీజీ కాళ్ళమీద అదాటున పడి, "స్వామీ నావి కూడా రెండు కోర్కెలు" అన్నాడు గుర్నాధం.

అదిరిపడి, మూలుగుతూ "కోర్కెలు తర్వాత; పెద్దవారిదగ్గరకు, స్వామీజీలదగ్గరకు ఒట్టిచేతులతో వెళ్ళకూడదని తెలియదా మూర్ఖా! నూనె రాసుకుని బరిలోకి దిగుతున్న వస్తాదులా ఖాళీచేతులు ఊపుకుంటూ వచ్చావ్?" అని కోప్పడ్డారు స్వామీజీ కాళ్ళు గబుక్కున వెనక్కి లాక్కుంటూ.

"ఆమాత్రం ఇంగితం ఉన్న వాడినే స్వామీ. చేతులు ఖాళీవే అయినా చేతివేళ్ళకున్న ఉంగరాలు మీకోసమే స్వామీ" అన్నాడు గుర్నాధం వినయంగా.

స్వామీజీ కళ్ళు మెరిశాయి. "జాగర్తగా లే నాయినా" అన్నాడు మెత్తని స్వరంతో, చెయ్యి అందిస్తూ. పనిలో పనిగా అతని చేతి వ్రేళ్ళ నుంచి ఉంగరాలు అతిలాఘవంగా వేరుచేస్తూ.

"నా ఉంగరాలు మీరు కరుణతో స్వీకరించడం నా పూర్వజన్మసుకృతం" అన్నాడు గుర్నాధం తన్మయత్వ ధోరణిలో.

'దానిదేవుందిలే, నీలాంటి భక్తులతో ఏ జన్మలోనో నాకున్న ఋణం ఈ జన్మలో తీర్చుకునేంతవరకూ నా కరుణ వారిమీద తప్పక ఉంటుంది' లోలోనే ఉచ్ఛరించుకున్నారు స్వామీజీ, అర్ధనిమీలిత నేత్రాలతో ఏదో మంత్రం చదువుతున్నట్టు నోరు 'చపచప' చప్పరిస్తూ.

ఆ తర్వాత గుర్నాధం ఏదో ప్రశ్నించాలని కోరుకుంటూ కూడా సంశయిస్తున్నాడని గ్రహించి, "ఏ ప్రశ్నలైనా సిగ్గు వదిలి వదులు నాయినా" అన్నారు లాలనగా చూస్తూ.

ఆ చూపులు గుర్నాధానికి ధైర్యం కలిగించాయి. "ఏంలేదు స్వామీ, మా సింగినాధం రెండు కోర్కెలు కోరాడు మిమ్మల్ని. ఒకటి, వాడి శత్రువైన బ్రహ్మజెముడు సుబ్బరాజు పేకాటక్లబ్ దిబ్బదీసి పోవాలని; రెండు, తను లైసెన్స్ లేకుండా సీక్రెట్‌గా నడుపుతున్న సారాదుకాణం ఏ ఆటంకం లేకుండా నడిచి లాభాలు కురిపించాలని. తమ ఆశీస్సులతో ఆ రెండూ నెరవేరి, వాడిప్పుడు నేలమీద నడవడం లేదు. నాక్కూడా అలాంటి అవకాశం..." అంటూ నీళ్ళు చప్పరించాడు.

అప్పుడు స్వామీజీ కళ్ళు మూసుకుని ధ్యానంలో ఉన్నట్టునటిస్తూ, తనలో 'పిచ్చివాడా! అవేవో కాకతాళీయంగా వచ్చిన రిజల్ట్స్‌గానీ, నావల్ల జరిగినవా? నాకే అంత పవరుంటే ఒళ్ళు హూనమయ్యేలా ఈ దేశాటన ఎందుకూ? భక్తులు ఏర్పాటు చెయ్యనప్పుడు ఆకలికి మాడ్డం ఎందుకూ?' అనుకుని, పైకి మాత్రం "ఇహ నుంచీ నా ప్రియ భక్తులలో

**ఆ మేస్టారు కలహప్రియుడు. ఏదో చెయ్యాలనుకుని ఇంకేదో చేసేవాడు. కలహాలతో నవ్వులపాలౌతూ ఇతరులకు వినోదం పంచేవాడు. చివరకు ఒక స్వామీజీ భక్తిపారవశ్యంలో మునిగిపోయాడు. తన కోరికలు నెరవేర్చుకోవడానికి ఆ స్వామీజీనే మనసావాచాకర్మణా నమ్ముకున్నాడు సదరు మేస్టారు. ఆ స్వామీజీ కూడా పెద్దగా కోరికలేమీ కోరేవాడు కాదు భోజనంతప్ప. ఇంతకూ ఆ ఇద్దరి కోరికలూ నెరవేరాయా లేదా?**

నువ్వొకడివి నాయినా, నిర్భయంగా నా ముందుంచు నీ కోరికల్ని. వాటిని నెరవేర్చే పూచీ నాది" అన్నారు చందన పూతలాంటి చల్లని నవ్వు సాయంతో.

ఆనందంతో మెలికలు తిరిగిపోయాడు గుర్నాధం. గొంతు సవరించుకుని, "స్వామీ! నావి మరేమీ పెద్ద గొంతెమ్మ కోర్కెలుకావు. ఒకటి, నన్నందరూ కోపిష్టినని, జగడగొండినని అంటారు. నవ్వుల పాలవుతున్నాను. నాకు ఆ పేరుపోయి, ధర్మరాజంతటి శాంతుడననే పేరు రావాలి. రెండు, అంతటి మంచి పేరు నాకొచ్చాక రాష్ట్రంలో ఏపార్టీ అధికారంలో ఉంటే ఆ పార్టీ వాళ్ళు స్వయంగా నా దగ్గరకొచ్చి, "మీరు మాపార్టీ తరపున నిలబడాలి, ఖర్చులన్నీ మేమే భరిస్తాం" అని నా కాళ్ళావేళ్ళా పడి, మొహమాటపెట్టి, నాచేత ఒప్పించి, నిలబెట్టి గెలిపించి, నన్ను మంత్రిని చెయ్యాలి. ఇంతే స్వామీ" అన్నాడు చేతులు నలుపుతూ.

స్వామీజీ అర్ధనిమీలితనేత్రుడై ఆలోచనలో పడి, అయిదునిమిషాలకు కళ్ళుపూర్తిగా తెరిచి, "అమాయకుడా! ఇంతటి చిన్నకోర్కెలు కోరడానికి అంత ఆలోచించావా? తప్పక నెరవేరేలా చూసే బాధ్యత నాది. అవును నిజమే, కోపం సర్వవినాశనహేతువు. దాన్ని జయిస్తే ప్రపంచాన్ని జయించొచ్చు. మేము దాన్ని ఏనాడో జయించేశాం. ఇప్పుడు నీ కోర్కెలు నెరవేరడానికి నువ్వొక చిన్నపని చెయ్యాలి" అన్నారు.

"సెలవియ్యండి స్వామీ" ముడుచుకుని ఉన్న గుర్నాధం చేతులు మరింత ముడుచుకున్నాయి. నడుము మరింత వంగింది.

"మేము వచ్చే ఆదివారం కాశీకి పయనమై వెళ్ళుతున్నాం, మా అరవైమంది శిష్య పరమాణువులతో సహా. రైలు మీ ఊరుమీదుగానే వెళుతుంది. మీ ఊరికొచ్చేసరికి అపరాహ్ణంవేళవుతుంది. నువ్వు మాకూ, మా శిష్యబృందానికీ ఇంట్లో మడిగా వండించి, లంచ్ ప్యాకెట్లు, సాయంత్రం అయిదు గంటలకి కాలక్షేపానికి పంటికిందకి జంతికలప్యాకెట్లు, మిర్చిబజ్జీలూ సప్లయి చెయ్యాలి. చెయ్యగలవా?"

"మహాభాగ్యంగా భావించి తీసుకువస్తాను స్వామీ. లంచ్‌కి ఏమేమి వండించమంటారో మెనూ సెలవిప్పించండి దయచేసి".

"పెద్దగా ఏమీవద్దయ్యా. సన్యాసులం కదా, తేలికపాటి ఆహారమే తీసుకుంటాం. పూర్ణంబూరెలు, ఇంగువపోపు పులిహోర వండించు. మూడురకాల కూరలు, రెండురకాల పచ్చళ్ళు. ముక్కల పులుసూ వండించు. కొత్తగా జేరిన శిష్యులు ఇంకా మా తిళ్ళకి అలవాటు పడలేదు, కాబట్టి బాసుమతీ రైస్‌తో బిర్యానీ వండించు. సరే అప్పడాలూ, వడియాలూ ఎలాగూ ఉంటాయి. గడ్డపెరుగుకు మీ ఊరు పెట్టింది పేరు కాబట్టి నాలుగుకుండల పెరుగు పెట్టించు. సీజన్ కాబట్టి మంచి పెద్దరసాల మామిడి పళ్ళు తలకి రెండుచొప్పున ఏర్పాటుచెయ్యి. మాకయితే సింపుల్‌గా ఇవి చాలు. నువ్వో, మీ ఆవిడో సరదాపడి బాదాము, జీడిపప్పూ, కిస్మిస్సూ లాంటి డ్రైఫ్రూట్స్ బాగా దట్టించిన చిక్కటి పాయసం వీటికి జతపరచితే తిప్పికొట్టకుండా దాన్నీ స్వీకరిస్తాం. సరా?" అని కటాక్షవీక్షణాలు ప్రసరింపచేస్తూ ముగించారు.

"తప్పకుండా స్వామీ. ఓ అద్భుత అవకాశంగా భావించి ఈ పనిని నేను మహదానందంగా చేస్తాను" అన్నాడు గుర్నాధం వినయాతి వినయంగా.

"వెళ్ళిరా నాయినా, ఆ పని మీదుండు" అన్నారు స్వామీజీ.

తన ఊరుముఖం పట్టాడు గుర్నాధం. 'స్వామీజీ లాగా అంత శాంతంగా ఉండడం నాకీ జన్మలో సాధ్యపడుతుందా?' అని తలుచుకుంటూ.

భోజనానందస్వామి ప్రయాణం రోజు వచ్చింది.

ఆయన ఆదేశించిన ప్రకారం అన్ని పిండి వంటలూ ఆయనకీ, ఆయన అరవైమంది శిష్య బృందానికీ సరిపోగా మిగిలే క్వాంటిటీలో, తనుకూడా ఓ చెయ్యివేసి భార్యచేత మడిగా తయారుచేయించి, పాత్రలన్నీ ఆటోలో పెట్టుకుని, భార్యా సమేతుడై ట్రైన్ వచ్చే టైంకి స్టేషన్‌కి జేరాడు గుర్నాధం. స్టేషన్ బయట ఆపేసిన ఆటోవాలాని "లోపలికి పోనీయ్. ఇక్కడ ఆపేశావేం?" అనడిగాడు చిరాగ్గా.



"లోపలికి ఆటో తీసుకెళ్ళడానికి మాకు పర్మిషన్ లేదండి. తవరు ఇక్కడే దిగాల" అన్నాడు ఆటోవాలా.

"పర్మిషన్ లేదన్న అడ్డగాడిద ఎవడు? నువ్వు పోనియ్, ఎవడు అడుగుతాడో నేను చూస్తాను" అన్నాడు గుర్నాథం లోనుండి కోపం తన్నుకు రాగా.

"లేదండీబాబూ. అందరూ ఇక్కడే దిగాల. పోలీ సోల్లతో పెద్దగోల. మీకు తెల్దు"

"నాకు తెలీక పోవడమేట్రా దగుల్బాజీ వెధవా. వెధవ్వేషాలెయ్యక పోనియ్"

"పోలీసోల్లు సెలానా రాత్తారండీ. నేను పోనీను. మీరు దిగాల అంతే".

అంతే! గుర్నాధానికి కోపం నసాలాన్నంటింది. పెద్దగొంతుతో అతన్ని తిట్టడం మొదలెట్టాడు. ఈలోగా ఓ పోలీసువచ్చి, ఆటోవాలా చెప్పింది కరెక్టే అనేసరికి ఆ పోలీసునికూడా తిట్టటం మొదలు పెట్టాడు గుర్నాథం. వేమూరు గగ్గయ్యస్థాయిలో స్వరం పెంచి, "ఎందుకు గొడవ, దిగిపోదామండీ" అని నచ్చచెబుతున్న భార్య విన్నపాలుకానీ, "ఫలానా రైలు ఫలానా ప్లాట్‌ఫారం మీదకు వస్తోంది" అన్న అనౌన్స్‌మెంట్‌గాని, ఆ తర్వాత "బయల్దేరడానికి సిద్ధంగా ఉంది" అన్న అనౌన్స్‌మెంట్‌గానీ, ఆ పిచ్చి కోపంలో అతగాడి మెదడుకి ఎక్కలేదు. 'కంయ్...' మంటూ అలా తీవ్రస్థాయిలో అవతలి వ్యక్తులు నోళ్ళు విప్పే అవకాశం ఇవ్వకుండా అరుస్తూనే ఉన్నాడు.

చివరకి పోలీసాయనకే గుర్నాధం తిట్లకి తల తిరిగి "లోపలికి తీసుకెళ్ళి దించవయ్యా. చస్తున్నాం గోలతో" అన్నాడు ఆటోవాలాతో. "అలారా పీనుగా దారికి" అన్నాడు గుర్నాథం విజయగర్వంతో.

ఆటో లోపలికి సాగింది. వంటకాలన్నీ ఆటోలోంచి క్రిందకీ, అక్కడనుంచి ప్లాట్‌ఫారం మీదకీ జేరాయి. కానీ రైలే లేదు. "వెళ్ళిపోయి పది నిముషాలయ్యింది" అన్నారు. హతాశుడైపోయాడు గుర్నాథం. శాంత స్వరూపుడైన భోజనానందస్వామి విషయాన్ని తేలిగ్గా తీసుకోవచ్చు. కాని తన కోర్కెలు నెరవేరేదెలా?! ఏ మొహంపెట్టుకుని ఆయన మొహం చూడగలడు తను?!

గుర్నాథం జేబులో సెల్‌ఫోన్ మోగింది. స్వామీజీ నుంచి ఫోన్. "చింతించకు భక్తుడా" అని చెబుతాడు ఆయన ఇప్పుడు. కాని చింతించకుండా ఉండగలడా తను. తనేమైనా స్వామీజీలా చింతలకీ, కోపాలకీ లొంగని స్థితప్రజ్ఞుడా?! "స్వామీజీ" అన్నాడు గుర్నాథం అపరాధభావంతో కూడిన గద్గద స్వరంతో.

"ఏరా లంచ్ తెస్తానని హ్యాండిచ్చావేంట్రా లుచ్చా?" పులి గాండ్రింపు లాంటి స్వామీజీ గొంతు. అదిరి పడి, బెదిరిపోయాడు గుర్నాథం. "తెచ్చాను స్వామీ. మీరు చెప్పిన ఐటెమ్స్ కాకుండా ఇంకా ఎక్స్‌ట్రాగా కూడా కొన్ని చేయించి తెచ్చాను. నేనిప్పుడు స్టేషన్ లోనే ఉన్నాను".

"ఎవరి తద్దినం పెట్టడానికవి? తుచ్చా, లుచ్చా...." అదుపుతప్పిన కోపంతో సాగిపోతోంది స్వామీజీ తిట్ల దండకం. బిక్కచచ్చిపోయి, గుటకలు మింగుతూ, "అయిందేదో అయింది. ఇప్పుడు వీటిని మీకందించే మార్గం సెలవియ్యండి స్వామీజీ" అన్నాడు గుర్నాథం వేడుకోలుగా.

"ఏం మార్గం చెప్పమంటావు నీ పిండాకూడు మార్గం? నీ పిండం పిల్లులకిపెట్టా... నీ శ్రాద్ధం చెట్టు కింద పెట్టా, ఆకలితో మాడిపోతున్నాం. ప్యాంట్రీ కార్ కూడా మూసేశారు. మరో మూడుగంటలు ప్రయాణం చేస్తేనేగాని తిండిదొరికే స్టేషన్ వచ్చి చావదుట. రెండుగంటల క్రితం ఓ భక్తుడు దార్లో ఓ స్టేషన్‌కి మా అందరికీ సరిపోయే క్వాంటిటీలో ఉప్పిడిపిండి వండించితెస్తే, నువ్వు పంచభక్ష్య పర మాన్నాలతో ఫుడ్‌తెచ్చి చస్తావని భ్రమపడి, సుష్టుగా తినడానికి కడుపు ఖాళీగా ఉంచుకుందామని వద్దని చచ్చాం..."

"దారి చూపండి స్వామీ"

"దారి గోదారే. ప్రాయశ్చిత్తం చెబుతున్నా విను. పాటించకపోతే పిల్లివై పుడతావు"

"ప్రాయశ్చిత్తం సెలవియ్యండి స్వామీ" గుర్నాధానికి ఏడుపొచ్చేస్తోంది.

"ఆ ఆహార పదార్థాలన్నీ దాచుకుని, నువ్వొక్కడివే తినాలి. ఇంకెవరికైనా పంచితే బల్లిగా పుడతావు"

"స్వామీ శాంతించాలి తమరు"

"వాటిని ఫ్రిజ్‌లో దాచుకు తింటే నల్లిగా పుడతావ్"

"స్వామీ ఇంతకోపం నాకేగాని, తమకి తగదు" బేలగా బావురుమన్నాడు గుర్నాథం.

"కోపం వద్దంటావేంట్రా శుంఠా?! కోపం లేని వాడు అసలు మనిషేకాడు. సన్యాసి అంతకంటేకాదు! కోపం ఓ వరం. రోజుకి కనీసం అయిదుగురి మీదన్నా కోపం ప్రదర్శించకపోతే నా బీపీ కంప్లీట్ డౌన్ అయి జబ్బు పడిపోతాను. కోపం ఈజ్ ద సీక్రెట్ ఆఫ్ మై ఎనర్జీ. అసలు కోపమే లేకుంటే శాపంపెట్టే ఊపు ఎక్కడినుంచి వస్తుందిరా మూర్ఖా? తారస్థాయి కోపంలో సాగిపోతోంది భోజనానందస్వామి వాక్ప్రవాహం.

మతిపోయి, శిలా ప్రతిమలా బిగుసుకుపోయిన గుర్నాధానికి మెదడు 'బ్లాంక్' అయినట్టు, చెవులు 'బ్లాక్' అయినట్టు తెలియదు పాపం.

*సెల్: 87901 15544*




## అమ్మా! బువ్వా!

బ్యూటీపార్లర్ ఎవడికి కావాలి
బువ్వ కావాలి గానీ,
బువ్వ ఎంత అందమయింది
ప్రాణాలకి ప్రాణం పోసే బువ్వ,
సమస్త సౌందర్య సారాన్ని నింపే బువ్వ,
అధరాలు దాటి, పళ్ళ ప్రహరీగోడలు దాటి
లోలోపలికి, సొరంగం లోపలికి జొరబడి
పాములా మెలికలు తిరుగుతూ
సహస్ర యోజనాల దూరం ప్రవహించి
శక్తిగా మారే బువ్వ
కాలికి కట్టుకున్న ఎండుతుమ్మ కాచుల
గజ్జెలు మోగుతుండగా
విశ్వమంతా విచ్చలవిడిగా నాట్యమాడే
నవరసాలందించే బువ్వ
తాజ్‌మహల్ ఒక మచ్చలేని వెండిముద్ద
యమునా నది పాము మీద పడుకుని
చందమామ చూస్తుండగా
ఒక ముద్దని నా గర్భ సాగరంలోకి విసిరితే
అందమయినవన్నీ అలా అలల మీద తేలుతూ
నన్ను తాకి బుడగల్లా పగిలిపోతాయి
బుడగ పగిలేటప్పటి శబ్దం
బువ్వ తినే వాడికే విన్పిస్తుంది
సర్వపురాణాల కల్పనలన్నీ ఊహలన్నీ
అక్కడ్నుంచే,
నేనొక పడవెక్కి చంద్రుడి వద్ద కెడతా
చంద్రుడి చుట్టూ వలయాలు చుడుతూ
విష్ణుమూర్తిని పిలుస్తా
ఓ విశ్వంభరా, ఓ విష్ణుమూర్తీ, ఓ కాశీ
అన్నపూర్ణా
ప్రపంచంలోని సమస్త సౌందర్యమంతా
నాదవుతుంది



మజ్జిగ బువ్వ నిండిన కడవ
నెత్తిన బెట్టుకు
వరిచేల మధ్య గనేల మీద నడుస్తూ
పొద్దుటి పూట వెండిసాలె గూళ్ళని
సింగారించుకుంటూ సాగిపోతా
బువ్వదిన్న నాదేహం చూడు
దేనితోనూ పోల్చలేని దివ్యకాంతితో
మోహింలా, మెరిసిపోతుంది.
బువ్వా! అమ్మా! నీకొక దండం

**–కె.శివారెడ్డి**
***ఫోన్: 040–24064195***



## బ్లడ్ షుగర్‌కు కాకరకాయ రసం

అనాదిగా ఆసియాలో ప్రసిద్ధిచెందిన పాదు మొక్క కాకరకాయ. ఈ పేరు వినగానే చాలామంది చేదుగా మొహం పెట్టేస్తారుగానీ కాకరకాయ మన దేశంలో ఎప్పటినుండో ఔషధంగా ఉపయోగపడు తోంది. సంప్రదాయ వంటకాల్లో వారానికి ఒకసారైనా కాకరకాయ కూర, కాకరకాయ పులుసు తినాలని పెద్దలు చెబుతారు. ఎందుకంటే ఇది శరీరంలో షుగర్ లెవెల్స్‌ను తగ్గిస్తుంది. మధుమేహ రోగులకు నిల యంగా మారుతున్న మనదేశంలో కాకరకాయరసం ఇప్పుడు ఇంటింటా దివ్యౌషధంగా మారింది. కాకర కాయ జ్యూస్ బ్లడ్ షుగర్ లెవెల్స్‌ను తగ్గిస్తుంది. రోజూ ఉదయంపూట ఈ రసం తీసుకుంటే శరీరం లోని ఆల్ఫా గ్లూకోసైడ్స్ తగ్గుతాయని పరిశోధకులు గుర్తించారు. కాకరకాయలో ఉండే యాంటీ హైపర్ గ్లిజమిక్స్ బ్లడ్ షుగర్ లెవెల్స్‌ను తగ్గించి, కాలేయం, మూత్రాశయాలను ఆరోగ్యంగా ఉంచుతుంది. శ్వాస సంబంధ సమస్యల్ని తగ్గిస్తుంది. కాకరకాయలో ఎ, బి, సి విటమిన్లు, బీటా కెరోటిన్, పొటాషియం, ఐరన్, జింక్, మెగ్నీషియం, మాంగనీసు ఎక్కువుంటాయి. దీని ఆకులు, పండిన కాయలు ఉడికించి తీసుకుంటే రోగనిరోధకశక్తి పెరుగుతుంది. ఇది మొటిమలు, మచ్చల నివారిణి కూడా.




## నాన్‌వెజ్‌తో గర్భిణీలకు హాని



గర్భిణీలు అతిగా నాన్‌వెజ్ తినకూడదని హెచ్చరిస్తున్నారు పరిశోధకులు. దీనివల్ల బిడ్డకు గర్భంలోనే మనోవైకల్యం కలిగే అవకాశాలుంటాయంటున్నారు. అమినో ఆసిడ్ అంటే methionine రక్తనాళాల వృద్ధికి, కణాల అభివృద్ధికి, లివర్, గుండె నాళాల్లో ఉండే ఫ్యాట్ బ్రేక్ చేయడానికి, టిష్యూ రిపేర్ చేయడానికి శరీ రానికి అత్యవసరం. గొర్రెమాంసం, పంది మాంసం, చికెన్, బీఫ్, నట్స్, డైరీప్రోడక్ట్స్, చీజ్, బీన్స్‌లో ఇది ఓవర్ లోడై ఉంటుంది. వీటిని గర్భిణీలు ఎక్కువ తినకూడదు. ఈ ఆహారం గర్భస్థశిశువు మానసిక ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపిస్తుందని కాలిఫోర్నియా యూని వర్సిటీ అధ్యయనవేత్త Amal Alachkar కను గొన్నారు. ప్రాథమికంగా ఎలుకలపై జరిపిన ఈ పరిశోధనల్ని ఇంకా క్షుణ్ణంగా చేస్తున్నట్టు చెప్పారు. స్కిజోఫ్రీనియా తీవ్రమైన దీర్ఘకాలిక మనోవైకల్యం. దీనిబారినపడిన వారు ఉన్నది లేనట్టు, లేనిది ఉన్నట్టు ఊహించుకుంటారు. భ్రాంతికి గురవుతారు. వాస్తవాన్ని గుర్తిం చలేరు. గర్భిణీలు పై ఆహారాలు అమితంగా తింటే పిల్లలు వీటి బారిన పడతారు. యాంటీ స్కిజోఫ్రీనియా ఔషధాల తయారీకోసమే ఈ పరిశోధనలు చేస్తున్నట్లు పరిశోధకులు చెప్పారు.

## ఒత్తిడివల్ల గర్భవిచ్ఛిత్తి

ఇరవైఏళ్ళ వయసులో ఎక్కువ ఒత్తిడికి గురయ్యే మహిళలకు గర్భవిచ్ఛిత్తి జరిగే అవకాశాలు ఎక్కువ. వీరిలో 42 శాతం కంటే ఎక్కు వగా గర్భవిచ్ఛిత్తి జరిగే అవకాశాలున్నాయి. అంటే కాబోయే తల్లి ప్రమేయం లేకుండానే గర్భం కోల్పో వడం, నెలలు నిండకుండా ప్రసవం లేదా బిడ్డ తొందరగా జన్మించి మరణించడం వంటి (Miscarriage) సమస్య లొస్తాయి. మొదటి ఆరునెలల్లో 20 శాతం గర్భవ తులకు ఈ సమస్య సర్వసాధారణమే. కానీ ఇటీవల యువతులు అధిక ఒత్తిడికి గురవుతున్నందువల్ల ఈ కేసులు చాలా ఎక్కువ పెరిగే అవకాశాలున్నాయని ఒక అధ్యయనం పేర్కొంది. Miscarriageకి, హై లెవెల్ స్ట్రెస్‌కి స్పష్టమైన సంబంధమున్నట్లు అధ్యయన విశ్లేష ణలు పేర్కొంటున్నాయి. లండన్ యూనివర్సిటీ కాలేజ్, చైనా Zhejang యూనివర్సిటీలలో ఈ అధ్యయనం చేశారు. యుక్తవయస్సుకు ముందే తీవ్ర ఒత్తిడి జీవితం, సుదీ ర్ఘకాలం ఒత్తిడికి గురయ్యే యువతుల్లో గర్భవిచ్ఛిత్తి ఎక్కువ. సాంఘిక సమస్యలు, మానసిక భావోద్వేగ వేదనలు, డబ్బు, భాగ స్వామి సమస్యలు, వంటి సైకలాజికల్ సవాళ్ళకు గురయ్యేవారిలో ఈ మిస్‌కేరేజ్ అవకాశం ఎక్కువ. యోగా, శ్వాస సంబంధ వ్యాయా మాలు, ఈత, వాకింగ్, మంచి సమతుల ఆహారం తీసుకోవడం, తొందరగా నిద్రించడం, ప్రేమించేవారి చెంత గడపడం ద్వారా మిస్‌కేరేజ్‌ను తప్పించుకోవచ్చునని అధ్యయనం పేర్కొంది.



## అల్జీమర్స్‌ను ముందే కనిపెట్టొచ్చు

అల్జీమర్స్‌ను ఇరవై ఏళ్ళు ముందుగానే కనిపెట్టే కంటి పరీక్ష అందుబాటులోకి రాబోతోంది. లాస్‌ఏంజిల్స్ నిపుణుల బృందం 16 మంది రోగులపై విజయవంతంగా ఈ పరీక్షలు నిర్వహించింది. అల్జీమర్స్ వ్యాధిని కని పెట్టడానికి రెటీనాయే అతి ముఖ్యమైన వనరుగా వారు పేర్కొన్నారు. పదేళ్ళ క్రితం కేవలం మరణించినవారిపైనే ఈ పరిశోధనలు చేసేవారు. ఇప్పుడు నేరుగా పిఇటి పరీక్షచేసి ఈ వ్యాధి లక్షణాలు ముందే కనిపెట్టవచ్చునని cedars-Sinai రీసెర్చ్ టీం సీనియర్ లీడ్ ఆథర్ డాక్టర్ మాయా కొరొన్యో చెప్పారు. అల్జీమర్స్‌ను కనిపెట్టే స్క్రీనింగ్ డివైజ్‌గా ఈ eye scan ఉపయోగపడగలదని న్యూరోసర్జరీ విభాగం రీసెర్చ్ అసోసియేట్ యోసెఫ్ కొరొన్యో చెప్పారు. ఈ రెటీనా పరీక్ష వల్ల బ్రెయిన్‌లో అల్జీమర్స్‌కు సంబంధించిన నిర్దిష్టమైన ప్రదేశాలను తెలుసుకునే అవకాశం ఉంటుంద న్నారు. ఈ రెంటికీ కోరిలేషన్ ఉంటుంది. దక్షిణ కాలిఫోర్నియా కామన్వెల్త్ ఎస్ఐఆర్ఓ విభాగంతో కలిసి ఈ పరిశోధనల్ని ఇంకా కొనసాగిస్తున్నారు.



–ప్రత్యూష

# మహావాస్తు

**'నివాసగృహం'లో, 'గృహావరణ'లో ఏ దిక్కున ఏమి ఉండవచ్చునో సూచించే 'సంక్షిప్త వాస్తు వివరణ చిత్రము'.**

వాస్తు విద్వాన్, సాయిశ్రీ

## గౌ. డా. దంతూరి పండరీనాథ్



వరండా, నీళ్ళ ట్యాంకు, లైబ్రరీ

ద్వారం, ఎయిర్ కండిషనర్, కూలర్, స్విమ్మింగ్ పూల్

మొక్కలు/లాన్స్ నీళ్ళు, ద్వారం త్రాగే నీళ్ళు

ఫ్రిజ్ డ్రెస్సింగ్ టేబుల్

ఉత్తరం

ఈశాన్యం

తూర్పు

ఆగ్నేయం

దక్షిణం

నైరుతి

పశ్చిమ

వాయువ్యం

కిటికి

అలమరా

మంచం తల పెట్టుకొని నిద్రించు స్థానం

చెట్లు/వార్డ్ రోబ్స్

డైనింగ్ టేబుల్/భారీ వస్తువులు సిటింగ్, ఫర్నీచర్

పైన వాటర్ ట్యాంక్ స్టోర్ రూమ్, వేస్ట్ రూమ్, టాయిలెట్

## ఇప్పటికే ఆలస్యమైంది

- ప్రయత్న లోపం లేదు. మంచి చదువు ఉంది. ఆదాయం ఉంది. మాది మంచి సాంప్రదాయం గల కుటుంబం. వివాహం ఇప్పటి వరకు కాలేదు. త్వరగా వివాహం జరిగేందుకు తగు సూచనలు ఇవ్వగలరు.

  – కె.ఎస్.ఎస్. గుంటూరు.

- మీరు జీవితంలో చాలా త్వరగా స్థిరపడుతారు. అయితే ఆదాయం (ఉద్యోగం)లో త్వరగా స్థిరపడితే వివాహం ఆలస్యమవుతుంది. వివాహం త్వరగా జరిగితే ఆదాయం లేటవుతుంది. అలా మీరు ఉద్యోగంలో స్థిరపడ్డారు. కాబట్టి వివాహం ఆలస్యమవుతుంది. ఇప్పటికే ఆలస్యమైంది. కాబట్టి ఇప్పుడైన జరగాలి. మీ వరకు ఒక 'రెమిడి' (ప్రత్యామ్నయం) చేప్తాను. పాటించండి. **రెమిడి:** ఎక్కడైనా ఎవరైనా బావి త్రవ్వుతున్నా లేక బోరు వేస్తున్నా సరే, అక్కడికి వెళ్లి, మనసులో మీ సంకల్పం చెప్పుకొని, ఒక టెంకాయ కొట్టి, హారతి ఇచ్చి, కొట్టిన టెంకాయను అక్కడే వదిలేసి వచ్చేయండి. వారం రోజుల తరువాత వివాహ ప్రయత్నాలు మొదలుపెట్టండి. పరిస్థితులు మీకు సానుకూలంగా ఉంటాయి.

**వచ్చేవారం... 'వివాహము ఎప్పడు? ఉద్యోగము వస్తుందా? రెమిడిస్ చెప్పండి..'**

మధుబాబు

# స్టార్ ఫైటర్

అనబడే ఫైటింగ్ ఫూల్

11



**మొక్కజొన్న చేనులో జొరబడిన పశువులు ఇష్టం వచ్చినట్టు కలియతిరిగినట్టు చెల్లాచెదురై ఉన్నది ఇసుకగుట్ట మీది ఇసుక. స్పష్టంగా కనిపిస్తున్నాయి బోలెడన్ని అడుగుజాడలు.**

**మందపాటి చర్మంతో తయారు చేయబడిన పాదరక్షలు ధరించినవారు గందరగోళంగా అటూ ఇటూ తిరిగిన గుర్తులు అవి.**

చటుక్కున తలతిప్పి తనను అక్కడికి తీసుకు వచ్చిన దృఢకాయుల పాదాల వైపు చూశాడు సూసీయన్.

ఒంటిమీద దృఢమైన కవచాలున్నాయి. తలల మీద దట్టమైన తలపాగాలున్నాయి. పాదాలు మాత్రం దిగంబరంగానే ఉన్నాయి. పాదరక్షలు లేనేలేవు.

'మేము ఇక్కడికి రావటం వల్ల ఏర్పడిన జాడలు కావు అవి' సూసీయన్ ఆలోచనలు తనకు అర్థం అయిపోయినట్లు ముక్తసరిగా చెప్పాడు దృఢకాయుల నాయకుడు.

కనులు చిట్లిస్తూ మరోసారి ఆ అడుగుజాడల వైపు చూసిన సూసీయన్ కనుల ముందు ప్రత్యక్షం అయ్యారు షీకూ కోటలో స్థావరం ఏర్పాటు చేసుకుని సముద్రతీరం మీద ఒక కన్నువేసి ఉంచే సైనికులు.

మందంగా ఉండే చర్మంతో తయారుచేయబడిన పాదరక్షలను ధరించటం వాళ్ళ సంప్రదాయం. అడ్డదిడ్డంగా పడివుండే బండల మీదుగా ప్రయాణం చేసేటప్పుడు పాదాలకు హాని జరగకుండా, ఎగుడుదిగుడు ప్రదేశాల్లో సంచరించేటప్పుడు త్వరగా పాడైపోకుండా ఉండేందుకు మందపాటి చర్మం ఉపయోగించబడుతుంది, వారి పాదరక్షల నిర్మాణంలో.

తమ కర్తవ్య నిర్వహణలో భాగంగా ఆ సముద్ర తీరం దగ్గరికి వచ్చిన సమయంలో, ఈ డూడూ మహారాణిని చూసి, తమతో పాటు కోటలోకి తీసుకు పోయి ఉంటారా?

తనకు తెలియకుండానే భారమైన నిట్టూర్పు విడిచాడు సూసీయన్. కుంగ్‌ఫూ విద్యాపీఠం అంటే శత్రుత్వం ఏమీలేదు ఆ ప్రదేశాన్ని పరిపాలిస్తున్న రాజవంశీయులకు. అందరి మాదిరిగానే తాము కూడా తలలు వంచి తమ గౌరవం ప్రకటిస్తూ ఉంటారు. మర్యాద ఇస్తారు, తిరిగి పుచ్చుకుంటూ ఉంటారు. మొట్టమొదటిసారిగా వారితో తల పట్లు పట్టే పరిస్థితి ఎదురుకాబోతున్న సూచనలు అగుపిస్తున్నాయి.

'ఆర్యులు ఏదో ఆలోచనలో పడినట్లున్నారు. మా మహారాణి వారిని అపహరించింది ఎవరో తమకు బోధపడిన సూచనలు మాకు కనిపించటం లేదు' ఉన్నట్లుండి దృఢకాయుల నాయకుడు మాట్లాడటంతో, వదిలిపోయింది సూసీయన్‌ని ఆవరించుకున్న అదోరకమైన మగత.

'ఈ పనిచేసింది ఎవరో మాకు చూచాయగా బోధపడింది. నేను వెంటనే వెళ్ళి నా ఆలోచన సరైనదో కాదో తెల్సుకు వస్తాను' అంటూ ఒక్క క్షణం ఆగాడు.

'ఆర్యులు ఎందుకో తటపటాయిస్తున్నట్టుగా అనిపిస్తోంది' అన్నాడు దృఢకాయుల నాయకుడు.

'నేను తిరిగి వచ్చేంతవరకూ మీరు సంయమనం పాటించండి. సముద్రాన్ని అల్లకల్లోలం చేయకూడదు. తీర ప్రాంతానికి నష్టం కలిగించకూడదు' అన్నాడు సూసీయన్.

'మా సామ్రాజ్యానికి వారసుడిని అందించవలసిన మా మహారాణి దారుణమైన కష్టంలో చిక్కుపడి ఉన్నప్పుడు మేము సంయమనం పాటించటం ఎలా సాధ్యం?' అడిగాడు అతను.

'మీరు నివసించే ద్వీపం కాదు ఇది. ఈ ఒక్క ప్రదేశాన్నే కాదు, ఇటువంటి తీరప్రాంతాల్ని ఎన్నింటిని మీరు నాశనం చేసినా, ఏమీ ఉపయోగం ఉండదు. తీరానికి దూరంగా వెళ్ళి ప్రాణాలు కాపాడుకుంటారు ప్రజలు. బరువైన బరిశెల్ని, దారుణమైన ప్రేలుడు పదార్థాలను తీసుకుని మీ మీదికి యుద్ధానికి వస్తారు సైనికులు. ముందుగా మీరు నాశనం అయిపోతారు. ఆ తరువాత మీ జలచరాలు ప్రాణాలు పోగొట్టుకుంటాయి. సముద్రాన్ని రెచ్చ



### జరిగిన కథ

కుంగ్‌ఫూ విద్యాపీఠానికి కాబోయే పీఠాధిపతి ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు షాడో. కాంటన్ సిటీ చేరి, హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. డూడూ సామ్రాజ్యం గురించి గంగారాంకి చెబుతుంటాడు షాడో. కుంగ్‌ఫూ విద్యాపీఠాధిపతి సూసీయన్ దగ్గరకు గ్రామీణులు కొంతమంది వచ్చి, సముద్రం బారినుంచి తమను రక్షించమని వేడుకుంటారు. దాంతో అక్కడికి చేరిన సూసీయన్‌కి, తమ మహారాణిని వెతకటం కోసమే ఆవిధంగా సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తున్నట్లు చెబుతారు డూడూ సామ్రాజ్యపు దృఢకాయులు. ఆ తర్వాత...

గొట్టటం వరకే మీకు చేతనైన పని. బహుముఖ వ్యూహాలతో యుద్ధం చేయటానికి మీ బలం సరిపోదు' అన్నాడు సూసీయన్.

'ఇదంతా మీ మహారాణిని బంధించడం వల్ల జరుగుతున్నదని అర్థం అయిన మరుక్షణం ఆమె ప్రాణాలు తీయబడతాయి' అని కూడా చెప్పాడు. ఎండ ముఖం తెలియని వారి మాదిరి తెల్లగా ఉన్నాయి ఆ వ్యక్తుల వదనాలు. మరింత తెల్లగా మారిపోయాయి ఆ మాటల్ని వినగానే.

'సముద్రంలో ఉన్న తిమింగలాలన్నీ మా ఆధీనంలో ఉంటాయి. అవసరం అయితే ఈ భూభాగాన్ని మొత్తం నీటిలో ముంచి తేల్చగల బడబాగ్ని పరికరాల్ని తయారుచేసే శక్తి మాకు ఉన్నది' పెదవులు బిగపడుతూ బింకంగా అన్నాడు దృఢకాయుల నాయకుడు.

చిరునవ్వు నవ్వటమైతే నవ్వాడు గాని, లోలోపల ఆందోళన చెందకుండా ఉండలేకపోయాడు సూసీయన్.

మూరెడు మూరెడు పొడుగున్న పెట్టెల్లోని పదార్థమే చెప్పలేనంత చెడుపును ఉత్పత్తి చేస్తోంది. బారెడు బారెడు పెట్టెలను తయారుచేసి వాటిలో ఆ విధ్వంసక పదార్థాన్ని నింపితే?

ఆపైన ఏం జరుగుతుందో ఊహించటానికి కూడా ఒప్పుకోలేదు అతని అంతరంగం.

'అటువంటి అవసరం రాదనే నేను అనుకుంటున్నాను. మీరు ప్రశాంతంగా ఇక్కడే కూర్చుని నా కోసం వేచి యుండండి' అని చెప్పి, వేగంగా ఇసుక గుట్ట మీది నుంచి దిగాడు. పెద్దపెద్ద అడుగులు వేస్తూ షీకూ కోటవైపు నడవటం మొదలు పెట్టాడు.

***

'ఏం జరిగింది గురూ? తర్వాత ఏం చేశాడు?' క్షణక్షణానికి కుతూహలం అధికం అయిపోతూ ఉండడంతో, ఆత్రుతగా అడిగాడు గంగారాం.

'నాకు ఆకలి చాలా ఎక్కువ అయిపోతోంది. ముందు తిండి. తర్వాత కథ' నిర్మోహమాటంగా చెప్పాడు షాడో.

'నువ్వు ఎప్పుడూ ఇంతే. మంచి రసపట్టులో పడిన విషయాన్ని వదిలేసి ఏవో మాటలు మాట్లాడతావు' అంటూ కూర్చున్న చోటు నుంచి లేచి, చెట్ల తోపులోనుంచి బయటికి వచ్చాడు గంగారాం.

వెనక్కి తిరిగి సిటీలోకి వెళ్ళేందుకు వీలులేదని తెలుసు అతనికి. వరసపెట్టి అవమానాలపాలు అవుతున్న హుహుశాన్ చంచాలు, రెట్టించిన పట్టుదలతో వీధులన్నిటినీ కనిపెట్టుకుని ఉంటారు. అనుమానం వచ్చిన వెంటనే పిచ్చిపట్టిన వారి మాదిరి మీద పడి ముక్కెలు విరగేస్తారు.

ముందుకే నడిచాడు అతను. ఒక అరగంట తరువాత అతనికి కనిపించింది చెక్క ఇళ్ళతో నిండి ఉన్న చిన్న పల్లెటూరి వంటి సెటిల్మెంటు.

'ధర్మదేవతకు ప్రతిరూపాలనదగిన ధర్మాత్ములు ఎవరో ఒకరు ఇక్కడ తప్పకుండా ఉండి ఉంటారు. మనం చెప్పే మాటలకు తల్లకిందులైపోయి ఏదో ఒక సాయం చేయకుండా ఉండరు' అనుకుంటూ అక్కడ కనిపించిన ఒకే ఒక మట్టిరోడ్డు మీద కాలు మోపాడు.

పది అడుగులే వేశాడు. పదకొండో అడుగు వేయకముందే అతనికి కనిపించింది ఒక కిరాణా దుకాణం.

మందపాటి గోనె సంచుల్లో బియ్యం పోసి దుకాణం ముందు భాగంలో నిలబెట్టి, వాటికి కొంచెం పై భాగంలో ఫెళఫెళా ఎండిన ఎండుచేపల్ని వేలాడదీశాడు ఆ దుకాణం యజమాని.

ఉప్పులో ఊరబెట్టి, భగభగలాడే ఎండలో ఎండబెట్టిన మాంసఖండాల్ని కూడా సన్నపాటి ఇనుప కొక్కేలకు గుచ్చి ఒక పక్కన ప్రముఖంగా కనిపించేటట్టు ప్రదర్శిస్తున్నాడు.

వెడల్పాటి వెదురు పళ్ళేలలో ఎర్రటి టొమే



టోలు, పచ్చటి క్యాబేజీలు, ఇంకా పేర్లు చెప్పటం కుదరని కూరగాయల్ని కూడా అమ్మకానికి ఉంచాడు.

'పరాయి దేశస్థులం మేము. పదిమందిమి ఉన్నాం. తెచ్చుకున్న తిండి నిన్న రాత్రితో నిండుకు పోయింది. వండుకోవటానికి అవసరమైన సామాగ్రి దారి మధ్యలో ఒక వాగు దాటుతున్నప్పుడు నీటిలో పడి కనిపించకుండాపోయింది...' దుకాణం ముందుకు పోయి తన గోడు వెళ్ళబోసుకున్నాడు గంగారాం.

ఆ వ్యక్తి చుబుకం మీద, మూరెడు పొడుగు ఉన్నది సన్నపాటి గడ్డం. రొయ్యలకు ఉన్నట్లు సన్నగా బారెడు పొడుగున కిందికి వేలాడుతున్నాయి మీసాలు.

'సొల్లుమాటలు వినీ వినీ నా నెత్తిమీద వెంట్రు కలన్నీ రాలిపోయి చాలాకాలం అయింది. పల్లె టూరిలో కనిపించానని నాకు టోపీ పెట్టద్దు' నిర్మొహ మాటంగా సమాధానం ఇచ్చాడు.

తను చెప్పబోయే మాటల్ని పూర్తిగా వినిపించు కోకుండా అతను ఆ విధంగా మాట్లాడటాన్ని భరించ లేకపోయాడు గంగారాం. పెదవులు ముడిచి క్రూరంగా చూడబోయాడు.

'అరేయ్... ఒక్కసారి ఇటు వచ్చి వెళ్ళండి' బిగ్గ రగా అన్నాడు ఆ మనిషి.

బిలబిలలాడుతూ దుకాణం ముందుకు వచ్చి ఫెన్సింగ్ పోస్టుల మాదిరి గంగారాం వెనుక నిలబ డ్డారు అరడజను మంది వ్యక్తులు.

పిడికిళ్ళు బిగించి వారందరినీ చెల్లాచెదురు చేయటం తనకు చాలా తేలిక అని గంగారాంకి తెలుసు. క్రిందికి నెట్టి మెడల మీద కాలువేసి అణి చేయటం కూడా ఏమంత కష్టమైన పని కాబోదు. కానీ, వట్టిగా కనిపించటం లేదు వాళ్ళు. అందరి చేతుల్లోను పొడుగాటి కర్రలున్నాయి. వాటిలో ఏ ఒక్కటి తన తలకు తగిలినా, రెండు చెక్కలవటం చిటికెలో జరిగిపోతుంది. తెలివితప్పి పడిపోవటం కూడా వెంటనే జరిగిపోతుంది.

పెదవులు ముడిచి క్రూరంగా చూడాలన్న కోరికను వెంటనే అదుముకుని, చాలా అందంగా నవ్వాడు అతను.

'నివసించేది పల్లెటూరిలోనే అయినా, మీ ముఖ కవళికలు చూస్తుంటే కాంటన్ నగరంలోని సెంట్రల్ పార్క్ దగ్గర వ్యాపారం చేసుకునేవాళ్ళ మాదిరి కని పించబట్టి, మీ ముందుకు వచ్చి, నా బాధను గురించి చెప్పాను. మీరు తప్పుగా అర్థం చేసుకు న్నారు' అన్నాడు మెత్తటి మాటలతో.

'సరే సరే. ఏంటో త్వరగా చెప్పు' విసుగ్గా అన్నాడు ఆ మనిషి.

'వంట చేసుకోవాల్సిన అవసరం లేకుండా మీరు మా చేతికి ఇచ్చిన మరుక్షణం మేము నోటిలో పెట్టు కోవటానికి...' అంటూ మాటని ఆపాడు గంగారాం.

**ఆవేశంగా, పిడికిళ్ళు బిగించి మరీ ఆ దుకాణంలోకి అడుగుపెట్టాడు షాడో. తనకు అడ్డువచ్చిన బియ్యపు మూటను కాలితో తన్నబోయి, ఆఖరిక్షణంలో ఆగిపోయాడు. లోపల గోడకు వేలాడుతున్న ఫొటో చూడటమే అందుక్కారణం. ఇంతలో నలుగురు దృఢకాయులు అతనిముందు ప్రత్యక్షమయ్యారు. అసలు షాడో ఎక్కడికి వచ్చాడు? అతను చూసిన ఫొటో ఎవరిది?**

తన వెనుక ఉన్న అరలో నుంచి మూరెడు మూరెడు పొడుగున్న లావుపాటి రొట్టెల్ని ముందుకు లాగాడు ఆ మనిషి. 'వట్టి రొట్టెలే ఇవి. నంజుడుకు ఏదైనా కూరో నారో ఉంటే బాగుంటుంది' అంటూ వాటి ధరను తన చేతివేళ్ళతో చూపించాడు.

కూర, నార కావాలంటే కుదిరే పని కాదని తెలిసి ఉండడంవల్ల, ఒక పక్కకిపోయాడు గంగారాం. రొట్టెల్ని తీసుకోవటం ఇష్టం లేకకాదు. వాటిని ఖరీదు చేయటానికి అవసరమైన చిల్లరను తన దుస్తుల్లో నుంచి బయటికి తీయటానికి.

అతను ధరించి ఉన్న పైజమా అడుగు భాగంలో, చీలమండలకు దగ్గరగా కట్టబడి ఉన్నది బయటికి కనిపించని జేబు ఒకటి. అందులోనుంచి చిన్న నోట్ల పొత్తికను బయటికి తీశాడు.

తను కూర్చున్న ప్రదేశంలో నుంచి కదలకుండా, ఒంటె మాదిరి మెడ ముందుకు చాచి ఆ దృశ్యాన్ని చూడనే చూశాడు దుకాణం యజమాని.

చూసిన మరుక్షణం లౌడ్‌స్పీకర్ వంటి గొంతు కతో 'దొంగ....దొంగ.. పట్టుకోండి...పట్టుకోండి' అని అరిచాడు.

అరుపు అతని నోటి నుంచి వెలువడిన వెంటనే కదిలారు ఫెన్సింగ్ పోస్టుల మాదిరి నిలబడి ఉన్న అతని అనుచరులు. కర్రలను గిరగిరా తిప్పుతూ వచ్చి గంగారాం మీద కలబడ్డారు.

పిడికిళ్ళు బిగించే వ్యవధి అతనికి లభించలేదు. తన సీక్రెట్ జేబులో నుంచి బయటికి తీసిన నోట్లను తిరిగి దాచిపెట్టుకోవటం కూడా చేతకాలేదు.

అతని భుజాల మీద ఎడాపెడా పడ్డాయి మూడు దెబ్బలు. భరించరాని బాధ అతని నరాలను జివ్వుమనిపించటం మొదలు పెట్టింది.

ఉన్నట్లుండి దుకాణంలో నుంచి బయటికి దూకాడు యజమాని. ఒక్క అంగలో వచ్చి, గంగారాం చేతిలో ఉన్న నోట్లను తను లాగేసుకున్నాడు.

'అన్యాయం అక్రమం' జీరగా అరిచాడు గంగారాం.

'తీసుకుపోండి.... తోసుకుంటూ నడవండి' ఆజ్ఞ ఇచ్చాడు యజమాని.

గంగారాం మెడ పట్టుకున్నాడు ఒక వ్యక్తి. చేతుల్ని వెనక్కిలాగాడు రెండవ వాడు. ముందుకు నెట్టటం మొదలుపెట్టాడు మూడవ వాడు.

అవసరం అయితే అడ్డగోలుగా వాళ్ళను అవత లకు నెట్టి తనకు తగిలిన దెబ్బల్ని లక్ష్యపెట్టకుండా పరుగులు తీయగలడు గంగారాం. కాని అలా చేయలేదు ఇప్పుడు.

'అమాయకులు అధికంగా నివసించే పల్లె టూరు ఇది. పట్నం కంటే పది రెట్లు దరిద్రంగా కని పిస్తోంది...' అనుకుంటూ వేచి చూడటానికే నిశ్చ యించుకుని తూలుతూ తూలుతూ నడిచాడు.

రచ్చబండ వంటి ఒక ప్రదేశం ఉంది గ్రామం మధ్యభాగంలో. అతన్ని అక్కడ నిలబెట్టి, పెద్ద కంఠంతో బిగ్గరగా అరిచాడు యజమాని.

వెంటనే పోగయినారు గ్రామస్థులు... గుంపుగా నిలబడి అదో రకంగా చూడటం మొదలుపెట్టారు.

'చూడండి... బాగా చూడండి. తినటానికి ఏదైనా ధర్మం చేయమని నా దుకాణం దగ్గరికి వచ్చి, నా గల్లా పెట్టెను ఖాళీ చేయబోయాడు' తాను లాక్కున్న నోట్లను గాలిలో ఊపుతూ అందరికీ చెప్పాడు యజమాని.

'ఖాళీ చేయబోయాడు గాని, పట్టుబడిపోయాడు కదా. రెండు తగిలించి అవతలికి నెట్టేయ్... ఇంకో సారి కనిపిస్తే కాళ్ళు విరగేస్తామని చెప్పు' అన్నాడు గుంపులోని మనిషి ఒకతను.

'వట్టొట్టి దెబ్బలు కొట్టి పంపించేస్తే వాడు మనల్ని చేతకాని వాళ్ళమని అనుకుంటాడు. ఒక చెయ్యి తీసేసి పంపిస్తే బాగా గుర్తుంటుంది' అన్నాడు దుకాణం యజమాని.

'చేసిన ఒక చిన్నపనికి అంతటి శిక్ష అనవసరం. కొట్టి పంపించేయ్' అన్నాడు ఆ మనిషి మరోసారి.

పళ్ళు బిగించి ఎడాపెడా మర్దించేశాడు దుకాణం యజమాని. తన చేతులు నొప్పి పుట్టాయి కాబోలు తన అనుచరులకు ఛాన్సిచ్చాడు.

పావుగంట తర్వాత తనంతట తానుగా లేచి నడవగలగడం అసంభవం అనే పరిస్థితికి చేరుకు న్నాడు గంగారాం.

'తీసుకుపోయి గ్రామం వెలుపల విసిరేయండి' అని ఆర్డర్ ఇచ్చి తన దుకాణం దగ్గరికి వెళ్ళిపోయాడు



అంతకుముందు తమ చేతుల్లో దెబ్బలు తింటు న్నప్పుడు భయంతో బిగదీసుకుపోయినట్లుగా కని పించిన మనిషి, ఇప్పుడు మదించిన ఏనుగు మాదిరి పరిగెత్తుకుంటూ రావటాన్ని చూసి ఆశ్చర్యంతో ఎక్కడి వాళ్ళక్కడ ఆగిపోయారు వాళ్ళు.

ఊపిరి తీసుకోవటానికి కూడా అవకాశం ఇవ్వ లేదు గంగారాం. సుడిగాలి మాదిరి చుట్టేశాడు. పిడికిళ్ళు బిగించి వీరకొట్టుడు కొట్టేశాడు. ఏం జరుగు తున్నదో అర్థం అయ్యేలోపుగానే, తమ ఆయు ధాలను వదిలేసి నేలను కౌగిలించుకున్నారు వాళ్ళు. తెలివి తప్పి కళ్ళు తేలవేశారు.

'జెండాస్తంభం మాదిరి ఊరికే నిలబడి చూస్తే సరిపోతుందా? వచ్చి సాయం చేయకూడదా?' తన వెనకే వచ్చి కొంచెం అవతలగా నిలబడిన షాడో మీద విసుక్కున్నాడు గంగారాం.

సాయం చేశాడు షాడో. ఆ వ్యక్తుల దుస్తుల్నే చించి తాళ్ళుగా మెలిపెట్టి కాళ్ళు, చేతులు కట్టేశాడు. చిన్నచిన్న ముక్కల్ని ఉండగా చుట్టి వాళ్ళ నోళ్ళల్లో కుక్కాడు. తెలివి వచ్చిన తర్వాత అరిచి కేకలు పెట్ట కుండా, గంగారాంకి శ్రమలేకుండా తనే మోసుకు పోయి ఒక దట్టమైన పొదవెనుక పడుకోబెట్టాడు.




'వాళ్ళు ఇక్కడ ఉన్నట్టు అందరికీ తెలియటానికి ఇంకో మూడు నాలుగు గంటలు పడుతుంది. ఆ లోపు మనం జంపైపోవాలి ఇక్కడినుంచి' అన్నాడు.

తనకు దేహశుద్ధి జరిగిన ప్రదేశానికి వంద గజాల దూరంలో ఉన్న ఒక ఇంటిని టార్గెట్ చేసు కుని అటు దారితీశాడు గంగారాం.

రెల్లుగడ్డి పైకప్పుగా ఉన్న ఇల్లు అది. రంగు రంగుల తోరణాలు, రెపరెపలాడే పతాకాలతో చాలా చక్కగా అలంకరించబడి ఉంది.

సందడి సందడిగా తిరుగుతున్నారు అనేక మంది స్త్రీలు. మిలమిలమెరిసే పొడవాటి అంగీల వంటి దుస్తులు ధరించి ఇంటి ముందున్న చాపల మీద కూర్చుని ఉన్నారు మగవాళ్ళు.

'నేను దెబ్బలు తింటూ ఉండగా చూసినవాళ్ళు వాళ్ళల్లో ఉండి ఉండవచ్చు. ఉంటే తిరిగి ఇంకోసారి తలంటి స్నానం చేయించవచ్చు' అంటూ మరి కొంచెం ముందుకు పోయాడు గంగారాం.

'ఎవరు నాయనా మీరు?' అంటూ ఉన్నట్లుండి అతని ఎదుట ప్రత్యక్షం అయింది ఒక వృద్ధురాలు.

'తల్లీ... మేము విదేశీయులం. ఆకలికి తట్టు కోలేక...' అంటూ నిజాయితీగా తన కథను వివరించ బోయాడు అతను.

'అయ్యో... ఆ ఎలుగుబంటి చేతిలో దెబ్బలు తిన్నది నువ్వేనా? ఎంతకష్టం వచ్చిందిరా నీకు. ఏ మాత్రం అవకాశం దొరికినా తన దగ్గరికి వచ్చిన వాళ్ళ నెత్తిన చేతులు పెట్టటానికే చూస్తాడు వాడు. ఆ హుహుశాన్ ప్రాపకం ఉందని గర్వం...' అంటూ గిరుక్కున వెనక్కి తిరిగి ఇంటిలోకి వెళ్ళిపోయిందామె.

'వెంటబెట్టుకు వస్తుంది తన వాళ్ళని. మన బుర్రలు రామకీర్తన పాడేస్తాయి. డౌట్ లేదు' అంటూ తన వెనుకే నిలబడి ఉన్న షాడో చేతిని పట్టుకుని, అక్కడినుంచి మాయం అయిపోవటానికి ప్రయ త్నించాడు గంగారాం.

నిలబడిన ప్రదేశంలో నుంచి ఒక్క అంగుళం కూడా జరగలేదు షాడో. 'వెయిట్ చేద్దాం. చూద్దాం ఏం జరుగుతుందో' అంటూ అలాగే నిలుచుండిపోయాడు.

ఆరు నిమిషాల తర్వాత ఒక బాలికతో నాలుగు పెద్దపెద్ద పింగాణీ ప్లేట్లను పట్టించుకు వచ్చింది వృద్ధురాలు.

'ఆకలితో ఇంటి దగ్గరికి వచ్చినవారికి ఎంతో కొంత ఆకలి తీరిస్తే ఆ దేవతలు సంతోషిస్తారని మా పెద్దలు చెప్పిన మాట. మీకు జరిగిన అన్యా యాన్ని సరిచేసే శక్తి మాకు లేదు. గ్రామంలో తిష్ట వేసుకు కూర్చున్న ఆ ఎలుగుబంటిని ఎదిరించే ధైర్యం లేదు. మీ ఆకలిని మాత్రం తీర్చగలను' అంటూ తీసుకువచ్చిన పింగాణీ పాత్రల్ని గంగా రాంకి, షాడోకి తనతో వచ్చిన పిల్లచేత ఇప్పించింది.

పదహారు సంవత్సరాలుంటాయి ఆ బాలికకి. తళతళలాడే పట్టు వస్త్రాలను ధరించి, పొడవాటి కేశాలను చిత్రవిచిత్రమైన ముడులతో ముచ్చటగా ముడుచుకుని ఉంది.

మెచ్చుకోలుగా తల ఊపిన గంగారాం భుజం తట్టి చిన్నగా నవ్వింది వృద్ధురాలు.

'నా మనవరాలు. ఈ సాయంత్రమే పెళ్ళి జరగ బోతున్నది. పెళ్ళికొడుకుది కాంటన్ నగరం. కట్నంగా వెయ్యి మీద రెండు వందల యువాన్లు అడిగారు. వెయ్యి మాత్రమే ఇవ్వగలమని చెప్పాం' అన్నది.

'బంగారు బొమ్మ మీ మనవరాలు. నన్ను అడి గితే అసలు కట్నం అవసరం లేదు. ఊరికే వెంట బెట్టుకుపోవచ్చు' అన్నాడు గంగారాం.

వేడివేడి పులుసు వంటి పదార్థం ఉన్నది పింగాణీ పాత్రల్లో. జొన్నపిండితో చేసిన రొట్టెల వంటివి ఏవేవో ఉన్నాయి.

రెండు జానల పొడవు ఉండే సన్నపాటి కోలాటం కర్రల వంటి రెండు పుల్లల్ని ఉపయోగించి తినటం ఆ దేశీయుల అలవాటని అతనికి తెలుసు.

'దేవుడు ఇచ్చిన చేతులు ఉన్నాయి. ఆ చేతు లకు చక్కటి వేళ్ళు ఉన్నాయి. వాటిని వదిలి ఈ కర్ర పుల్లలతో తినటం ఏమిటి గురూ?' షాడోకి తన బాధను చెప్పుకుంటూ, గబగబా పాత్రల్ని ఖాళీ చేశాడు. షాడో కూడా ఆరగించటం పూర్తవగానే, ఖాళీ పాత్రలను దగ్గర్లో ఉన్న ఒక నీటితొట్టె దగ్గరికి తీసుకుపోయి శుభ్రం చేయబోయాడు.

దూరంగా నిలబడి వారివైపే చూస్తున్న బాలిక వెంటనే అడ్డుకున్నది. 'అతిథులు మీరు... మాకు దేవుళ్ళతో సమానం. ఇటువంటి పని చేయకూడదు' అంటూ వారించి, తనే ఆ పని చేసింది.

'బంగారు తల్లివి నువ్వు. నిన్ను చేసుకునేవాడు నిజంగా చాలా అదృష్టవంతుడు' అన్నాడు గంగారాం.

అందమైన బుగ్గలు సొట్టలు పడేలా నవ్వి, ఇంట్లోకి వెళ్ళిపోయింది బాలిక. 'మీకు వీలుంటే సాయంత్రం పెళ్ళి వరకూ ఉండి, రాత్రికి మేము పెట్టే విందుభోజనం చేసి వెళ్ళండి. విశ్రాంతి అవ సరం అయితే' అంటూ దూరంగా ఉన్న ఒక పాకను చూపించింది.

అటువంటి మాటల్ని రెండవసారి చెప్పించు కునే అలవాటు గంగారాంకి లేదు. షాడో ఆలోచన ఏ విధంగా ఉన్నదో తెలుసుకోను కూడా తెలుసు కోకుండా, అతని చేతిని పట్టుకుని, ఆ పాక దగ్గరికి లాక్కుపోయాడు.

'మన అవసరం తీరిపోయింది. ఇక్కడ ఉండటం అనవసరం' అన్నాడు షాడో.

'పాప మనస్తత్వం మంచిది. కాంటన్ నగరం పేరు ఒక్కటే నాకు ఎందుకో అనుమానాన్ని కలిగి స్తోంది' అన్నాడు గంగారాం.

'పెళ్ళిలో ఏదైనా రచ్చ జరుగుతుందని అను కుంటున్నావా?' పాకలో పేర్చి ఉన్న గడ్డిమేటల మీద నడుము వాలుస్తూ అడిగాడు షాడో.

'అక్కడ ఉన్నవాళ్ళలో చాలామంది వట్టి దురాశ పరులు. అదే నా సందేహం. అది తీరిన తర్వాత మనం వెళ్ళిపోదాం' అతనికి రెండు మూరల దూరంలో తను కూడా వెల్లకిలా పడుకుంటూ అన్నాడు గంగారాం.

రెండే రెండు నిమిషాల్లో గాఢమైన నిద్రలోకి జారిపోయాడు షాడో. అతను నిద్రకు వశుడైనట్టు తెలిసిన వెంటనే పైకి లేచి, పాకను ఆనుకుని ఉన్న ఒక చెట్టుకింద కూర్చున్నాడు గంగారాం.

దుకాణం యజమాని పిడికిలి తాకిన ప్రదేశాల్లో ప్రత్యక్షమైన కదుముల్ని అరచేతులతో అద్దుకుంటున్న సమయంలో, అతని చెవులకు చేరాయి కొన్ని ఏడు పులు.

ఓరగా తెరిచిన పాక తలుపుల్ని గట్టిగా మూసి, చిన్నచిన్న అడుగులు వేస్తూ ఇంటి పక్క భాగంలోకి పోయాడు అతను.

బిక్కచచ్చిపోయినట్లున్న తన మనవరాలి తలను గుండెలకు అదుముకుని బావురు బావురుమని ఏడుస్తున్నది వారికి ఆహారం ఇచ్చిన వృద్ధురాలు.

***(ఇంకా వుంది)***

యజమాని.

ముళ్ళకంపను ఈడ్చినట్టు ఈడ్చుకుంటూ తీసుకు పోయి గ్రామం వెలుపల ఉన్న ఒక పెద్ద గోతిలోకి గంగారాంని నెట్టి, చేతులు దులుపుకుంటూ వెళ్ళి పోయారు అతని అనుచరులు.

జానెడు లోతున నీళ్ళున్నాయి ఆ గోతిలో. తడిసి పోయాయి గంగారాం దుస్తులు. తగిలిన దెబ్బలు ఆ నీళ్ళ చల్లదనాన్ని భరించలేక సలపటం ప్రారం భించాయి.

చేతులు కిందపెట్టి పైకి లేవటానికి ప్రయత్నం చేస్తుండగా, అతని భుజాల్ని పట్టుకున్నాయి రెండు బలిష్ఠమైన హస్తాలు. అవలీలగా పైకి ఎత్తి గొయ్యి పైభాగంలో ఉన్న ఒక చికిలింత పొద పక్కన పడుకో బెట్టాయి. 'నువ్వు చూస్తూనే ఉన్నావు. ఆ దొంగ నాయాళ్ళు నా ఒళ్ళు హూనం అయ్యేటట్టు కొడు తుంటే, చిదానందంగా నవ్వుకుంటున్నావు కదూ?' కచ్చగా అడిగాడు గంగారాం.

'ఎవరో ఉప్పు చేపలు అమ్ముకునే ఒక వెధవ నీ మీద లేనిపోని అభాండాలు వేస్తుంటే ఎగిరి గుండెల మీద తన్నకుండా కామ్‌గా ఎందుకు తన్నులు తిన్నావు?' సిగరెట్ పొగను రింగులు రింగులుగా వదులుతూ అడిగాడు షాడో.

'ఎందుకు తిన్నానో మాటల్లో చెపితే నీకు అర్థం కాదు. నువ్వు వెళ్ళి స్వయంగా చూస్తే అర్థం అవు తుంది' అన్నాడు గంగారాం.

మూడు వంతులు కాలిన సిగరెట్‌ని అవతలకు విసిరి, పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని, గ్రామం లోకి బయలుదేరాడు షాడో.

'జాగ్రత్త... నిన్ను కూడా తీసుకువచ్చి ఇక్కడే పడేస్తారు. నిన్ను గోతిలోనుంచి బయటికిలాగే ఓపిక నాకు లేదు' చిన్నగా అరిచి అతన్ని హెచ్చరించాడు గంగారాం.

నెమ్మదిగా నడిచి దుకాణం దగ్గరికి చేరుకు న్నాడు షాడో.

'ఎవరివి నువ్వు? విదేశీయుడవేనా?' అతన్ని చూడగానే కరుకుగా అడిగాడు యజమాని.

ఒక పాదాన్ని ముందుకు జాచాడు షాడో. రెండో పాదంతో దగ్గర్లో ఉన్న బియ్యపు మూటను గాలిలోకి ఎగిరిపోయేటట్లు తన్నబోతూ, ఆఖరి క్షణంలో ఆగిపోయాడు.

దుకాణం యజమాని కూర్చుని ఉన్న కుర్చీ వంటి ఆసనానికి వెనుకభాగంలో గోడకు తగిలించి ఉన్నది, ఎవరి అనుచరులకు చిక్కకుండా తాము పారిపోయి వచ్చారో ఆ హుహుశాన్ ఫొటో ఒకటి.

'అయ్యగారూ... మీకు హుహుశాన్ సారు తెలుసా?' బియ్యపు మూటను ఎగిరి తన్నాలన్న కోరికను అదిమేసుకుంటూ వినయంగా అడిగాడు.

'తెలుసా ఏమిటి? నాకు దేవుడు! ఆయన దయాధర్మ భిక్షంతోనే నేను ఈ దుకాణాన్ని నడుపు కుంటున్నాను. నన్ను ఎవరూ మోసం చేయకుండా ఆయనే కాపలా కూడా ఏర్పాటుచేశాడు' అంటూ చిన్నగా చేతులు తట్టాడు యజమాని.

అంతకుముందు మాదిరిగానే కర్రలతో వెంటనే ప్రత్యక్షమయ్యారు అతని అనుచరులు ముగ్గురు.

'హుహుశాన్ ప్రాపకం లభించిందంటే మీరు నిజంగా అదృష్టవంతులు' మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు షాడో.

'సరే సరే ఇంతకీ నువ్వు ఎందుకు వచ్చినట్టు?' అడిగాడు యజమాని.

తిండికి సంబంధించిన సరుకు అడిగితే, అడి గిన వెంటనే అతను తనను గంగారాంతో కనెక్ట్ చేసేస్తాడని అర్థమై, సిగరెట్ పాకెట్ కేసి చూపిం చాడు షాడో. చూపిస్తూనే జేబులు తడుముకుని, తెల్లముఖం వేశాడు.

'ఏంటీ సంగతి?' అనుమానంగా అడిగాడు యజమాని.

'డబ్బు తేవటం మర్చిపోయాను. ఇప్పుడే వెళ్ళి తీసుకువస్తాను' అంటూ గిరుక్కున వెనక్కి తిరిగి, ఫెన్సింగ్ పోస్టుల మాదిరి నిలబడి ఉన్న అతని అనుచరుల మధ్యగా గ్రామం వెలుపలికి వచ్చేశాడు షాడో.

'వాడు ఎవడు?' తన అనుచరుల్ని చూస్తూ అడిగాడు యజమాని.

తలలు అడ్డం తిప్పారు వాళ్ళు తమకు తెలియ దన్నట్లు.

'దెబె ముఖాలు వేసుకుని నిలబడటం దేనికి? పోయి చూసిరండి!' క్రూరంగా చెప్పాడు యజమాని.

***

'నిజమే గంగూ... నువ్వు చేసింది కరెక్టు. వాడి ఒంటిమీద చెయ్యివేస్తే వెంటనే హుహుశాన్ చెవికి చేరిపోతుందీ వార్త' నీళ్ళ గొయ్యి దగ్గర గంగారాం పక్కన కూర్చుంటూ చెప్పాడు షాడో.

'జరిగింది ఏమిటో, ఎందుకు జరిగిందో తెలుసు కోకుండా తొందరపడి మాటలు వదలటం నీకు ఈ మధ్య బాగా అలవాటు అయిపోయింది గురూ... ఆ అలవాటును నువ్వు మార్చుకోకపోతే చాలా కష్టం' అంటూ పళ్ళు బిగపట్టి దెబ్బల బాధను ఓర్చు కుంటూ పైకి లేచాడు గంగారాం.

'ఎక్కడికి?' అడిగాడు షాడో.

'ఆకలి వేస్తోందని అన్నావు కదా. నీకే కాదు. నాకు కూడా వేస్తోంది' అన్నాడు గంగారాం. అంటూనే ఇంకో పక్కనుంచి గ్రామంలోకి బయలుదేరాడు.

'హుహుశాన్ అధికార పరిధి ఈ గ్రామం వరకూ విస్తరించి ఉందని తెలిసిన తర్వాత కూడా, ఇంకోసారి వెళ్ళటం అవసరమా?' అని అడుగుతూ అతన్ని అనుసరించాడు షాడో.

'హుహుశాన్ పేరు చెపితే మనకి ధైర్యం దిగ జారిపోవచ్చేమోగాని, ఆకలి మాత్రం అణిగిపోదు. ముందు తిండి... తర్వాత మిగిలిన విషయాలు' అన్నాడు గంగారాం.

'కాదు. ముందు మిగిలిన విషయాలు... తర్వాత తిండి' సడన్‌గా అన్నాడు షాడో, నడుస్తున్న వాడు కాస్తా ఆగిపోయి.

ఆశ్చర్యంగా చూడబోయిన గంగారాంకి వెంటనే కనిపించారు తనను నీళ్ళ గోతిలోకి దొర్లించిన మనుష్యులు.

వీళ్ళు వెనక్కిపోతే మళ్ళీ గొడవ మొదలవు తుంది' అంటూ ఉన్నట్లుండి షాడోని పక్కకు నెట్టి బాణం మాదిరి ఆ మనుష్యులకు ఎదురుపోయాడు గంగారాం.

## ఆఫర్లు తగ్గాయట!

బాహు

బలిలో అవంతికగా తన అందంతో మతిపోగొట్టిన తమన్నా ఓ వైపు స్టార్ హీరోయిన్‌గా రాణిస్తూనే అడపాదడపా స్పెషల్‌సాంగ్స్ చేస్తూ క్రేజ్ సంపాదిస్తోంది. బాహుబలి తర్వాత తమన్నా చేసిన సినిమాలు తక్కువనే చెప్పాలి. ఆఫర్లు కూడా తగ్గిపోయాయి. అయితే తాజాగా ఎన్టీఆర్ త్రిపాత్రాభినయం చేస్తున్న జై లవకుశ సినిమాలో ఓ స్పెషల్ సాంగ్ చేయడానికి మిల్కీబ్యూటీ ఒప్పుకున్నట్లుగా సమాచారం. అంతేకాదు కల్యాణ్‌రామ్ హీరోగా రానున్న ఓ సినిమాలో ఈ అమ్మడు నటించబోతుందన్న వార్త ఫిల్మ్‌నగర్‌లో చక్కర్లు కొడుతోంది.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ సమస్యకు సరైన పరిష్కారం (గర్భాశయ కణితులు)



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత గణాంకాల రీత్యా దాదాపు 171 మిలియన్లకు పైగా స్త్రీలు ఈ యుటెరైన్ ఫైబ్రాయిడ్స్‌తో బాధ పడుతున్నారంటే, ఈ వ్యాధి స్త్రీల పట్ల ఎంత ప్రమాదకరంగా మారిందో మనం ఊహించవచ్చు. 30 నుండి 50 సంవత్సరాల మధ్య వయస్సు గల స్త్రీలలో యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ ఎక్కువగా ఏర్పడే అవకాశం ఉంటుంది. పిల్లల్ని కనే వయస్సు స్త్రీలలో కూడా ఇవి ఎక్కువగా ఏర్పడవచ్చు. కాబట్టి దాదాపు 5-10 శాతం వరకు స్త్రీలలో సంతానలేమికి యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ కారణమవుతున్నాయి.

**యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ అనగా:** గర్భాశయంలో ఏర్పడే కణితులను లేదా గడ్డలను యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ అని అంటారు. ఇవి సాధారణంగా గర్భాశయపు కండర కణజాలంలో ఏర్పడతాయి. ఈ కణితులు ఒకటిగా గానీ లేదా చిన్నచిన్న కణితులు - గుంపులుగా గానీ ఏర్పడతాయి. పరిమాణం రీత్యా ఈ యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ మిల్లీమీటరు మొదలుకొని కొన్ని సెంటీమీటర్ల వరకు పెరుగుతాయి. గర్భాశయంలో ఈ కణితులు ఏర్పడే ప్రాంతపు ఉనికి-ఎదుగుదల రీత్యా ఇవి మూడు రకాలుగా కనిపిస్తుంటాయి.



**'యుటెరైన్ ఫైబ్రాయిడ్స్' రకాలు మరియు 'సంతానలేమి'పై వాటి ప్రభావం:**

**(1) సబ్ సీరోసల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయపు వెలుపలి గోడలపై ఇవి ఏర్పడతాయి. 'సంతానలేమి'పై వీటి ప్రభావం చాలా తక్కువగా ఉంటుంది. కానీ వీటి పరిమాణం పెరిగే కొద్దీ ఇవి 'సంతానలేమి'పై తమ ప్రభావం చూపుతాయి.

**(2) ఇన్‌ట్రామ్యూరల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయపు గోడల మధ్యలో ఇవి ఏర్పడతాయి. ఇవి చాలా సాధారణమైనవి. వీటి పరిమాణాన్ని బట్టి ఇవి గర్భాశయం యొక్క ఆకారాన్ని మార్చివేయడంతో పాటు గర్భాశయ కుహరాన్ని (గదిని) చిన్నదిగా చేసి పిండం ఎదుగుదలను అడ్డుకుంటాయి లేదా గర్భస్రావానికి దారితీస్తాయి.

**(3) సబ్‌మ్యూకోసల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయంలో ఉండే మ్యూకోజల్ పొరలో ఇవి ఏర్పడతాయి. ఇవి పిండం యొక్క ప్రతిస్థాపనను (Implantation) మరియు ఎదుగుదలను అడ్డుకొని సంతానలేమికి దారితీస్తాయి. • ముఖ్యంగా ఈ కణితులు గర్భాశయం అంచులో ఉండే ఫెలోపియన్ ట్యూబ్స్ పైన ఒత్తిడి పెరగటం వలన గానీ, అండం ప్రయాణించే దిశలో అడ్డంకులు ఏర్పడటం వలన గానీ సంతానలేమి సమస్యలు ఏర్పడే అవకాశం ఉంది. • కొందరిలో గర్భాశయం ముఖద్వారం అనగా సర్విక్స్‌లో ఫైబ్రాయిడ్స్ ఏర్పడటం వలన శుక్రకణాలు వెళ్ళే దారిలో అవి అడ్డు తెరలుగా రూపొందుతాయి. దీనివలన కూడా సంతానలేమి సమస్యలు ఏర్పడే అవకాశం ఉంది. • యుటెరైన్ ఫైబ్రాయిడ్స్‌తో బాధపడే గర్భిణీలలో, పిండంతో పాటుగా ఫైబ్రాయిడ్ పెరగడం వలన గర్భాశయంలో ఎదుగుతూ ఉండే పిండానికి సరైన పోషణ అందక గర్భస్రావం అయ్యే అవకాశాలు ఉన్నాయి.

---

**'యుటెరైన్ ఫైబ్రాయిడ్స్' లక్షణాలు:** వీటి లక్షణాలు - అవి ఏర్పడిన స్థలము, పరిమాణము మరియు వాటి యొక్క సంఖ్యను బట్టి ఉంటాయి. కణితులు చిన్నవిగా ఉంటే లేదా మెనోపాజ్ వచ్చే దశలో ఉంటే - దాదాపు లక్షణాలేవీ కనిపించకపోవచ్చు మరియు ఋతుచక్రము ఆగిపోయిన వారిలో ఇవి కుంచించుకుపోవచ్చు.

**ఈ లక్షణాలను గమనించవచ్చు:** ఋతుచక్రములో అధిక రక్తస్రావము లేదా ఋతుస్రావము ఎక్కువ రోజులు కొనసాగడం, నడుము నొప్పి, కడుపు నొప్పి, కాళ్ళలో నొప్పి • ఫైబ్రాయిడ్స్ వలన మూత్రాశయం మీద ఒత్తిడి పెరిగి తరచూ 'మూత్రానికి వెళ్ళాలి' అనిపించడం • ప్రేగులపై అధిక ఒత్తిడి వలన మలబద్ధకం, కడుపుబ్బరం తలెత్తవచ్చు. • అధిక రక్తస్రావము వలన రక్తహీనత ఏర్పడవచ్చు.

---

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలను బట్టి గానీ మరియు పెల్విక్ ఎగ్జామినేషన్, అల్ట్రాసౌండ్, ట్రాన్స్ వెజైనల్ స్కాన్, రక్తపరీక్ష, యమ్.ఆర్.ఐ., బయాప్సీ, హిస్టిరోస్కోపీ, హిస్టిరో సాల్పింగోగ్రఫీ, లాప్రోస్కోపీ వంటి పరీక్షల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయవచ్చు.

---

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో - గర్భాశయ కణితులను కరిగించడమే కాకుండా, హార్మోన్ల అసమతుల్యతను, ఋతుచక్ర సమస్యలను సరిచేసేందుకు గాను జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ సిమిలిమం ద్వారా సంపూర్ణ చికిత్సను అందివ్వడం జరుగుతుంది. అంతే కాకుండా శస్త్రచికిత్స చేసి, గర్భాశయాన్ని తొలగించే అవసరం లేకుండా, కేవలం మందుల ద్వారానే ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు. తద్వారా సంతానానికి మార్గం సుగమం చేయవచ్చు.

**టోల్ ఫ్రీ 1800 108 1212** | కన్సల్టేషన్ ఉచితం **955 000 1199** | www.homeocare.in




**ఏకాదశి. ఉపవాసనియమాన్ని ఆచరించాడు నందుడు. తెల్లారుజాముకు ముందుగానే యమునాతీరం చేరుకున్నాడు. స్నానం చేసేందుకు నీళ్ళలోకి దిగాడో లేదో అతన్ని పట్టి బంధించాడు వరుణదూత. తమలోకానికి తీసుకునిపోయాడు. యమునాతీరానికి వెళ్ళిన నందుడు ఎంతకీ తిరిగి రాకపోయేసరికి, గోపాలురంతా ఆందోళన చెందారు. బలరామకృష్ణులను సమీపించి, నందుడు ఇంకా రాని సంగతి వారికి చెప్పి, కళ్ళు చెమర్చుకున్నారు.**

# నంద సంరక్షణ:గోపికల అన్వేషణ

క్షణంపాటు కృష్ణుడు కళ్ళు మూసుకుని ఆలోచించాడు. ఏం జరిగిందన్నది అతని కళ్ళకుకట్టింది. వరుణదూత ఎంతపనిచేశాడు? అనుకున్నాడు కృష్ణుడు. తన యోగమాయశక్తితో వెంటనే వరుణలోకంలోనికి ప్రవేశించాడు. కృష్ణుడు వచ్చాడని తెలుసుకున్నాడు వరుణదేవుడు. పరుగుపరుగున ఎదురొచ్చాడతనికి. అర్ఘ్యపాద్యాది పూజలు ఆచరించాడు. నెన్నుదుటిపై దోసిలికట్టి విన్నవించాడిలా.

కృష్ణా! నీ పాదపద్మారాధకులంతా ఊహించని ఉత్తమలోకాలకు చేరుకుంటున్నారు. అలాంటి మహనీయుడివి నీ అంతట నువ్వే ఈ లోకానికి విచ్చేసి, నీ పాదధూళితో ఈ లోకాన్నీ నన్నూ పునీతుల్ని చేశావు. నాకు చాలా ఆనందంగా ఉంది.

నువ్వు ఎందుకు వచ్చావో నేను గ్రహించాను కృష్ణా! నీ తండ్రి నీకు కావాలి. నా దూతకి నీ ప్రభావం తెలియదు. తెలియక ఈలోకానికి అతన్ని తీసుకుని వచ్చాడు. నీ తండ్రిని నీకిస్తున్నాను, తీసుకెళ్ళు! నన్నూ, నా దూతనూ మన్నించు. నీ కృపలేని పక్షంలో నేను ఈ వరుణలోకంలో క్షణం కూడా నిలువలేను.

వరుణుని వేడుకోలు విని, శాంతించాడు కృష్ణుడు. కరుణించాడతన్ని. తండ్రిని వెంటబెట్టుకుని, బృందావనం చేరుకున్నాడు. తానెలా వరుణలోకంనుంచి మానవలోకానికి వచ్చిందీ పూసగుచ్చినట్టుగా పల్లెపెద్దలకు తెలియజెప్పాడు నందుడు. అంతా కృష్ణుని కరుణాకటాక్షమే అన్నాడు. ఆ మాటలకు పెద్దలంతా కృష్ణుడు పరమేశ్వరుడే అన్నారు. భక్తిప్రపత్తులతో అతన్ని కీర్తించారు. ఆనాటి నుంచీ కృష్ణుణ్ణి మరింతగా గౌరవించసాగారు. కృష్ణునికి నెలవైన విష్ణులోకం చూడాలని గోపాలురందరికీ పెద్దకోరిక. ఆ కోరికను గ్రహించాడు కృష్ణుడు. వారందరినీ యమునలోని బ్రహ్మహ్రదానికి తీసుకుని వెళ్ళాడు. అక్కడ శాస్త్రోక్తంగా స్నానాలు చేయించాడు. స్నానాలు ముగిసి పవిత్రంగా ఒకరినొకరు చూసుకునేవేళ మహాద్భుతం సృజించాడు. నవ్యతేజోవైభవంతో విష్ణులోకం గోపాలుర కట్టెదుట సాక్షాత్కరించింది. నందాదులు ఆ లోకాన్నిచూసి అమందానందభరితులయ్యారు. కృష్ణుణ్ణి వేనోళ్ళ పొగిడారు.

హేమంతానికి స్వాగతం చెప్పేందుకు శరత్కాలం ఉత్సాహంగా పరుగులు దీస్తున్నవేళ... ఒకనాటి రాత్రి, పూర్ణిమాచంద్రబింబంపొడుపు కొండశిఖరంపై కనిపించింది. కాముకుల హృదయధైర్యం ఛిన్నాభిన్నం చేసేందుకు మన్మథుడు ప్రయోగించిన చక్రంలా ఉందది. దానిని చూసి గోపికలంతా అపూర్వోల్లాస వివశులయ్యారు. యమునానదీ తరంగాల మృదుమధురశ్రుతిలో వేణుగానరవం వినవచ్చిందింతలో. ఆ రవానికి కరచరణాలాడలేదెవరికీ. ఏ పనీ చేయ బుద్ధికాలేదు. కాసేపటికి తేరుకున్నారంతా. కాళిందీ తీరానికి పరుగుదీశారు. చెలికత్తెలు, అత్తలు, మామలు, భర్తలు, మరదులు ఎంత వద్దని వారించినా వినలేదెవరూ. వీడి సిగలతో, పయ్యెదలతో యమునాతీరం చేరుకున్నారు. కొందరు పరిగెత్తలేక కృష్ణుడి గాఢాలింగనాన్ని మానసాంతరాలలో అనుభవిస్తూ ఎక్కడివారు అక్కడే ఉండిపోయారు.

తనచుట్టూ మూగిన గోపకాంతలను చూశాడు కృష్ణుడు. సన్నగా నవ్వాడు. అన్నాడిలా.

వరారోహలారా! ఇంతరాత్రివేళ ఎలా రాగలిగారిక్కడకి? అయినా మీలాంటి శీలవతులు ఇలా ఒంటరిగా ఇక్కడకి రాతగునా? తప్పు కాదూ?

సమాధానం లేదు గోపికల దగ్గర నుంచి.

మురళీరవం విన్నారుకదా? మోహనంగా అనిపించింది కదా! ఇక వెళ్ళిరండి. ఇలా మీరిక్కడకి రావడాన్ని చూసి, మీవాళ్ళెంతగా నన్ను ఆడిపోసుకుంటున్నారో! అయినా మీలాంటివారికీ సాహసాలు పనికిరావు. ఇంటిమర్యాద మంటగలిపి, హృదయేశ్వరులకు వ్యథకలిగించి, అత్తమామలాదిగా అందరినీ బాధించి, మీరిక్కడకి నామీది కోరికతో పరుగెత్తి వచ్చారే...ఎంత తప్పు?

తప్పు చేశామా? లేదు లేదనుకున్నారు గోపికలు.

మీరిలా నా దగ్గరకు వచ్చారని తెలిస్తే మీ భర్తలు ఏం కావాలి? వల్లమాలిన అభిమానాలతో వారంతా ప్రాణత్యాగాలకు పాల్పడితే? రాజులకు ఈ సంగతి తెలిస్తే మిమ్మల్ని శిక్షించరా? అత్తమామలు మీ మనువును నిలుపుతారనుకుంటున్నారా? తల్లిదండ్రులకు ఈ విషయం తెలిస్తే వారు నలుగురిలోనూ నవ్వులపాలు కారా? తలలెత్తుకుని తిరిగే అవకాశం ఉందా? బంధువులకి తెలిస్తే ఇంకేమైనా ఉందా? మిమ్మల్ని వెలివెయ్యరా చెప్పండి. జారత్వం ఇహపరలోకాల్లో సుఖవినాశనమేకాదు, సత్కీర్తిని కూడా నశింపజేస్తుంది. భామిని భర్తను ఎన్నడూ తిరస్కరించరాదు. జరిగిందేదో జరిగిపోయింది. నా వేణుగానం, ఈ యమునాతరంగ ధ్వనులూ మిమ్మల్ని అవశుల్ని చేసి ఉంటాయి. వచ్చారిక్కడకి. వెళ్ళిరండి. భర్తసేవే పరమధర్మం అని తెలుసుకోండి. నేను కావాలంటే, నన్ను కోరుకుంటే ధ్యానంతో, గానంతో స్మరించినంతనే నేను మీ చెంత ఉంటాను. వెళ్ళిరండి.

కృష్ణునిమాటలకు వెలవెలబోయారు గోపికలు. విరహాగ్నితో రగలిపోతూ వెచ్చగా నిట్టూర్చారు. కాటుకకంట నీరుగార్చారు. వెళ్ళాలా? వద్దా? సందిగ్ధంలో పడ్డారు. కొందరు తలలొంచుకుని, బొటనవేళ్ళతో నేలపై రాస్తూ కృష్ణుడితో అన్నారిలా.

మాధవా! సమస్త బంధనాలూ తెంచుకుని నీకోసం పరుగుపరుగున వచ్చాం. వస్తే పొమ్మంటున్నావే, నీకిది న్యాయమా చెప్పు? నువ్వు సర్వేశ్వరుడివి. మోక్షాసక్తులను ఆదరించినట్టుగానే మమ్మల్ని దగ్గరగా తీసుకో! పతిపుత్ర బాంధవసేవే సతులు అనుసరించాలంటున్నావు. నీ మాట మేము కాదనం. మాకు నువ్వే పతివి. పుత్రుడివి. బాంధవుడివి. మేము నిన్ను సేవించుకుంటాం. కాదనకు. ప్రేమకు నిలువెత్తురూపం నువ్వు. నిన్ను ప్రేమించి మేము వస్తే చీకొడుతున్నావు. ధర్మమా చెప్పు?

మా చరణాలు, నీ పాదసామీప్యతను కోరి పరుగుదీస్తున్నాయి. మా కరకమలాలు నిన్ను అందుకునేందుకు ఆత్రం చెందుతున్నాయి. ఈ చెవులు నీ మాటలూ, పాటలకే పరిమితంగాని, వేరొకటి

**తనచుట్టూ మూగిన గోపకాంతలను చూసి సన్నగా నవ్వాడు కృష్ణుడు. ఇంతరాత్రివేళ మీలాంటి శీలవతులు ఇలా ఒంటరిగా ఇక్కడకు రాతగునా? తప్పుకాదూ? అని ప్రశ్నించాడు. మీరిలా నాదగ్గరకు వచ్చారని తెలిస్తే మీ భర్తలు ఏం కావాలి? వల్లమాలిన అభిమానాలతో వారంతా ప్రాణత్యాగాలకు పాల్పడితే...? రాజులకు ఈ సంగతి తెలిస్తే..? మిమ్మల్ని శిక్షించరా? అన్నాడు కృష్ణుడు. అప్పుడు గోపకాంతలు ఏమని బదులిచ్చారు?**

వినేందుకు ఉత్సాహం చూపడం లేదు. నిన్నూ, నీ సుందరాకారాన్నేగాని ఈ కళ్ళు ఇంకేమీ చూడలేవు. నిన్నేగాని వేరెవ్వరినీ ఈ జిహ్వలు వినుతించలేవు. వద్దుకృష్ణా! మమ్మల్ని కాదనకు. కాదని మా గుండెల్ని కోతపెట్టకు.

కృష్ణా! శ్రీదేవి సేవలందుకున్న నీ చరణసందర్శన మా పూర్వజన్మసుకృతం. నీ చరణాలను వదలి మేము వెళ్ళలేం, వెళ్ళం. మా భర్తలన్నా, వారి మాటలన్నా మాకు మక్కువలేదు. తామరపూల సువాసనలకు అలవాటుపడిన తుమ్మెదలు వేరొక పువ్వుల చెంతకు చేరవు. అలాగే నీగానామృతానికి మైమరచిన మేము మళ్ళీ మా ఇళ్ళకుపోలేము. మా అత్తమామలు విచారించనీ! మా పతులు దుఃఖించనీ! మాకు బాధలేదు. నీ చిరునవ్వుచాలు! నీ కర స్పర్శచాలు, మా ఆనందానికి హద్దులు ఉండవు. తట్టుకోలేకపోతున్నాం కృష్ణా! ఈ మన్మథబాధను మరచిపోలేకపోతున్నాం. కటాక్షించు. మమ్మల్ని దగ్గరగా తీసుకో!

నాథా! నీ అధరామృతం మా పెదవులపై వర్షించకపోతే, నువ్వు గాఢంగా మమ్మల్ని కౌగిలించుకోకపోతే, నువ్వు అలరించకపోతే మా బ్రతుకులు ఇక వ్యర్థం అనిపిస్తోంది. విరహాగ్నిలో మేమింతగా వేగిపోతుంటే నీకు ఇంతైనా కరుణ కలుగకపోవడం ఆశ్చర్యంగా ఉంది. బాధగా ఉంది.

గోపికలంతా కళ్ళు చెమర్చుకున్నారు. చూశాడది కృష్ణుడు. జాలిచెందాడు. వారికోరికలు తీర్చాలి, తప్పదు అనుకున్నాడు. ఆత్మారాముడై గోపికలతో రకరకాల శృంగారక్రీడలలో విహరించాడు. కొందరిని అనురాగార్ద్రమైన కటాక్షవీక్షణాలతో కరుణించాడు. కొందరిని చేలాంచలాకర్షణలతో కవ్వించి, నవ్వించాడు. కొందరిని బిగికౌగిట బంధించి మధురాధరాలతో మత్తెక్కించాడు. గోపకాంతలందరినీ వివిధ రతిక్రీడలతో పరవశింపజేశాడు. అంతా మైమరచి ఉన్న క్షణంలో అదృశ్యుడయ్యాడు.

కాసేపటికి తేరుకున్న గోపికలు కృష్ణునికోసం చూశారు. పక్కలో లేడు. ఎదురుగా లేడు. మరెక్కడ ఉన్నాడు? వెదకి వెదకిచూశారు. ఎక్కడా కనిపించలేదు. విరహవేదనతో తామే కృష్ణులమనుకున్నారు. పరిపరివిధాల పరిభ్రమించారు. కాసేపటికి తేరుకున్నారు. తేరుకున్నా విరహోన్మాదంతో తూలిపోతూ తేలిపోతూ పాటలందుకున్నారు. పాటలుపాడుతూ అక్కడ నిలిచి ఉన్న చెట్లనూ, లతలనూ వేదనగా ప్రశ్నించారిలా.

ఓ పున్నాగమా! కృష్ణుడెక్కడే? అశోకమా, ఘనసారమా, ఎక్కడే కృష్ణుడు. ఎక్కడ ఉన్నాడో చెప్పి, మా బాధ తొలగించరే! మల్లికామతల్లులారా! మదనగోపాలుడేడే? మా మానధనం దొంగిలించి దొరకకుండా పోయేడే! మీకు కనిపిస్తే చెప్పరే! పాటలీలతలారా! ఏలకీలతలారా! చూతలతలారా! తులసీ! స్వామి నీ సన్నిధిన లేడుకదా? ఉంటే చెప్పవే! నీ చెంతచేరి, నీతోపాటుగా ఆ కొంటెకృష్ణుని కౌగిలించుకుంటాం. వాటాలకొస్తున్నామని వెతచెందకు. కలసి కాపురం చేయడంలో కమ్మదనం ఉన్నదే!

కనిపించడు కృష్ణుడు. కానరాడు కృష్ణుడు. కన్నీళ్ళ



పర్యంతమై ప్రయోజనం లేదు అనుకున్నారు గోపికలు. కృష్ణునిచేష్టలు నటించసాగారు. ఓ గోపిక పూతన అయింది. మరోగోపిక కృష్ణుడై ఆమె చెంతకు చేరి పాలు తాగింది. మరోగోపిక పాలకోసం ఏడుస్తూ, బండిలా తన చెంతనున్న గోపికను కాలితో సున్నితంగా తన్నింది. ఇంకో గోపిక కృష్ణుడై నోరు తెరచింది. యశోదలా నటిస్తున్న గోపికకు చరాచరాత్మక ప్రపంచాన్ని చూపించింది. ఒకామె కృష్ణుణ్ణంటూ తనచుట్టూ ఉన్న గోపికలను కాళీయ అనుచరులని, వారి వీపులను అధిరోహించి, నాట్యమాడింది. మరో గోపిక గోవర్ధనగిరిని ఎత్తుతున్న కృష్ణుణ్ణి తానేనంటూ చేలాంచలాన్ని ఎత్తి పట్టుకున్నది. మరొక గోపిక అగ్నిని మింగివేస్తున్నట్టుగా నోరు జాచింది. ఒకరి చేష్టలకు ఒకరు నవ్వుకున్నారు. ఆనందించారు.

అలా అత్యద్భుత అభినయాలతో ఆనందించిన తర్వాత గోపికలంతా కృష్ణునికోసం మళ్ళీ వెదుకులాటలోపడ్డారు. నాగలి, కులిశము, అంకుశము మొదలైన శుభరేఖలతో ఉన్న కృష్ణుని పాదముద్రలు చూసి, తమలో తామే అనుకున్నారిలా.

చెలీ! ఇదిగో ఇక్కడ చూశావా? కృష్ణుడు పాదాగ్రంపై నిలబడిన గుర్తులు ఉన్నాయి. అంటే ఏ అదృష్టవతికో ఆ కొంటెకృష్ణుడు పువ్వులు కోసి ఇచ్చినట్టే!

లేదులేదు! పువ్వులుకోసి ఇవ్వడంకాదే! తన కంటే పొడుగైన గోపికకు కొండగోగుపువ్వులు కొప్పున పెట్టినట్టున్నాడే! అందుకే అంతలోతుగా పాదాగ్రం ముద్రలు కనబడుతున్నాయి.

కాదుకాదు! అవి కృష్ణుడి పాదముద్రలుకావు. గోపిక పాదముద్రలు. అంతలోతుగా ఆ పాదముద్రలు ఉన్నాయంటే...ఆమె అధరామృతాన్ని కృష్ణుడు కొల్లగొట్టాడు, అనుమానం లేదు.

పరిశీలించి చూడండి! అటూ ఇటూ రెండు వైపులా అభిముఖంగా పాదముద్రలు ఉన్నాయంటే... ఇటు కృష్ణుడు, అటు గోపిక బిగికౌగిలిలో ఉన్నట్టే!

అంతలో ఓ సఖి కేకేసి పిలిచింది. కోనేటిగట్టున ఉన్నదామె. ఏమైంది చెలీ! ఏమిటే? అని పరుగున వచ్చిన స్నేహితురాళ్ళకు గట్టుమీది పాదముద్రలు చూపించిందామె.

చూశారా! కృష్ణుడు ఈ కోనేటిలో స్నానాలాడి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ ఇద్దరు భామలను వెంటబెట్టుకున్నట్టున్నాడు. అటూ ఇటూ వారి పాదముద్రలు కూడా ఉన్నాయి, గమనించండి.

అవునంటే అవునంటూ గోపికలంతా వింత వింతలు చూశారు. వారికి దూరంగా ఇసుకలోని కృష్ణుని పాదముద్రలు చూసి, వాటిని భక్తిపారవశ్యంతో అంటీ అంటనట్టుగా, ముట్టీముట్టనట్టుగా నిమిరి అనుకున్నదిలా ఓ గోపిక.

ఈ చరణాలనే కదా సనకాదిమహామునీంద్రులు ఎప్పుడూ అన్వేషించేది. మహాలక్ష్మికివేకదా పట్టుగొమ్మలు! వీటినే కదా బ్రహ్మ, మహేశ్వర, దేవేంద్రాది దేవతలు తమ శిరస్సులపై ధరించేది.

పొదరింట పరవశించిపోతూ అనుకున్నదిలా మరో గోపిక.

ఈ పొదరింటనే కదా, నాతో ఆ నల్లనయ్య అచ్చికబుచ్చికలాడింది. ఇక్కడే కదా, నాకు ఊపిరి ఆడనివ్వక కౌగిలించుకున్నది. బిగికౌగిలి అంటే కృష్ణుడిదే! అలాగే చక్కిలిగింతలు కూడా అతగాడే పెట్టాలి. నవ్వలేక చచ్చిపోతామనిపిస్తుంది.

పెదవి మంటపెడుతోంటే కుడిచేతి చూపుడు వేలితో నిమిరిందక్కడ. అనుకున్నదిలా.

పెదవి కొరికిపెట్టాడు. తేనెలద్దాడు. అయినా తనివితీరలేదు. మంటపెడుతూ మనసుపడుతోంది మళ్ళీ కృష్ణుణ్ణి కావాలనుకుంటోంది అని నవ్వుకున్నది.

—అరణి



# ఓ వారాలబ్బాయి జయభేరి



## (మురళీమోహన్ జీవితాలాపన)

(గతవారం తరువాయి)

**ఉన్నట్టుండి మా చుట్టూ జనాలు పెరిగారు. అందరూ మగవారే. అప్పట్లో అబ్బాయిలతో అమ్మాయిలు చొరవచేసి మాట్లాడేవారుకాదు. మేం టీ తాగడానికో, అలా ఫ్రెండ్స్‌తో కబుర్లు చెప్పడానికో, గ్రౌండ్‌లో నడుస్తుంటేనో, 'అదిగో అతనేనటే, త్వరలో హీరో అవుతాడటే' అని గుసగుసలాడుకునేవారు. వాళ్లు అలా మావైపు చూసీచూడనట్టు చూస్తుంటే మాకు అదో ఆనందం. అంతలోనే...**

'వాళ్లు మనల్నే చూస్తున్నార్రా.. అదిగో కృష్ణగారి గురించే మాట్లాడుకుంటున్నార్రా' అని మా బ్యాచ్‌లో ఎవరోఒకరు అనేవారు. అందరం తిరిగిచూసేలోపు వాళ్లు ఏమీ ఎరగనట్టు తలలు దించేసుకుని తుర్రుమనేవాళ్లు. అచ్చం సినిమాల్లో చూపించినట్టే ఉండేది తారా' అని ఉన్నట్టుండి ఓ మిత్రుడు అడిగాడు. ఒక రోజు సాయంత్రం మా ఊళ్ళో అందరం ఓ అరుగు మీద కూర్చుని ఉంటే కృష్ణగారు వచ్చారు. ఆయన్ని చూడగానే అందరూ హీరో వచ్చారు.. అనసాగారు. అప్పుడు మాలోనే ఉన్న ఒకడు ఇలా అనేశాడు. పోతున్నరోజుల్లో వచ్చిందా ఉత్తరం.

'వెంటనే మద్రాసు బయలుదేరి రండి' అని. కృష్ణగారి ముఖంలో వెలుగులు నాకు ఇప్పటికీ గుర్తున్నాయి. వాటిని చూసి ఆనందించాలేతప్ప, మాటల్లో చెప్పలేం. వెంటనే వెళ్లారు. మద్రాసులో ఆయనకు మేకప్‌టెస్ట్ అదీ చేశారు.

కానీ రిజల్ట్ మాత్రం అప్పుడే చెప్పలేదు. 'అంతా బాగానే ఉంది. మీరు ఈ రంగంలోకి తప్పక వస్తారు. ఈ సినిమా వేషంగురించి మేం లెటర్ రాస్తాం. ఆ రోజు రండి' అన్నారట.

# అమ్మాయిలు గుసగుసలాడుకునేవారు!

ఆ సన్నివేశం. తిలక్‌గారు వచ్చి వెళ్లిన తర్వాత కొన్నాళ్ల పాటు ఆ ఫీలింగ్ బాగానే ఎంజాయ్ చేశాం. అప్పుడైతే సినిమాకబుర్లు మరీ మితిమీరి చెప్పుకునేవాళ్లం. ఏ ఇద్దరు కలిసినా సినిమా కబుర్లే సాగేవి. సినిమా వాళ్లు ఎలా ఉంటారు? ఏమేం చేయాలి? ఏం చేయకూడదు? డ్రస్సులు ఎలా ఉండాలి? ఎలాంటి ప్యాంట్లు, చొక్కాలు ఉండాలి? ప్రవర్తన ఎలా ఉండాలి? వాళ్ల ఇళ్లు ఎలా ఉంటాయి? కార్లు ఎన్ని ఉంటాయి? సంపాదన ఎలా ఉంటుంది?... ఒకటా రెండా? అన్నిటినీ ఆ కాలేజీ గ్రౌండులోనే మాట్లాడేసుకునేవాళ్లం. గ్రౌండ్‌చుట్టూ ఉన్న చెట్లు ఎంతపచ్చగా ఉండేవో, మా కలలుకూడా అంతే పచ్చగా ఉండేవి.

### మద్రాసు పిలుపుకోసం ఎదురుచూపులు

'ఇంతకీ తిలక్‌గారు నిజంగానే కబురుపెడ

'ఆయన అలా అనడంలో కూడా తప్పులేదులెండి. నెలలు తిరుగుతున్నాయి కదా' అని కృష్ణగారు అందుకున్నారు. నిజమే.. సినిమాల గురించి అన్నేసి మాటలు మాట్లాడుకున్నా, కాలేజ్ డే జరిగిన రోజు నుంచీ అందరం మద్రాసు నుంచి ఎప్పుడు ఉత్తరం వస్తుందా? అని ఎదురు చూపులు చూస్తూనే ఉన్నాం. దానికితోడు కాలం కూడా ఎందుకో భారంగా కదల సాగింది. ఆరునెలలు గడిచినా పిలుపు రాదాయె. పక్కనున్న నాకు, మిగిలిన వారికే అంత ఆత్రంగా ఉంటే.. కృష్ణగారి పరిస్థితి ఇంకెలా ఉండేదో అర్థం చేసుకోండి. దాంతో ఆయన దగ్గర 'మద్రాసు పిలుపు' ఊసు ఎత్తడం మానేశాం. ఆర్నెల్లు కాస్తా ఏడాది దాటింది. అయినా లాభంలేదు. మరో ఆరునెలలు తర్వాత, ఒకరకంగా మేమంతా ఆ విషయం మర్చి

'ఏమాత్రం అవకాశం ఉన్నా చూడండి...' అని చెప్పి కృష్ణగారు తిరిగి ఊరు వచ్చేశారు. ఒక్కసారి ఫేస్‌మీద మేకప్ పడ్డ తర్వాత నటనగురించి ఆలోచించకుండా ఉండటం అంత తేలికైన విషయం కాదు. గతంలో పిలుపు రాకపూర్వం కృష్ణగారు పెద్దగా తన ఇష్టాయిష్టాలను బయటపెట్టేవారు కాదు. కానీ మేకప్‌టెస్ట్ పూర్తిచేసుకుని వచ్చిన తర్వాత మాత్రం చాలా ఆసక్తిగా ఎదురుచూడసాగారు. కానీ ఎంతకీ ఆ లెటర్ రాలేదు.

### కృష్ణగారి తొలిచిత్రం

తన కొడుకుకి సినిమారంగం అంటే బాగా ఇష్టమని కృష్ణగారి తల్లిగారు నాగరత్నమ్మగారికి బాగా అర్థమైంది. 'మనిషి పొడగరి. పైగా ఎర్రటి రంగు. ముక్కు, ముఖం తీరుగా ఉంటుంది. కాస్త ప్రయత్నిస్తే కొడుకు హీరో కావడం ఖాయం' అని వాళ్లమ్మగారి మనసులో నాటుకుపోయింది. అలా అనుకున్నదే తడవుగా ఆవిడ కొడుకును తీసుకుని వెళ్లి మద్రాసులో ఉండసాగింది. అక్కడే ఓ రూము అద్దెకు తీసుకుని వంట వండిపెట్టేది. కృష్ణగారు వెళ్లి అవకాశాలకోసం ప్రయత్నించేవారు. కొన్ని సందర్భాల్లో ఆవిడ కూడా కృష్ణగారితో వెళ్లి 'మా అబ్బాయి చాలా అందగాడు. బాగా చేస్తాడు, బ్రహ్మాండంగా నటిస్తాడు, ఒక్కఛాన్స్ ఇప్పించండి' అని అడిగేది. కృష్ణగారి కుటుంబానికి అప్పటికే జగ్గయ్యగారిలాంటి వారు బాగా తెలుసు. వాళ్లంతా తెనాలి చుట్టుపక్కల వాళ్లు కదా. సరిగ్గా నాగరత్నమ్మగారు జగ్గయ్యగారిని కలిసిన సమయంలో ఆయన 'పదండి



ముందుకు' అని ఒక సినిమా తీస్తున్నారు. తెలిసినా విడ కొడుకును ఇంత దూరం వెంటపెట్టుకుని వచ్చిందికదా అని కృష్ణగారికి ఆ సినిమాలో ఓ చిన్న వేషం ఇచ్చారు. చిన్నదంటే మరీ చాలా చిన్నవేషం అన్నమాట. ఓ సన్నివేశంలో ఓ బృందం జెండాలు పట్టుకుని ఉంటుంది. ఆ గ్రూపులో ఈయన కూడా జెండా పట్టుకుని వెళ్లాలి. రెండు మూడు డైలాగులు కూడా ఏవో పెట్టినట్టున్నారు. అలా తొలిసారి అవ కాశం వచ్చింది. అది అయిన తర్వాత నాగేశ్వరరావు గారి సినిమాలో అవకాశం వచ్చింది. ఏఎన్నార్‌గారు కృష్ణకుమారితో 'కులగోత్రాలు' అని ఒక సినిమా చేశారు. అప్పుడు కృష్ణగారు ప్రత్యగాత్మగారిదగ్గరకు వెళ్తే ఆయన ఇప్పించారనుకుంటా ఆ వేషం. ఇది మునుపటి దానికన్నా పెద్ద వేషం. 'కులగోత్రాలు'లో నాగేశ్వరరావుగారు ఫ్రెండ్ పెళ్ళికి వస్తారు. ఆ ఫ్రెండ్ వేషం కృష్ణగారిది. రెండో సినిమాకే పెళ్ళికొడుకు వేషం వేశారు కృష్ణగారు. ఆయన ఎప్పటికప్పుడు మాకు ఉత్తరాలద్వారా ఈ విశేషాలు చేరవేస్తూ ఉండేవారు. సరే అప్పటికే నేను ఖాళీగానే ఉన్నాను. సరేనని కొంతమంది మిత్రులతో కలిసి తిరుపతి వెళ్లాం. అప్పుడు ఆనవాయితీ ఎలా ఉండేదంటే తిరు పతికి వెళ్లినవారు మద్రాసుకూడా వెళ్లి సినిమా వాళ్లను చూసొచ్చేవారు. నేను మాత్రం కృష్ణగారిని కలవడానికే తిరుపతినుంచి మద్రాసుకు చేరుకున్నా. కుశలప్రశ్నలు అయ్యాక కాసేపు అవీ, ఇవీ మాట్లాడు కుని నేను మరలా మా ఊరు వచ్చేశా.

### చెన్నై ఆంధ్రాక్లబ్ నాటకాల పోటీపై దృష్టి

నేను ఊరు తిరిగి రావడమైతే వచ్చాను కానీ, నేను ఇక్కడ చేసేది ఏముందని? ఇంట్లో తినడం, అరుగుమీద కూర్చోవడం.. రోజూ ఇదే పని. కొందరు పెద్దవాళ్లు మా పరిస్థితి గమనిస్తూ ఉండేవారు. ఏదో ఒకరోజు పెద్ద స్థానానికి చేరుకుంటాననే ఆశ మాత్రం నాలో ఎప్పుడూ ఉండేది. అది నా మాట ల్లోనూ బయటపడుతూనే ఉండేది. అలా రోజులు గడుస్తున్న తరుణంలో 'మద్రాసు పట్టణము యందు గల ఆంధ్రాక్లబ్‌లో నాటకాల పోటీలు జరుగు తున్నాయి' అని పత్రికలో ప్రచురితమైన ప్రకటన చూపించారు మా ఊళ్లో ఓ పెద్దాయన. ఆ నాట కాల పోటీలకు సెక్రటరీ జి.రామినీడుగారు. ఆయన మా ఊరువాడే. అప్పటికే సినిమా డైరెక్టర్‌గా పేరు తెచ్చుకున్న మనిషి. ఆయన సెక్రటరీ కిల్లారు ఛటర్జీ గారు. ఛటర్జీగారు కూడా మావూరు మనిషే. 'ఏదో సాధించాలన్న తపన మనసులో పెట్టుకుని ఊరికే తింటూ, తిరిగితే ఏం వస్తుంది? పైగా ఆ పోటీలు నిర్వహిస్తున్న వారిలో ఇద్దరు మనూరు వాళ్ళే. ప్రయత్నించండి. ఒక రాయి వేయండి, తగిలితే తగులుతుంది' అని అక్కడున్న పెద్దవారందరూ తలోమాటగా చెప్పారు. తలా ఓ మాట చెప్పేసరికి మాలో కొత్త ఉత్సాహం వచ్చినట్టయింది. 'మన రామి నీడుగారున్నారు, మన ఛటర్జీగారున్నారు. ఇక్కడ ఇంతమంది పెద్దలు చెబుతున్నారు.. అలాంటప్పుడు మనమే ఎందుకు ఈ పోటీలకు వెళ్లకూడదు?' అని మాలో మేం అనుకున్నాం. అసలు మొదలంటూ పెట్టలేదుకానీ అప్పటికే మా మాటలు ప్రైజులవరకూ



వెళ్లాయి. 'మన ఊరువాళ్లు కాబట్టి ఫస్ట్‌ప్రైజ్ తప్పక మనకే ఇస్తారు..' అనుకున్నాం. మరుసటిరోజు సాయంత్రానికి అందరం ఒకచోట చేరుకున్నాం. అప్పట్లో మా ఊళ్లో నాటకాలు నేర్పే ఒకాయన ఉండేవారు. ఆయన దగ్గరకు వెళ్లి 'మద్రాసులో ఉన్న ఆంధ్రాక్లబ్‌లో నాటకాల పోటీలున్నాయని పత్రికలో ప్రకటించారు. మేం ఒక మంచి నాటకం వేయాల నుకుంటున్నాం' అని చెప్పాం. మేం ఆయనకు చెప్పే రోజుకీ.. నాటకాల పోటీ తేదీకి సరిగ్గా పక్షం రోజులు గ్యాప్ ఉంది. 'నాటకం వేయడానికి ఎంత

**తన కొడుక్కి సినిమారంగం అంటే ఇష్టమని కృష్ణగారితల్లి నాగరత్నమ్మగారికి బాగా అర్థమైంది. అందుకే ఆవిడ ఆయన్ను వెంటబెట్టుకుని మద్రాసువెళ్ళి అక్కడే ఉండసాగారు. అలా ఆయన వేషాలకోసం ప్రయత్నించేవారు. అప్పటికే కృష్ణగారి కుటుంబానికి జగ్గయ్యగారు లాంటివాళ్ళు బాగా పరిచయం. ఒక్కొక్కసారి ఆవిడే స్వయంగావెళ్ళి తెలిసినవారికి కృష్ణగారి గురించి చెప్పేవారు. అప్పుడు జగ్గయ్యగారు ఏం చేశారంటే....**

సమయం ఉంది?' అని అడిగారాయన. '15 రోజులే టైముంది' అని చెప్పాం. అప్పుడు ఆయన అన్న మాటలు నాకు ఇప్పటికీ బాగా గుర్తే. 'నాటకం వేయ డమంటే అంతతేలిక కాదు. కనీసం మూడునెలలు రిహార్సల్స్ చేస్తేగానీ ఓ మోస్తరు నాటకం వేయలేరు. 15 రోజుల్లో అన్నీ నేర్చుకుని సాధనచేయడం మాటల్లో అయినంత తేలిక పని కాదు' అన్నారు.

### హీరోగా పోలీసు పాత్రలో తొలి నాటిక

'ఎలాగైనా వేయించండి. మాకు ఉత్సాహంగా ఉంది. బుద్ధిగా రోజూవచ్చి నేర్చుకుంటాం' అని చెప్పాం. 'సరే ఉత్సాహం చూపిస్తున్నారు కదా.. ఓ పనిచేద్దాం.. మేం కూడా ఆ పోటీల్లో పాల్గొనాలను కుంటున్నాం. మాదో నాటకం ఉంది. మేం ఆ నాటకం వేస్తాం. మాది పూర్తయ్యాక మీతో ఓ నాటిక కట్టిస్తాం. దాన్నయితే ఇప్పటికిప్పుడు నేర్పిస్తాను. మీ కుర్రా ళ్లందరూ నాటిక చేద్దురుగానీ' అన్నారు. ఆయన చెప్పింది అర్థం అయ్యీ కానట్టూ అనిపించింది. అయినా అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తూ తలలు ఊపాం. వెంటనే ఓ నాటిక చదివి వినిపించాడు. ఆ నాటిక పేరు 'పోలీస్'. మా అందరికీ భలేగా అని పించింది. అందులో హీరో పోలీస్. నన్ను ఆ పాత్ర వేయమన్నారు. అలా తొలిసారి నటన.. అనే పదాన్ని నేను పలికింది హీరో పాత్రతో. అందు లోనూ పోలీస్‌పాత్రతో అన్నమాట. నాతోపాటు ఉన్న మిగిలినవాళ్లకి కూడా ఏవో కొన్ని వేషాలు ఇచ్చారా యన. మొదటి రోజే కొన్ని డైలాగులు చెప్పారు. ఎవరి పాత్రలు ఏంటో చెప్పారు. అందరం చాలా హుషారుగా విన్నాం. 'రేపు అందరం టైమ్‌కి వచ్చే యాలి. రిహార్సల్స్ బాగా చేసుకోవాలి. పైగా మనకు పెద్దగా సమయం కూడా లేదు' అనుకున్నాం. రెండోరోజు కూడా ఎలాంటి విఘ్నం లేకుండా అందరూ వచ్చేశారు. కాసేపు ఎవరి డైలాగులు వాళ్లు చెప్పారు. అలా నాలుగైదు రోజులు రిహా ర్సల్స్ మాంచి ఊపుమీద జోరుగా సాగాయి. ఇక ఆరో రోజునుంచి చూడండీ, ఒకడొస్తే ఇంకొకడు రాడు. వాడిని తీసుకురావడానికి వెళ్లినవాడు మరు సటిరోజు కనిపించడు. మా గ్రూప్ అందరిలోకీ నేనుమాత్రం సమయానికి వెళ్లేవాడిని. అలా నా పాత్రను కాస్త గట్టిగానే రిహార్సల్ చేశా. కనిపించిన ప్రతి ఒక్కడికీ 'తప్పక రండిరా, ఆయన మనకోసమే కదా నేర్పిస్తున్నారు, మనం బాగా నటిస్తే, మన వేషాలు మద్రాసువాళ్లకి నచ్చితే ఎంత బావుం టుందో కదా' అని ఒకవైపు పిలుస్తూ మరోవైపు ఊరించసాగా. ఏమనుకున్నారో ఏమో నాటిక వేయ డానికి ఇంకో రెండు రోజులు ఉందనగా మరలా అందరూ వచ్చేశారు. నాటిక వేయాల్సినరోజు రానే వచ్చింది. మేం వేస్తున్న నాటకాన్ని, నాటికను జడ్జి చేయడానికి ఇద్దరు ప్రముఖులు దిగారు. వారు ఎవరంటే...

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**



# అడవితనం

మల్లిపురం జగదీశ్

**దిగ్గున లేచాను ఎవరో తట్టిలేపినట్టు. అర్ధరాత్రి దాటి రెండుగంటలైందని స్మార్ట్‌ఫోన్ చెప్తోంది. గదిలో బెడ్‌లైట్ కాంతి మత్తుగా పరుచుకుని ఉంది. ఫ్రిజ్‌లోంచి బాటిల్‌తీసి నీళ్ళు తాగినా దాహం తీరలేదు. బాత్రూంకి వెళ్ళొచ్చి కళ్ళుమూసుకున్నా. కనుల కొమ్మలమీద కునుకుపిట్ట వాలడంలేదు. పక్కనే అతను. హాయిగా ప్రశాంతంగా నిద్రపోతూ. అదృష్టవంతుడు, సెక్యూర్డ్ స్లీప్, మధ్యలో బాబు... అమాయకంగా, కలలో నవ్వుకుంటూ.**

ఈ మధ్యంతా ఇలాగే జరుగుతోంది. సరిగ్గా ఇదే సమయాల్లో మెలకువ వచ్చి ఆ తర్వాత నిద్ర పట్టడంలేదు. నా నిద్రని నా నుండి దూరం చేసిందేమిటి? కలా? ఇంకేమైనానా? ఏదో భరించలేనిది గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నించాను, సాధ్యం కాలేదు.

కానీ....

అతనన్నమాట గుర్తుకొచ్చి మనసు చివుక్కుమంది. కొన్నిరోజులక్రితం... టౌన్‌లో గిరిజన ఉద్యోగులు అందరూ ఒక సంఘంగా ఏర్పడి వనభోజనాలు ఏర్పాటుచేసుకున్న పిక్నిక్‌రోజు, పిల్లలు యువకులంతా స్టేజిమీద డ్యాన్స్ చేస్తుంటే ఉత్సాహం ఆపుకోలేక నేనూ రెండు స్టెప్పులేశాను. అది కోపం తెప్పించింది అతనికి. పెళ్ళైన వాళ్ళెవరూ ఆ పని చెయ్యలేదనీ, నీవెందుకలా చేశావనీ దెప్పిపొడుస్తూ... ఆ మాట అనేశాడు నవ్వుతూనే.

పెళ్ళైతే? ఆటలు మానేయాలా? ఆపుకోలేని ఆనందంవస్తే అణుచుకునే ఉండాలా? ఎంత టౌనైతే మాత్రం? అదే మా ఊరైతే? ఒక దానిమీద మరొకటి ప్రశ్నలన్నీ నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. నన్ను నిద్ర నుండి మరింత దూరం చేస్తున్నాయి.

టౌను.

పెళ్ళై ఎనిమిదేళ్ళు. ఆరేళ్ళ బాబు. వాడు బుడి బుడి అడుగులేస్తున్నప్పుడనుకుంటా, ఉద్యోగం చేసేచోటే కాపురం ఉండాలంటే, ఇక్కడికొచ్చేశాం. బాబు ముద్దుముద్దు మాటలాడుతున్నంత వరకూ ఊరెళ్ళివస్తూ ఉండేవాళ్ళం. హఠాత్తుగా ఊరెళ్ళడం తగ్గించేశాం. ఎందుకో ఎప్పటినుండో గుర్తుకు రావడంలేదు. కానీ ఓరోజు ఊళ్ళో పిల్లలతో బాబు ఆడుకుంటుంటే వీధిలో అందరూ ముద్దుముద్దుగా చూస్తున్నారు అరుగుల్లోంచి.

# తురగా జానకీరాణి కథలపోటీలో రూ. 5,000 బహుమతి పొందిన కథ

"నీ ముక్కేదీ?" పిల్లలడుగుతున్నారు.

బాబు చూపిస్తున్నాడు.

"నీ కళ్ళేవీ?"

"నీ నోరేదీ?"

"నీ తుంబ ఏది?"

వాడు పొట్ట చూపించాడు.

అప్పుడే వచ్చిన కృష్ణ చప్పున బాబుని ఎత్తుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ తెల్లవారే ఇక్కడికొచ్చేశాం.

"ఇంత అర్జెంటేంటి?" అని అడిగాను కూడా.

'అర్జెంటూ లేదు గిర్జెంటూ లేదు. ఇక్కడుంటే ఇలాంటి మాటలే నేర్చుకుంటాడు' అని గొణుక్కోవడం గుర్తొచ్చింది. ఆరోజు అర్థంకానిది ఈరోజు నాకు అర్థమవుతూ వస్తోంది. అక్కడి 'మాటలు' అతని కొడుకునోట రావడం అతనికిష్టం లేదు.

అత్తమామల్ని కూడా అవసరమైతే ఇక్కడికే రప్పిస్తాడు. కానీ ఏ రోజూ ఆ ఊరుకి నన్ను తీసుకెళ్ళలేదు. ఒకవేళ తాను వెళ్ళినా సాయంత్రానికి ఇక్కడికొచ్చేసేవాడు. అలాగని ఆ ఊరంటే కోపంగానీ, ద్వేషంగానీ లేదు. ఊరంటే కొండల్లో ఉంటుంది, అది రోడ్డుకి ఆమడ దూరంలో ఉంటుంది. ఏదైనా అవసరమొస్తే అక్కడేవీ దొరకవూ, ఏ రోగమొచ్చినా అందుబాటులో ఏ మందులు కూడా దొరకవంటాడు.

కానీ నాకో?



ఊరంటే సంబరం, నలుగురు కలిసే ఉత్సవం.

ఊరంటే గుగ్గిలం పొగ.

ఊరంటే ఎజ్జోడి మంత్రం.

ఊరంటే కొత్తల సంబరం.

ఊరంటే సన్నాయి, పిన్న కర్రల గానం.

ఊరంటే తుడుండప్పుల హోరు.

టౌనొచ్చి ఈ నా నిర్వచనాలన్నీ కలలుగానే ఉండిపోయాయి. కలత నిద్దర్లుగానే ఇక్కడి రాత్రుళ్ళు గడుస్తున్నాయి. చుట్టూ చూశాను. కిటికీ అవతల చీకటి తెరలు తెరలుగా వేచి చూస్తోంది. సిమెంటు కట్టడాల కీకారణ్యం. ఏది కావాలన్నా దొరుకుతుంది డిపార్ట్‌మెంట్ స్టోర్లలో. డబ్బే ఉండక్కరలేదు. కార్డుంటే చాలు. గీకే అవకాశం ఎక్కడైనా, ఎప్పుడైనా.

ఇంట్లో అన్ని వస్తువులూ అమరి ఉంటాయి. బతకడానికే ఢోకాలేదు. చేతిలో కార్డుపెట్టి "నీకేం కావాలన్నా కొనుక్కో, నాక్కూడా చెప్పక్కర్లేదు" అన్నాడు. "ఇదంతా జీతమేనా?" అని అడిగితే మాత్రం "అది నీ కనవసరం" అని కళ్ళెర్రజేస్తాడు. నగరంలో సొంత ఇల్లు, ఖరీదైన జీవితం. కానీ మాట్లాడడానికి మనిషి ఉండడు.

అతన్ని చూశాను. ఈరోజు ఇంటికి వచ్చాడంటే మరో నాలుగురోజులు కనిపించడని అర్థం. వచ్చిన రోజు గురకపెట్టిమరీ నిద్రపోతాడు. ఎప్పుడైనా నిద్రపట్టకపోతే రెండుపెగ్గులు వేసుకుని నిద్రలోకి జారిపోతాడు. ఊర్లో ఉన్నప్పుడు జీలుగుకల్లు కూడా తాగనివాడు ఇక్కడికొచ్చి ఇది నేర్చుకున్నాడు. మత్తు మాత్రం కావాలి. అది ఊరిదైతే అక్కర్లేదు.

ఏ బాదరబందీ లేదు...!? చీకూ చింతా లేని జీవితం...!? సెక్యూర్డ్ లైఫ్!!!

ఎంత అదృష్టవంతుడు. హాయిగా నిదురపోగలగడం ఎంత అదృష్టమో!! మరి నాకెందుకు నిద్ర పట్టడం లేదు!?

***

గదిలో ఎయిర్ కండిషన్ శబ్దం చికాకు పెడుతోంది. చలి. దుప్పటి కప్పుకోవాల్సిందే. ఇది తప్పని చలి. కొనుక్కున్న చలి. డబ్బులు చెల్లిస్తేగానీ రాని చలి. అదే ఊరిలో చలైతే...? పండుగే. చలేసిందంటే కందులు గింజ కట్టాయన్నమాట. కాయ తెంపాలంటే కొత్తలపండుగ చెయ్యాల్సిందే.

చలిలో కొత్తల పండుగ!!!

పండుగల తుడుండప్పుల హోరు...

థింసా అడుగుల తోరణం..

ఊరంతా కొండపూల పరిమళం. పోడుకాల్చిన వాసనతో కొండమీది అడవి కొత్తపంటని కలగంటూ ఉంటుంది.

ఇప్పుడెలా ఉందో ఊరు?

కొత్తలరోజు దుర్లకి బయల్దేరుతున్నారో లేదో! ఎలాగైనా ఈసారి కొత్తలకి ఊరెళ్ళాలి. గొడ్డలమ్మకి చీర చూపించి మొక్కు తీర్చుకోవాలి. పసుపునీళ్ళు పోసి బొట్టు పెట్టుకోవాలి. ఆ తల్లిని చల్లగా చూడమని కోరుకోవాలి. వెళ్ళాలి. ఎలాగైనా ఊరెళ్లాలి. డప్పు దరువుల హోరులో నడుముల మీంచి చేతులు కలిపి థింసా అడుగులెయ్యాలి. సమూహంలో కలిసిపోవాలి. గోల చెయ్యాలి. లయబద్ధంగా అడుగులేస్తుంటే కొంటె గుంటలు ఒళ్ళూ ఒళ్ళూ తగులుకునేట్టు... చెమటతో చలి పారిపోయేట్టు.... ఒళ్ళంతా పండుగ రగులుకునేట్టు ఆడాలి. ఎలాగైనా వెళ్ళాలి. ఊరెళ్ళాలి.

పండుగంటే నాగడు గుర్తొస్తాడు. వాడు లేకపోతే ఊరు కదిలిరాదు. వాడు లేకపోతే సందడి ఉండదు. వాడు లేకపోతే గొడ్డలమ్మ జాకరి దాటిరాదు. ఆ గొడ్డలమ్మ తల్లి బయటకు రాకపోతే "దుర్ల" సాధ్యం కాదు.

వాడు...

డప్పు కొడతాడు.

ఒక సమూహమౌతాడు.

వాడు...

ఆపదొస్తే సాయమౌతాడు.

నడవలేని రోగులని కొండ దించడానికి నలుగురిని కూడేసి ఒక డోలీ అవుతాడు.

ఊరిలో ఒకరికి 'అవసరం' అనుకుంటే నేనున్నానని నిలబడతాడు. మేము ఊరొదిలి ఇక్కడికి చేరాక ఊర్లో యువతకి నాయకత్వం వహించి ఇతని స్థానాన్ని భర్తీ చేసినవాడు.

ఇప్పుడేం చేస్తున్నాడో!?

పక్కనే ఉన్న అతన్ని చూశాను. నిదురపోతున్నాడు. ఒకప్పుడు ఊర్లో సందడైనవాడు. పెళ్ళికి ముందు డప్పుదరువుల సమూహానికి నాయకత్వం వహించి, ఉద్యోగంలో చేరాక అన్నీ వదులుకున్నాడు. అసలు డప్పుకొట్టడాన్నే నామోషీగా, చిన్నతనంగా భావిస్తున్నవాడు. ఇప్పుడు నిదురపోతున్నాడు. ఇప్పుడు ఊరెలా ఉందో? వెళ్ళాలి. ఎలాగైనా ఊరెళ్ళి రావాలి.

ఊరు....

కొత్తరకం అలికిడితో వీధి దీపాల్లో మెరుస్తున్న సిమెంటు రోడ్లు... డిష్ యాంటెన్నాలను నెత్తిన మోస్తూ పూరిళ్ళ స్థానంలో స్లాబిళ్ళూ, ఇళ్ళకి గజాల దొడ్లూ, వాకిళ్ళలో టూవీలర్ బళ్ళూ, యువకుల చేతుల్లో సెల్‌ఫోన్లూ... ఊరుచుట్టూ అడవులుస్థానే జీడిమొక్కలూ. ఊరెళ్ళాలి. ఎలాగైనా వీలు చూసుకుని ఊరెళ్ళాలి.

***

ఫోన్ రింగవుతోంది. గతుక్కుమన్నాను. ఏదో కొత్త నెంబర్. టైమ్ చూశాను. తెల్లవారడానికి ఇంకా చాలా సమయముంది. భయంభయంగానే "హలో?" అన్నాను.

"అక్కా! నేనూ... తారని" అటు నుండి వినిపించింది.

"ఎవరూ?" అన్నాను.

"నేనక్కా తారని, నాగడి పెళ్ళాన్ని" ఆమె గొంతులో ఆత్రుత కనిపిస్తోంది. కీడేదో వినిపిస్తోంది. ఆ తరువాత కాసేపటికి గుర్తొచ్చింది. ఆమె నాగడు భార్య తార. నా నేస్తురాలు. పక్కూరిలో ఉంటుంది. కలిసి హాస్టల్లో చదువుకున్నాం. నేను పదిపూర్తిచేసి హాస్టల్ దాటేను గానీ ఆమె దాటలేకపోయింది. ఇంటిలో కొండకెళ్ళకపోతే కుండనిండని పరిస్థితి. ఊర్లో థింసా బృందానికి నాయకత్వం వహించేది. జట్టులో చిట్ట చివర ఉండేది. డప్పుదరువులకు అనుగుణంగా అడుగులేసి, ఊరు ఆడవాళ్ళని ఒకచోట ముడేసేది. ఏ సాయంత్రపు సమయాల్లోనో, ఏ ఉత్సవ సందర్భాల్లోనో నాగడిమీద మనసు పారేసుకుంది. డప్పు దరువులకి థింసా అడుగుల ముడి పడింది.

"ఆ... ఆ.... తారా! చెప్పు. ఏమైందీ? ఎక్కడి

# హార్మోన్ సమస్యలు

మనిషి జీవించడానికి శ్వాస ఎంత ముఖ్యమో మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే శరీరంలో ఉత్పత్తి అయ్యే హార్మోన్లు అంతే ముఖ్యం. గర్భాశయంలో పిండంగా ఏర్పడినప్పటి నుంచి మనిషి కాలం తీరేంతవరకు శరీరము మీద హార్మోన్ల ప్రభావం కలిగి ఉంటుంది. శరీరంలోని ఒక కణము నుండి మరొక కణంకు రసాయనిక సమాచారం అందజేయబడి, సంకేతం ను తెలిపే కెమికల్స్‌ను హార్మోన్లు అంటారు. మెదడు భాగంలోని హైపోథలామస్ మరియు పిట్యూటరి గ్రంథి హార్మోన్ల ఉత్పత్తికి దోహదపడి శరీరంలోని కణాల క్రమబద్ధనకు ప్రాముఖ్యత వహించును. ఈ హార్మోన్లు శరీర ఉష్ణోగ్రతను, ఆకలిని, మానసిక స్థితిని, నిద్రను, దాహము, కామక్రోధమును అదుపులో వుంచుతాయి. ఈ మధ్య కాలంలో హైపో థైరాయిడ్, పి.సి.ఒ.డి, సంతానలేమి, డయాబెటీస్ వంటి దీర్ఘకాలిక జబ్బు లన్ని హార్మోన్ అసమతూల్యత వల్ల వచ్చేవే. చాలా రకాల హార్మోన్లు మన శరీరాన్ని ప్రభావితం చేస్తాయి. హార్మోన్లు పాలిపెప్టైడ్‌తో నిర్మితమైన రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంత కణజాలం.. అవయవాల నుంచి ఉత్పత్తి అయి, వివిధశరీర భాగాలకు రక్తం ద్వారా ప్రవహించి నిర్దిష్ట అవయువాన్ని ప్రభావితం చేసి జీవప్రక్రియల సమతుల్య తకు తోడ్పడతాయి. ఈ హార్మోన్ల సమతూల్యం దెబ్బతిన్నప్పుడు దీర్ఘకాలిక వ్యాధులు బారిన పడతారు. ఈ హార్మోన్లు ఎండోక్రైన్, ఎక్సోక్రైన్ గ్రంథుల నుంచి ఉత్పత్తి అవుతాయి. శరీరంలో ఇవి సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ, శారీరక, మానసిక ఎదుగుదల, మానసిక సమతూల్యత జీవక్రియలకు తోడ్పడతాయి. థైరాయిడ్ హార్మోన్లు టీ3, టీ4 ఇవి థైరాయిడ్ గ్రంథి నుంచి ఉత్పన్నమవుతాయి. వీటి అసమతూల్యత వల్ల హైపో థైరాయిడ్, హైపర్ థైరాయిడ్, గాయిటర్ అనే దీర్ఘకాలిక జబ్బులు వస్తాయి. **స్త్రీలలో హార్మోన్స్ సమస్యలు:** ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్, ప్రోలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్లు స్త్రీలలో నెలసరి, ద్వితియ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి, ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్లు అసమతూ ల్యత వల్ల స్త్రీలలో నెలసరి సమస్యలు, అవాంచిత రోమాలు, సంతానలేమి సమస్యలు వస్తాయి. స్త్రీలలో మెనో ఫాజ్, నెలసరి వచ్చే సమయంలో హార్మోన్ల హెచ్చు తగ్గుల వల్ల వేడి ఆవిర్లు, మానసిక అశాంతి, నీరసం, కీళ్లనొప్పులు వస్తాయి. **పురుషుల్లో హార్మోన్స్ సమస్యలు:** మగవారిలో ముఖ్యంగా టెస్టోస్టిరాన్ అనే హార్మోన్ ఉత్పత్తి అయి ఎముకలసాంద్రతకు, కండరాల పటుత్వానికీ, వీర్య కణాల వృద్ధికి ఉపయోగ పడుతుంది. ఈ టెస్టోస్టిరాన్ లోపం వలన సెక్స్ ప్రొబ్లమ్స్, కండరాల పటుత్వం తగ్గి పోవటం, డిప్రెషన్, టైప్2 డయాబెటీస్ అంతే కాక ఎల్.హెచ్ & ఎఫ్.యస్.హెచ్ డెఫిసియెన్సీ వలన హైపోగోనా డిజమ్ వచ్చేఅవకాశం ఉంది. టెస్టో స్టిరాన్ హార్మోన్ అసమతూల్యత వల్ల శీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, వీర్యకణ లోపాలు, సంతానలేమి సమస్యలువస్తాయి. పిల్లల్లో బరువు, ఎత్తు ఎదుగుదల సమస్యలు వస్తాయి.




డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి


**హోమియో చికిత్స:** హార్మోన్ల ప్రభావము శరీరము మీద ఎంతో వుంది. థైరాయిడ్ సమస్యలో బాధ పడేవారు జీవితాంతం మందులు వాడాల్సి వస్తుందని వాపో తుంటారు. అంతేకాక మందులు మానేయుట వలన సమస్య పెరిగే అవకాశం ఉంది. థైరాయిడ్ సమస్య కాకుండా ఇతర హార్మోన్ల సమస్య లను తొలగించ డానికీ ఇప్పుడు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. హోమియోపతిలో రోగి యొక్క శారీరక, మానసిక, అనువంశిక, వంశపారంపర్య తత్వాలను విశ్లేషించి చికిత్సచేయుటం జరుగుతుంది. ఉదా॥ థైరాయిడ్‌కు కల్కేరియా కార్బ్, థైరాడినమ్, ఐయోడమ్, బ్రొమియం, సల్ఫర్ మరియు ఇతర సమస్యలకు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణ లో వాడాలి. తద్వారా వ్యాధిని సమూలంగా నయం చేయువచ్చు



# సంతానలేమిని జయించవచ్చు

**ప్రస్తుత తరుణంలో యువత, యువ దంపతులు ఉద్యోగ రీత్యా ఎదుర్కొంటున్న మానసికఒత్తిళ్లవలన హార్మోన్ల మార్పులతో, సహజంగా కలగాల్సిన సంతాన ప్రక్రియ నేడు సంక్షోభంలో పడింది. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికి లోపం ఉన్నా సంతానలేమికి కారణం కావచ్చు. అయినా ఇప్పుడు సంతానలేమికి ఆందోళన చెందాల్సిన అవసరం లేదంటు న్నారు ప్రముఖ ఫర్టిలిటీ స్పెషలిస్టు డాక్టర్ సి.జ్యోతి. ఆధునిక విధానాలవల్ల సంతానలేమికి దూరంకావచ్చని చెబుతున్నారు.**

సంతానలేమిసమస్యకు 30% స్త్రీలసమస్యలు ప్రధాన కారకాలుగా పరిశోధనలుతెలియజేస్తున్నాయి. సాధార ణంగా అండాశయంలో అండం ఏర్పడి అండవాహిక ద్వారా గర్భాశయంలో చేరి శుక్రకణంతో సంయోగం చెంది పిండంగా మారుతుంది. ఏదైనా శస్త్రచికిత్స ఫలితంగా... అంటే ఆపెండిక్స్ఆపరేషన్‌ఓవరిన్‌కు గాయ మైనా లేదా ఏదైనా వైరల్ బ్యాక్టీరియల్, లైంగిక సంబంధి తవ్యాధుల వలన అండవాహికలు దెబ్బతింటే పిల్లలు కలుగకపోవచ్చు. స్త్రీలలో సంతానోత్పత్తి పైన మన జీవన విధానం, వృత్తి, వయసు, ఆహారపు అలవాట్లు ప్రభావం ఉంటుంది. శాస్త్రీయ అధ్యయనాల ప్రకారం 35సంIIలు పైబడిన స్త్రీలలో సంతానోత్పత్తి అవకాశాలుతక్కువ. లెడ్ వంటి రసాయనాలు విడుదలయ్యే కార్మాగారాలలో పని చేసే వారిలో డీజీసీజీ వంటి క్రిమిసంహారకాలు వాడిన ఆహారాన్ని తీసుకోవడం వలన, ఎక్సరే, రేడియేషన్‌లకు గురయ్యే వారిలో అండాశయానికి సంబంధించిన వ్యాధులు కలుగుతాయి. ఫలితంగా సంతానం కలగదు.

**ప్రధాన కారణాలు:** మహిళలలో సంతానలేమికి అనేక కారణాలున్నాయి. వాటిలో ప్రధానమైనది. హార్మోనుల సమస్య హార్మోనులు అండం అభివృద్ధి విడుదలను ప్రభావితం చేస్తాయి. శరీరంలోని చిన్నమెదడు మరియు కీలకమైన పిట్యుటరీగ్రంథుల్లో లోపాల కారణంగా అండం అభివృద్ధికి, ఎదుగుదలకు అవసరమైన ఫాలిక్యులర్ స్టిమ్యూలేటింగ్ హార్మోన్ (ఎఫ్.ఎస్.హెచ్.), ల్యూటినైజింగ్ హార్మోన్ (ఎల్.హెచ్.)ల ఉత్పత్తి తగ్గి సంతానో త్పత్తికి ఆటంకం కలుగుతుంది. అధిక మానసిక శ్రమ, తక్కువ శారీరక శ్రమ కలిగిన యుక్తవయసు, మధ్య వయసు మహిళల్లో పి.సి.ఓ.డి. (పాలిసిస్టిక్ ఓవరియన్ డిసీస్) వలన కూడా సంతానలేమి ఏర్పడ వచ్చు. ఇందులో ఎఫ్.ఎస్.హెచ్. హార్మోన్ల ఉత్పత్తి తగ్గి,ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ హార్మోనుల విడుదల మోతా దు అధికమై అండోత్పత్తి జరగదు. అందుకే ఈ వ్యాధి ఉన్న మహిళలకు సంతానం కలుగదు. కొంతమంది మహిళలలో సాధారణ మెనోపాజ్ వయసు కన్నా ముందే రుతు చక్రం నిలిచిపోతుంది. దానిని ప్రీమెచ్యూర్ మెనోపాజ్ అంటారు. ఈ పరిస్థితి క్రీడాకారిణీ లలో, జన్యుపరంగానూ కొద్దిమందిమహిళల్లోసంతానలేమికి కారణంఅవుతాయి. 30-40% ఎండో మెట్రియోసిస్‌తో నూ, పాలిప్స్ మరియు ఫైబ్రాయిడ్ యుట్రస్ లతో బాధ పడే మహిళల్లో సంతానోత్పత్తి జరగదు. థైరాయిడ్, ఫిట్స్, మధుమేహం వంటి వ్యాధులతో పాటు తక్కువ బరువు,అధికబరువు, మానసికఒత్తిడి, అందోళనలు సంతానలేమిలో ప్రధాన భూమికను పోషిస్తున్నాయి. **నిర్ధారణ పరీక్షలు:** అల్ట్రాసోనోగ్రఫీ, లాప్రోస్కోపి, హిస్టిరో సాల్ఫింజొగ్రఫీ, హార్మోనుల నిర్ధారణ పరీక్షలు, ఇంకా ఎల్.హెచ్,ఎఫ్.ఎస్.హెచ్.,ప్రొజెస్టిరాన్.

**ఆధునికపరిష్కా రాలు:** అండాశయసమస్యలు, వీర్యకణాల సమస్యలను తొలగించడానికి పలురకాల మందులు అందుబాటులో ఉన్నాయి. కాకపోతే ఒక దశవరకే ఈ మందులతో ఫలితం ఉంటుంది. ఒకవేళ సమస్య అప్పటికే తీవ్రమైతేఏమాత్రం ఉపయోగం ఉండదు. అయితే ఆధునిక విధానాలు కొన్ని అసాధ్యాల్ని సుసాధ్యం చేస్తున్నాయి. ఐ.వి.ఎఫ్, ఇంట్రా యుటిరీస్ ఇన్‌సెమినేషన్ వంటి విధానా లతో సంతానం కలిగించే అవకాశాలు ఉన్నాయి. అలాగే టీసా టెక్నిక్ అండ్ ఇక్సీ విధానం ద్వారా సంతానం పొంద వచ్చు. ఆధునికవిధానాల్లో అండాలను లేదా శుక్ర కణాలను తీసి భవిష్యత్ అవసరాల కోసం ప్రయోగశాలలో అతిశీత లంగా (క్రైరోప్రిజర్వేషన్) భద్రపరిచి ఉంచడం సాధ్య మవుతుంది. ఈక్రమంలో ప్రయోగశాలలో ఫలదీకరణ చెందిన సూక్ష్మపిండాలను గర్భాశయంలో ప్రవేశ పెడతారు. మిగిలిన అదనపు పిండాలను అతి శీతలంలో ఉంచి, వాటినే ఆ తర్వాత వాడ తారు. అవసరాన్ని బట్టి అండాలనుగానీ, శుక్రకణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం కూడా జరుగు తుంది. వీటితో పాటు పిండాన్ని మరో స్త్రీ గర్భాశయంలో పెంచే సరోగసీ విధానం కూడా అందుబాటులోకి వచ్చింది. అందుకే సంతానం కలగడం లేదని ఇప్పుడు బాధపడాల్సిన అవసరమే లేదు. దీనికి సరైన మార్గం ఫర్టీ 9 హాస్పిటల్ మీశ్రేయస్సుకొరకు మీ అందుబాటులోకి వచ్చింది.


- డా॥ సి. జ్యోతి ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం

నుంచి మాట్లాడుతున్నావు?" అడిగాను.

"ఇదే ఊరో తెలీడం లేదక్కా!" గద్గదస్వరంతో చెప్పింది.

"అదేంటే? ఏమయ్యింది?"

"పనులకని వచ్చేమక్కా" అంది. ఆమె గొంతులో ఇంకా దుఃఖం చల్లారలేదు.

అప్పుడు గుర్తుకొచ్చింది. ఊర్లో చాలామందిలాగే నాగడు కూడా మూటాముల్లే సర్దుకుని పొట్టకూటి కోసం భార్యతో ట్రైనెక్కేశాడని ఊరికి ఫోను చేసినప్పుడు తెలిసింది.

ఆరోజూ ఇలాగే నిద్ర పట్టలేదు.

డప్పుదరువుల్లేని సాయంత్రాలు. పురాతన సంప్రదాయమైన 'కందికొత్త' పండుగల్లేని ఊరు. థింసా అడుగుల్లేని కొత్తవీధులు. సీరియళ్ళ ప్రవాహంలో కొట్టుకుపోతున్న ఆదివాసీ గ్రామాలు. కొత్త సారా మత్తులో తూలుతున్న యువకులు...అరచేత బూతు చిత్రాల భూతాలతో.

"చెప్పు తారా! ఏమైందీ?" అంతరాత్రిలో ఆ ఓదార్పు సరిపోదని తెలిసీ అడిగాను, నా గుండెలు అదురుతుండగా. ఆమె ఏడుస్తోంది. వెక్కివెక్కి ఏడుస్తోంది. దుఃఖం దిగమింగుకుని చెప్తోంది.. "మా ఆయన సావు బతుకుల్లో ఉన్నాడక్కా".

"ఏమయ్యిందీ?" నేనడిగేలోగానే రాగమందుకుంది. నాకు ఏమి చెయ్యాలో తోచలేదు. ముందు ఆమెను ఏడ్వనివ్వాలని కాసేపు మౌనంగానే ఉన్నాను.

"హలో.... అక్కా! ... ఆలకిస్తున్నావా?" అంది.

"ఇప్పుడు చెప్పు ఏమయ్యింది?" ఓదార్పుగా అడిగాను.

చెప్పింది. అంతా చెప్పింది. తాము ఊరొదిలి వెళ్ళినప్పటి నుంచీ ఈరోజు దాకా జరిగిందంతా చెప్పింది. పనుల కోసమని నెల్లూరు వెళ్ళారట. అక్కడ చేపల చెరువుల్లో పనిచేసి మరికొన్నాళ్ళకి చెన్నై చేరుకున్నారట. అక్కడ తాపీ పని, భవన నిర్మాణపనట. వెళ్ళిన ప్రతిచోటా మేస్త్రీలు, మేనేజర్లతో ఏదో ఒక తగువే. పనులు ఎక్కువరోజులు చేయించుకోవడం, డబ్బులు ఇచ్చినప్పుడు మాత్రం లెక్కలు తప్పు చెప్పడం. ఏదో ఒక తగువేనట. ప్రశ్నించడం వాడి సహజ లక్షణం. బహుశా అందుకేనేమో ఎక్కడా కుదురుగా ఉండలేకపోయాడు. కొన్నాళ్ళకి జబ్బుపడ్డాడు. డబ్బులు లేవు. మందులకోసం తిరిగి అప్పుచేయాల్సి వచ్చిందట. నిజానికి ఒప్పందం ప్రకారం మేనేజరే హాస్పిటల్‌కి తీసుకువెళ్ళాల్సి ఉండగా తిరిగి అప్పు చేయాల్సి రావడంతో నాగడికి కోపమొచ్చిందట. అదే చివరి తగువు. ఊరు కాని ఊరు. భాష తెలియని మనుషులు. తెలిసినవారున్నా, అందరూ అక్కడి కూలీలేగావటంతో ఎవరూ కలిసిరాక ఒంటరివాడైపోయాడు. చివరికి వీడెప్పటికైనా ప్రమాదమని గ్రహించి పనిలోంచి తీసేశారట! జ్వరంతోనే తిరుగుప్రయాణమయ్యారు. ట్రైన్‌లో టిక్కెట్టు తీయలేదని అతన్ని పోలీ

**అడవిదాటి వచ్చాడతను. అతడితోపాటే ఆమె. సెక్యూర్డ్ లైఫ్! ఇప్పుడతను నిశ్చింతగా నిద్రపోతున్నాడు. కాకపోతే అడవితనాన్ని కోల్పోయాడంతే! కానీ ఆమెకు ఆ నిశ్చింతలేదు. ఆ నిద్రాలేదు. మనోసంఘర్షణలో కొట్టుమిట్టాడుతోందామె. ఆవేదన పట్టిపీడిస్తోంది. అడవితనం ఆమెను వెనక్కులాగుతోంది. కింకర్తవ్యం అని ప్రశ్నిస్తోంది. ఆ రాత్రి తెల్లారిందా? ఆమె ఏం చేసింది?**

సులు తీసుకెళ్తుండగా కదులుతున్న ట్రైన్నుంచి గెంతేశాడట. రైల్వే హాస్పిటల్లో ఉన్నాడట. తెల్లారితే గాని ఏ ఊరో తెలీదట.

"ప్రమాదమేమీ లేదు కదా?" అడిగాను.

"ఆడికి కుడిచెయ్యి తెగిపోయిందక్కా!" భోరున ఏడుస్తోంది.

నా చెయ్యి తెగిపడినంత బాధ గుండెల్లో. వాడి చేతి వేళ్ళు కనిపించాయి. కొండల్ని తన దరువులతో ప్రతిధ్వనింపజేసిన వేళ్ళు... గుండెవైపు డప్పుని ఆనించుకుని కుడిచేత్తో సిరతలతో దరువులు మారుస్తుంటే ఊరు ఊరంతా ఊగిపోయేది. అడివితల్లి ఆకు పచ్చగా నవ్వాలంటే వీడు తుడుంకుండ పట్టాల్సిందే. అలాంటి నాగడు ఇప్పుడు బతుకుపోరాటంలో ఓడిపోయి ఒక వికలాంగుడుగా...

గాయపడింది వాడా? నేనా? ఊరా? "ఏంటే ఈ గోల? ప్రశాంతంగా పడుకోనివ్వవా?" నిద్రాభంగం తట్టుకోలేక అడుగుతున్నాడతడు.

విషయమంతా చెప్తే అన్నాడు దుప్పట్లోకి దూరిపోతూ, "అయితే నన్నేం చెయ్యమంటావ్?" చిరాకు, నిర్లక్ష్యంతో కూడిన స్వరం.

"అదేంటీ? అలాగంటారు...? అవతల మన ఊరు వాళ్ళండీ."

"అయితే?" దుప్పటి బయటకు రాకుండానే ముద్దముద్దగా అన్నాడు.

ఛీ! ఏమిటీ మనిషి? ఎందుకిలా మారిపోయాడు? ఇతన్నిలా మార్చిందెవరు?

నాకు కన్నీళ్ళాగలేదు. చీకటి, దుఃఖం కలిసి నా కంట్లోంచి ధారగా...

ఉన్నట్టుండి దిగ్గునలేచాడు. దుప్పటితీసి నేలకేసి కొట్టాడు. అతనికి నిద్రాభంగమయ్యిందని తెలుస్తూనే ఉంది. "ఎందుకేడుస్తున్నావ్?" అర్థంలేని ప్రశ్నొకటి అడిగాడు.

"నా కోసం ఎప్పుడైనా ఏడ్చావా? నీకు వాడంటే..." అనేశాడు. ఎప్పుడో అనాల్సిన మాటేమో, ఇన్నాళ్ళూ దాచుకుని అన్నాడు. బలంగానొక్కి నా గుండెల్లోకి గుచ్చినట్టు అనేశాడు.

మౌనంగా ఉండిపోయాను. వాదనకు దిగకపోవడం అతన్ని మరింత రెచ్చిపోయేలా చేసింది.

నన్ను నేను ప్రశ్నించుకున్నాను. అతనన్నది నిజమా? నేను ఇష్టపడింది వాడినా? వాడిలోని కళనా? లేదా వాడిలో ఉన్న ఊరునా? ఊరు వాడినెందుకు దూరం చేసుకుంది? వాడు ఊరొదిలి ఎందుకు వెళ్ళాల్సి వచ్చింది?

అసలు వాడిలో నిలిచి ఉన్నదేమిటి? ఇతనిలో కనుమరుగైపోయిందేమిటి? ఊరు నుంచి ఇక్కడికొచ్చాక ఇతనిలో వచ్చిన మార్పులేమిటి? వచ్చిన కొత్తలో ఇక్కడ ఏర్పడిన గిరిజన సంఘం మీటింగులకి తరచూ వెళ్తూ ఉండేవాడు. ఇల్లు కట్టినప్పుడు స్థలం విషయంలో ఏదో సమస్య వచ్చినప్పుడు సంఘం ద్వారానే పరిష్కరించుకున్నాడు కూడా. ఆ తరువాత మీటింగులంటే దూరంగా ఉంటున్నాడు. కొత్త స్నేహితులు, సాయంత్రం పార్టీలు. కొత్త అలవాట్లతో క్రమక్రమంగా నగరజీవిగా రూపాంతరం చెందాడు. సంపాదనాయంత్రంగా మారిపోయాడు. ఊరుకీ, ఊరి లక్షణాలకీ దూరమైపోయాడు. అడవికి దూరమైనవాడు అడవితనాన్ని కూడా కోల్పోయాడు.

అడవి నడిబొడ్డులో ఉన్న ఊరితో సంబంధాలు కలిగి ఉండి ఉంటే.... అతనిలో కాస్తయినా అడవితనం మిగిలి ఉండేది. అదే జరిగి ఉంటే ఇవ్వడం, స్నేహం చేయడం, ఆశ్రయమివ్వడం, ఓదార్పునివ్వడం లాంటి లక్షణాల్ని కలిగి ఉండేవాడు.

పూర్తి నగరజీవిగా మారి మనిషితనాన్ని కోల్పోయినవాడు.

మరి నాగడు?

కళతో ఒక సమూహాన్ని నిర్మించినవాడు. అడవితనాన్ని ఆవహించుకుని బతుకు వెతుకులాటలో నెత్తురోడుతున్నవాడు.

నా దృష్టిలో నగరం దెబ్బకి ఇద్దరూ గాయపడ్డవారే! ఒకడు కోరి గాయపడితే మరొకడు తనకు తెలీకుండా కోరల్లో చిక్కుకున్నవాడు.

నేను నేనుగా మిగలాలంటే ఏదో ఒకటిచెయ్యాలి. నాలో అడవి బతికుండాలంటే ఒక లేపనమవ్వాలి.

రిసీవ్డ్‌కాల్‌ని డయల్ చేశాను. "తారా! నువ్వేమీ గాబరా పడకు వస్తున్నా" అని లేచి బయటకు నడిచాను.

అప్పుడే తెల్లవారుతోంది.

***సెల్:94401 04737***






"మీకు బలాన్నిచ్చే అభిప్రాయాలనే ఆహ్వానించండి. మీ ప్రతిభని దారిమళ్ళించే వాటిని (వారిని) పట్టించుకోకండి. తనపైతనకి పూర్తినమ్మకం, విశ్వాసం ఉన్న వ్యక్తి ఇతరుల అభిప్రాయాలను వింటాడు గానీ తన తుది నిర్ణయాన్నే అమలు పరుస్తాడు".

-ఐన్‌స్టీన్

# నీ విజయంలో... 'నువ్వే' కనిపించాలి

### అనుమానం వదిలిపెట్టు

"మీరు ఏదైనా పని ప్రారంభించాలనుకున్నప్పుడు, ఇతరుల అభిప్రాయాలపై ఆధారపడకండి. ఏ అభిప్రాయానికెంత విలువనివ్వాలో, దేనిని ఎంత వరకు స్వీకరించాలో అనే అవగాహన మీకున్నప్పుడే ఇతరుల్ని సలహా అడగండి.

ఎదుటివాళ్ళు చెప్పింది విని, ఆ సలహాలతో మీ ఆలోచనల్లో మార్పులు చేర్పులు చెయ్యటం, "అనుకరణ, ఆధారపడటం" అనే అలవాట్లు మీలో మొదలవుతాయి.

ప్రపంచంలో ఏ ఇద్దరి ఆలోచనలు ఒకేలా ఉండవు. ఏదో ఒక సన్ననిపొరంత తేడా ఉంటుంది. చేపట్టిన పనిలో విజయం సాధించాలంటే, మీలోని ప్రత్యేకత వెలికి తీయాలంటే, అనుమానాన్ని విసర్జించాలి.

"నేను చేస్తున్న పని గురించి ఇతరులు ఏమనుకుంటున్నారో, నన్నెలా అంచనా వేస్తున్నారో, నేను చేపట్టిన పనిలో విజయం సాధిస్తానా?" వంటి అనుమానాల్ని మీలోంచి తరిమేయండి. మీ ఆలోచనలో, నైపుణ్యంలో ఇతరులకు చోటిస్తే మీ ప్రతిభకి మీరే తుప్పు పట్టించుకున్నట్టవుతుంది.

మీ ఆలోచనలకి మీరే బాస్. మీ ఐడియాలకు మీరే అధిపతి. మీ ఆలోచనలు, నిర్ణయాలే మీ సామర్థ్యానికి తగిన గుర్తింపునిస్తాయి.

మన బలాన్ని, బలహీనతల్ని మనం సరిగ్గా అంచనా వేసుకోవాలి. ఆ రెంటినీ బేరీజు వేసుకుని, స్వీయనిర్ణయాలతో ముందుకు సాగేవాడే 'విజేత'.

### అభిప్రాయం అనర్థం

ఫైనార్ట్స్ కాలేజీలో శిక్షణపొందే ఓ యువ చిత్ర కళాకారుడు, క్లాసులో చెప్పిందీ, తను ప్రాక్టీస్ చేసిందీ దృష్టిలో ఉంచుకుని, తన క్రియేటివిటీని జోడించి ఎన్నో పోర్ట్రెయిట్స్, ల్యాండ్‌స్కేప్స్, మోడ్రన్ ఆర్ట్ వంటి అన్ని ప్రక్రియల్లో శభాష్ అనిపించుకున్నాడు. కాలేజీ నుంచి బయట ప్రపంచంలోకి అడుగుపెట్టాక తన కంటూ ఓ గుర్తింపు, ప్రత్యేకత ఏర్పరుచుకోవాలన్న కోరికతో, తనలోని తపనకు క్రియేటివిటీ జోడించి, రేయింబవళ్ళు కష్టపడి కాన్వాసుమీద ఓ అద్భుత చిత్రం గీశాడు. అతని కళ్ళకి అదొక మాస్టర్‌పీస్‌లా అనిపించింది. దానిపై ప్రజాభిప్రాయం ఎలా ఉంటుందో, ఎలా స్పందిస్తారో అనే కోరికతో జన సమూహం వచ్చేపోయే షాపింగ్‌మాల్‌లో ఆ పెయింటింగ్ ఉంచి దాని పక్కనే, "మిత్రులారా! నేను ఫైనార్ట్స్‌లో కొత్తగా పట్టా పొందాను. ఈ చిత్రాన్ని మీ అభిప్రాయం కోసం ఉంచాను. ఇందులో తప్పులు మీ దృష్టికి వస్తే అక్కడ ఒక X మార్కు వెయ్యండి" అని రాశాడు.

సాయంత్రం వెళ్ళి చూస్తే అక్కడ అతని పెయింటింగ్ కనిపించలేదు. దాన్నిండా X మార్కులే. చాలా డిజప్పాయింటయ్యాడు. తన కళకి గుర్తింపురాదనే అభిప్రాయంతో డిప్రెషన్‌లోకి వెళ్ళిపోయాడు. ఓ మిత్రుడు అది గమనించి, "నాకు ఒక సందర్భం ఇవ్వు. నువ్వు నమ్ముతున్న ప్రజాభిప్రాయం తప్పు అని నిరూపిస్తాను" అన్నాడు.

అయిష్టంగానే అంగీకరించాడతడు. ఆ మిత్రుడి కోరికమేరకు, అంతకుముందు వేసిన చిత్రాన్నే మళ్ళీ ఓ నాలుగురోజులు కష్టపడి గీశాడు. మళ్ళీ అదే షాపింగ్‌మాల్‌లో, పెయింటింగ్‌ను అదేచోట ఉంచి, దానిపక్కన పెయింటింగ్ బ్రష్‌లు, పెయింట్స్ ఉంచి,

"ఫ్రెండ్స్! ఈ పెయింటింగ్‌లో లోపాలుంటే, ఆ బ్రష్, పెయింట్లతో సరిచెయ్యాల్సిందిగా కోరుతున్నాను" అని రాశాడు మిత్రుడు.

మిత్రులిద్దరూ సాయంత్రం వెళ్ళిచూస్తే, పెయింటింగ్ యథాతథంగా ఉంది. ఎవరూ ఏ మార్పులూ చెయ్యలేదు. మరో నాల్రోజులు ఆ పెయింటింగ్ అక్కడే ఉంచారు. ఎవ్వరూ ఏ లోపాన్నీ గుర్తించి సరిచెయ్యలేదు.

"చూశావా! నీ మొదటి పెయింటింగ్ చాలా పర్‌ఫెక్ట్‌గా ఉంది. రెండోసారి వేసిన దాంట్లో ఒక ట్రెండు తప్పులున్నాయి. ఎందుకంటే, ప్రజాభిప్రాయం



నీ ఆత్మవిశ్వాసాన్ని డిస్ట్రబ్ చేసింది. 'యద్భావం తద్భవతి' అన్నట్టు లోపం ఎత్తి చూపించడానికి ఎంతోమంది పోటీపడి అందమైన చిత్రాన్ని పాడు చేశారు. అదే సరిచెయ్యమంటే ఒక్కరూ ధైర్యం చెయ్యలేకపోయారు.

"ఆర్ట్ గురించి నాలుగేళ్ళు కష్టపడి చదివి, ఇష్ట పడి నేర్చుకుని, నీలోని క్రియేటివిటీకి పదును బెట్టు కున్నావు. మొదటిసారి నీ పెయింటింగ్‌మీద X మార్క్ వేసిన వాళ్ళెవ్వరికీ ఆర్ట్‌పై అవగాహన, అందులో ప్రవేశం లేవు. నువ్వు అభిప్రాయం అడిగావు కాబట్టి X మార్క్ వేశారు.

లోపాన్ని సరిచెయ్యమన్నావు కాబట్టి, ఎవ్వరూ సాహసించలేదు.

కాబట్టి నీ ప్రతిభను నువ్వు గుర్తిస్తే సరిపోదు. ఎదుటివారి అభిప్రాయం, సలహా కోరేటప్పుడు నీ సందేహం తీర్చే 'సత్తా' వాళ్ళకు ఉందా? లేదా? అనే సంగతి ముందు నీకు తెలియాలి" అని విశదపరి చాడు మిత్రుడు.

**"నీకు ఇష్టమైన పనిని ఆచరణలోపెట్టు, సక్సెస్ వస్తుంది. కానీ ఆ 'ఇష్టం' నీదైనప్పుడు ఆ విజయం నీదవుతుంది"**

—చార్లెస్ డికెన్స్

### 'నీ' ఆలోచనే.... 'నీ' విజయం

ఎవరి అభిప్రాయమో నమ్మి మోసపోయాం, విజయం సాధించలేకపోయాం అని తమ అప జయాలకి బలిపశువులను వెదికే రంధ్రాన్వేషకులు తారసపడుతుంటారు. ఇలాంటి వారికి ఎవరూ ఏమీ చెప్పకపోయినా, విజయం సాధించలేరు. ఎందు కంటే వాళ్ళని వాళ్ళే నమ్మరు. తనమీద, తన ఆలో చనమీద నమ్మకంలేని వ్యక్తే ఇతరుల సలహా అడుగు తాడు.

"మనం చెప్పినట్టు మెదడు వినాలిగానీ, మెదడు చెప్పినట్టు మనం తల ఆడించకూడదు."

మీ ఆలోచనల్ని పక్కదారి పట్టించే అంశాలకి, అభిప్రాయాలకి, భయాలకి, పరిస్థితులకి, వ్యక్తులకి ప్రభావితం కాకండి. అలా చేస్తే మన ఆలోచనలు తల్లకిందులై, విజయం మాట అటుంచి, మన ఆచ రణ అస్తవ్యస్తమవుతుంది.

### నిర్ణయానికి ముందు

ఎవరు ఎన్నిచెప్పినా, తుది నిర్ణయం మీదే అయినప్పుడు, ఒక్కసారి అద్దంముందు నిలబడు. మనసు అనే అద్దంలోకి చూడు. అంటే, వర్తమానం లోకి తొంగిచూడు. అద్దం ఎప్పుడూ వర్తమానాన్నే చూపుతుంది. భవిష్యద్దర్శినిలా అభూత కల్పనల్ని చూపదు. అప్పుడు నీ నిర్ణయం గురించి ఆలో చించు, మథించు. నీ ఆలోచనకి ఓ కార్యాచరణ, ఓ రూపం ఏర్పడుతుంది. ఒక్కసారి స్థిరనిర్ణయం తీసు కున్నాక ఎట్టి పరిస్థితుల్లోనూ, దాన్ని దారి మళ్ళిం చకు. విజయం నీదే అవుతుంది.

### వందిమాగధులకు దూరంగా

సాధారణంగా మనచుట్టూ ఉండే స్నేహి తుల్లోనో, బంధువుల్లోనో, సమాజంలోనో మీ దగ్గర డబ్బుగానీ, దాన్నిమించిన మరేదైనా ప్రతిభగానీ ఉంటేచాలు వందిమాగధులు బెల్లంచుట్టూ ఈగల్లా చేరిపోతారు.

మీరు ఏ పనిచేసినా, ఏ ఆలోచన పంచుకున్నా వాళ్ళ తాత్కాలిక ప్రయోజనాల కోసం "ఆహా, ఓహో! అద్భుతం" అని మిమ్మల్ని ఆకాశానికెత్తేస్తారు. పొగడ్త లకి పొంగిపోయి, మీ ఆలోచనల్లో సవరణలకు స్థానమిచ్చారనుకోండి, ఫలితమొస్తే మా ప్రతిభ అంటారు. దుష్ఫలితమొస్తే నీ ఖర్మ అని మళ్ళీ కన్పించకుండా పోతారు.

ఈ బాపతు జనం సినిమా పరిశ్రమలో ఎక్కువ కన్పిస్తారు. ఇలాంటివారికి మీ ఆలోచనని విశ్లేషించే శక్తి ఉండదు. వీళ్ళ అభిప్రాయం అమలుచేస్తే అప జయం తథ్యం.

### నిర్ణయం నీదే కావాలి

నిర్ణయం నీదైనప్పుడే స్వేచ్ఛ నిన్నంటిపెట్టుకుని ఉంటుంది. విజయం అందుకున్నాక స్వేచ్ఛ నీదవు తుంది. విత్తనం భూమిలోనాటాక, మొలకెత్తి, మొక్కై, మానై, కాయలు, పండ్లు, నీడ.... అన్నింటినీ దాని ఇష్టప్రకారమే అందిస్తుంది. మరొకరి ప్రమేయానికి తావు ఇవ్వదు.

మన విజయం కూడా ఎదిగిన వృక్షంలా మనకు స్వతంత్రతనివ్వాలి. తెలియనివాళ్ళకి కూడా సాయపడి, వాళ్ళ జీవితాన్ని మార్చేసేదిలా ఉండాలి.

శాస్త్రవేత్తలు ఏళ్ళతరబడి రేయింబవళ్ళు కష్టపడి కొత్తకొత్త ఆవిష్కరణలు చేసేది వారి స్వార్థంకోసం కాదు, లోకకల్యాణం కోసం. కాబట్టే మనం ఆధు నికంగా జీవించగల్గుతున్నాం.

**"వివేకవంతులకి సలహాలు అక్కర్లేదు. తెలివి తక్కువ వాళ్ళు వాటిని తీసుకోరు."**

—ఫ్రాంక్లిన్

తమ విజయంలో తాము కన్పించాలనుకునే వాళ్ళే చరిత్ర సృష్టిస్తారు.

నవ్య

## హేట్సాఫ్ సుహాస్ గోపీనాథ్



పద్నాలుగేళ్ళ వయసులో తొమ్మిదోతరగతి చదివే విద్యార్థుల మనసు చదువు, ఆటలమీద ఉంటుంది. బెంగళూరుకు చెందిన సుహాస్‌గోపీ నాథ్ మాత్రం తన వయసుకు భిన్నంగా ఆలోచిం చాడు. క్లాసుపుస్తకాలు బోరు కొట్టాయి. కొత్తగా ఏదైనా చెయ్యాలనుకున్నాడు. అప్పుడే అభివృద్ధి చెందుతున్న వెబ్‌డిజైనింగ్, గ్రాఫిక్ డిజైనింగ్‌ల మీద దృష్టిపెట్టాడు. అటువైపే అడుగులు వేశాడు. ఆ అడుగులు అతన్ని 17 ఏళ్ళకే "వరల్డ్ యంగెస్ట్ సి.ఇ.ఓ"గా మార్చాయి.

వెబ్‌డిజైనింగ్‌లో ఆసక్తి ఉన్నా, కుటుంబరీత్యా కోచింగ్ తీసుకోలేని ఆర్థికపరిస్థితి. అందుకే ఇంట ర్నెట్ కేఫ్‌నే తన ఆలోచనలకి అనుకూలంగా మలచుకున్నాడు. రోజూ గంటకి 30 రూపాయలు వసూలు చేసే ఇంటర్నెట్ కేఫ్‌లో తన పని ప్రారం భించాడు. ఎక్కువ గంటలు ఉంటే, పెద్దమొత్తం రెంట్ చెల్లించలేక యజమాని లంచ్‌కి వెళ్ళే సమ యంలో కేఫ్ మూసి వెయ్యకుండా, కేఫ్ బాధ్యతలు చూసుకుంటానని ఒప్పందం కుదుర్చుకున్నాడు. అలా మొదలైంది గోపీనాథ్ ప్రస్థానం.

14 ఏళ్ళ వయసులో అంటే 2000 సంవత్స రంలో అమెరికాలో ఉన్న ఫ్రెండ్ ద్వారా శాన్‌జోస్ నగరం కేంద్రంగా "గ్లోబల్ ఐ.ఎన్.సి." పేరుతో ఒక సంస్థను రిజిస్టర్ చేశాడు. అమెరికాలోని మధ్యతరహా సంస్థలకు అప్పటికి ప్రత్యేక వెబ్ సైట్లు లేవు. దీనిని తనకి అనుకూలంగా మలచు కున్నాడు సుహాస్. మొదట్లో "చిన్నకుర్రాడు ఏం చేస్తాడనుకున్నా, ఒకటి రెండు కంపెనీలు అతని ప్రొడక్ట్స్ చూసి ప్రోత్సహించాయి. దీంతో 500 డాలర్లతో రిజిస్టర్ చేసుకున్న కంపెనీకి రెండు సంవత్సరాలలో వేలడాలర్ల ఆదాయం రావడం ఆరంభమైంది.

గ్లోబల్స్ సంస్థ ఇప్పుడు ప్రత్యక్షంగా 300 మందికి, పరోక్షంగా మరో 2000 మందికి ఉపాధి కల్పిస్తోంది. అలా 17 ఏళ్ళకే 'యంగెస్ట్ సి.ఇ.ఓ ఇన్ ద వరల్డ్' అవార్డ్ సొంతం చేసుకున్నాడు సుహాస్.

ప్రస్తుతం 31 సంవత్సరాల వయసుగల సుహాస్‌కు ఎంతో గుర్తింపు లభిస్తోంది. సైన్స్ అండ్ టెక్నాలజీ శాఖ, ఐఐటీ ముంబై ఎంట్రప్రెన్యూర్ సెల్‌వంటి ప్రముఖసంస్థల సలహా కమిటీలలో సభ్యుడిగా ఉన్నాడు సుహాస్. అంతర్జాతీయస్థాయిలో పలు అవార్డులు దక్కించుకుంటున్నాడు. 2007లో యూరోపియన్ పార్లమెంట్ నుంచి యంగ్ అచీ వర్ అవార్డు, 2008లో W.E.F. నుండి యంగ్ గ్లోబల్ లీడర్ అవార్డు అందుకున్నాడు.

"నా వల్ల కాదు. నేను చేయలేను" అనే ఆలో చన ఉంటే ముందడుగు వెయ్యలేం. నాకు ఎన్నో సమస్యలు ఎదురయ్యాయి. వాటిమధ్య నా ఆసక్తిని కొనసాగిస్తూనే ఇంజనీరింగ్ చదివాను. చివరికి నా ఆశయం నెరవేర్చుకునే దిశగా గ్లోబల్స్ సంస్థ స్థాపించి ఈనాడు ఈ స్థాయికి చేరుకున్నాను" అంటాడు సుహాస్ గోపీనాథ్.




**నిధి శరీరం ఒక్కసారిగా జలదరించింది. చేతుల మీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. పెదవులు ఆరిపోతూ అదరడం ప్రారంభించాయి. కళ్ళు ఆశ్చర్యంతో నిండిన గిన్నెల్లా అయ్యాయి. వణుకుతున్న కాళ్ళు అతన్ని కూర్చోమంటున్నాయి. నిధి ఆమె వైపే రెప్పవేయకుండా చూస్తూ, నేలమీద బలహీనంగా కూర్చున్నాడు. అంతులేని ఆశ్చర్యం స్పందింపచేస్తున్న చేతుల్ని దగ్గరగా తీసుకున్నాడతను. అతని చేతులు ఒకదాన్నొకటి పట్టుకున్నాయి. అతని పెదవులు కదిలాయి.**

"అమ్మా... భూమాతా... ఇది.. ఇది నిజమా?"

అవని చిరునవ్వు నవ్వింది. "నేను మాతలా కనిపిస్తున్నానా?"

"అమ్మా..."

"అమ్మలా అవుపిస్తున్నానా? నన్ను చూసి నిజం చెప్పు నిధీ!"

"లె... లె... లేదు"

"ఎలా కనిపిస్తున్నాను?" అవని అంది. "పోనీ ఎలా ఉన్నాను?"

"యువతిలా..."

అవని చిన్నగా నవ్వింది. "ప్రతీ ఉదయం మేలుకోగానే 'సముద్రాలను వస్త్రాలుగా కలిగిన దేవీ, పర్వతాలను వక్షోజాలుగా కలిగిన విష్ణుపత్నీ నీకు నమస్కరిస్తున్నాను. నా పాదస్పర్శను క్షమించు' అని ప్రార్థించి, నేలమీద పాదం మోపుతావు కదా! సంకోచించకుండా చెప్పు నిధీ! నేను ఎలా ఉన్నాను? సామాన్య యువతిలా ఉన్నానా కేవలం?"

"కా...కాదు.. మహాసౌందర్యరాశి అయిన దేవకన్యలా ఉన్నావు తల్లీ" నిధి వినయంగా అన్నాడు.

అవని నవ్వింది. "అదిగో మళ్ళీ తల్లి అంటున్నావు! దేవకన్య అనే పదప్రయోగాన్ని స్వయం వ్యతిరిక్తం చేస్తున్నావు! చివరిసారిగా అడుగుతున్నా, అమ్మలా ఉన్నానా, అమ్మాయిలా ఉన్నానా?"

"అమ్మాయిలా ఉన్నావు.."

"నీకో సత్యం చెబుతాను. అమ్మాయి అందంగా ఉంటుంది; అమ్మ కూడా అందంగా ఉంటుంది. నీకు సోదరి ఉందిగా?"

"ఉంది.."

"ఆ అమ్మాయి అందంగా ఉందా?"

"చాలా అందంగా ఉంటుంది".

"నీకు అమ్మ ఉందిగా?"

"... ఉంది"

"ఆమె అందంగా ఉందా?"

"చాలా అందంగా ఉంటుంది."

అవని చిరునవ్వు నవ్వింది. "ఎవరి అందం వారిది. కానీ అమ్మాయి అయిన నీ సోదరిని యువతిగానే చూడాలి. అమ్మను అమ్మగానే చూడాలి. అవునా?"

"అవును.."

"అప్పుడు నన్ను ఎలా చూడాలి?" అవని నవ్వుతూ అడిగింది.

"ఆ... అమ్మాయిగా.. అదే.. యువతిగా చూడాలి" నిధి తడబడుతూ అన్నాడు.

"నిధీ, నీ సోదరి పేరేమిటి?"

"నవనీత"

"నువ్వు ఆమెను ఎలా పిలుస్తావు?"

"నవనీ... అంటాను."

"నన్ను ఏకవచనంలో 'అవనీ' అనాలి, అవునా!"

"ఆ... అవును..."

"ఏదీ ఒకసారి అను, విందాం!" అవని చిరునవ్వు నవ్వింది.

నిధి మౌనంగా ఆమె విశాల నేత్రాలలోకి చూశాడు. ఆనందబాష్పాలతో తన కళ్ళు, చెమ్మగిల్లుతున్నట్టు గుర్తించాడు. చిరునవ్వు అతని పెదవుల్ని కొద్దిగా విడదీసింది.

"అవనీ!"

"చూశావా, నా పేరు ఎంత బావుందో!" అవని నవ్వుతో అంది. నాకో తత్వం ఉంది. అది నా లక్షణం. నా ప్రత్యేకత. అది ఏమిటో నీకు తెలుసా నిధీ?"

"తెలియదు"

"గంధం అంటే వాసన. అది నా లక్షణం. భూమి అనబడే నేను ఎవరినో తెలుసా?" అవని అంది.

నిధి క్షణంసేపు సాలోచనగా చూశాడు. "భూమాత, భూదేవి అనే దేవతవు. అవునా?"

అవని ముఖం చిరునవ్వుతో వికసించింది. "దేవత కాదు; ఉపదేవత అనుకో. నేను పంచభూతాలలో ఒకదానిని. 'పృధివ్యాపస్తేజోవాయురాకాశాత్' అని విని ఉంటావు. అంటే, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అని అర్థం. ఈ అయిదింటినీ 'పంచభూతాలు' అంటారు."

"విన్నాను.."

"భూతాలు అంటే ఏమిటో తెలుసా?"

అవని ప్రశ్నించింది.

నిధి తల అడ్డంగా ఊపాడు.

"భూతం అంటే 'భూత ప్రేత పిశాచాలు' అనబడే ఆత్మలలో ఒకటికాదు సుమా. పంచభూతాలలో భూతం అంటే మూలద్రవ్యం అని అర్థం. మౌలికమైన పదార్థం.."

"అంటే..."

"అంటే ఏ పదార్థంతో, ద్రవ్యంతో ఇతర పదార్థాలు రూపొందుతాయో ఆ పదార్థం, ఆ ద్రవ్యం మూలద్రవ్యం అన్నమాట. సృష్టిలో కంటికి కనిపించేవన్నీ మా కలయికతో, అంటే పంచభూతాల కలయికతో రూపొందినవే. ఉదాహరణకి నీ శరీరం, నీ శ్వేతాశ్వం శరీరం, అదిగో ఆ చెట్టు, ఆ గుట్ట, ఆ రాయి.. అన్నీ.."

"ఒక ప్రశ్న అడగవచ్చా?" నిధి అన్నాడు.

"అడుగు"

"నువ్వు కంటికి కనిపిస్తున్నావు. నువ్వు కూడా పంచభూతాల కలయికతో..."

"మంచిప్రశ్న!" అవని అంది. "నేను కూడా పంచభూతాల సమ్మేళనంతో రూపొందిన దానినే! నా శరీరం కూడా, నీ శరీరంలాగే పాంచభౌతికం – అంటే పంచభూతాలకు సంబంధించినది. ఈ శరీరం

## జరిగిన కథ

బాకీపడ్డ కప్పం చెల్లించేందుకు, యువరాణిని కాపాడేందుకు నవనిధుల సాధనకు బయలుదేరతాడు నిధి. హరిహరపురం చేరిన నిధి, అశ్వత్థామ సహాయంతో, శరభాద్రి బలవంతంగా స్వాధీనం చేసుకున్న వాయుని విడిపించుకుంటాడు. దారిలో ఓ యువతిని ఆటవిక స్త్రీల బారినుంచి రక్షిస్తాడు. అక్కడి నుంచి బయలుదేరిన నిధి ఆ రాత్రి ఓ చెట్టు నీడన విశ్రమిస్తాడు. తెల్లవారాక మేల్కొన్న నిధికి భూమాత దర్శనమిస్తుంది.

*ఆ తర్వాత...*



ధరించాను గనుక నీకులాగే నాకూ ద్వంద్వాలు ఉంటాయి సుమా!"

"ద్వంద్వాలా? అంటే..."

"ద్వంద్వం అంటే రెండు – శీతం, ఉష్ణం లాంటివి. ఆనందం–ఆవేదన, సుఖం–కష్టం ఇలాంటివన్నీ నీకు ఉన్నాయిగా! ఇలాంటి ద్వంద్వాలతో నీకు అనుభవం ఉందిగా?" అవని నిధిని తదేకంగా చూస్తూ ప్రశ్నించింది.

"ఉంది. ఇలాంటి ద్వంద్వాలు మానవులైన మాకు సహజంగా ఉంటాయి. నవ్వు, ఏడుపు, కష్టం, సుఖం ఇలాగా మీ దేవతలకు, అదే ఉపదేవతలకు ఉంటాయంటే నమ్మబుద్ధి కావడం లేదు!" నిధి ఆశ్చర్యంగా అన్నాడు.

అవని చిన్నగా నవ్వింది. 'శ్రీమహావిష్ణువు శ్రీరాముడుగా, శ్రీకృష్ణుడుగా భూమి మీద అవతరించారు. పంచభూతాత్మకాలైన – పాంచభౌతికాలైన శరీరాలు ధరించి అవతరించారు. ఆనందాలు, ఆవేదనలు, ఆకలి, జర, రుజ అంటే ముసలితనం, వ్యాధి ఇలాంటివన్నీ అనుభవించారా లేదా; చివరికి మరణించారా లేదా... ఆలోచించు! పంచభూతాల సమ్మేళనంతో ఐదు మౌలిక ద్రవ్యాల కలయికతో ఏర్పడే శరీరాలు అన్నీ అనుభవిస్తాయి, పోతాయి! అంతే! శ్రీరాముడు, శ్రీకృష్ణుడులాంటి భగవదవతారాలకే ఉన్న లక్షణాలన్నీ ఇదిగో... 'అవని' అనే నాకూ ఉంటాయి!"

నిధి అర్థమైనట్టు చూస్తూ ఉండిపోయాడు.

"పాంచభౌతిక రూపాలకు జననం–జీవనం–మరణం అనేవి తప్పవు నిధీ!"

నిధి తల పంకించాడు. "భూకంపానికి బలైపోకుండా నన్ను రక్షించావు. అందుకు ఒక కారణం చెప్పావు. ఆ సమాధానం నాకు సంతృప్తి కలిగించ లేదు. ఎందుకంటే భూకంప ఫలితంగా రాత్రి చాలా ప్రాణులు అంతరించిపోయి ఉంటాయి. వాటినన్నింటినీ ఎందుకు రక్షించలేదు?"

అవని నవ్వుతూ తల మెప్పుగా పంకించింది. "నీ బాల్యం నుండీ అనుదినమూ నిద్రలేవగానే నన్ను ధ్యానించి, నా క్షమాపణ అర్థించి, నమస్కరించి, నామీద పాదం మోపుతున్నావు. పాద స్పర్శను క్షమించమంటూ వేడుకుంటున్నావు...."

"బాల్యంలో నాన్న ఆ ప్రార్థన నేర్పించాడు. అమ్మ అభ్యాసం చేయించింది. అది అలవాటుగా, అసంకల్పిత చర్యగా మారిపోయింది" నిధి అన్నాడు. "నిన్ను.. నిన్ను.. మీరు అని గౌరవించాలనిపిస్తోంది".

అవని నవ్వింది. "నువ్వు' అంటే ఏర్పడే సామీప్యాన్ని 'మీరు' అనేది దూరం చేస్తుంది నిధీ! నువ్వు నన్ను 'నువ్వు' అంటే ఆనందిస్తాను. సరే విను! రాత్రి నువ్వు నా ఒడిలో విశ్రాంతి తీసుకుంటున్నావు. నా ప్రకంపనతో నీకు ఆపద సంభవించకూడదనిపించింది. నువ్వు ప్రతీ ఉదయం నా గురించి చేసే ప్రార్థన అందుకు ఒక కారణం..."



## పండు ఫైర్ అయింది

నాగ్‌తో 'నిన్నే పెళ్ళాడతా'నంటూ 'పండు'గా కుర్రకారు గుండెల్లో గుబులు పుట్టించిన టబు, నాగ్ తనయుడు అఖిల్ రెండో సినిమాలో ఓ ముఖ్యమైన రోల్ చేస్తోంది. దాంతో పాటు బాలీవుడ్‌లో ధీరజ్‌కుమార్ దర్శకత్వంలో తెరకెక్కిస్తున్న ఉజ్మా అహ్మద్ బయోపిక్‌లో సుష్మాస్వరాజ్ పాత్రలో కనిపించనుందనే వార్త హల్‌చల్ చేసింది. ఆ వార్తపై ఇపుడు టబు మండిపడుతోంది. అసలు అలాంటి సినిమా ఒకటి తెరకెక్కనుందనే విషయమే తనకు తెలియదని, పబ్లిసిటీ కోసమే ఇలాంటి వార్తలు పుట్టిస్తున్నారని అందరిమీదా ఫైర్ అయింది.

**అవని భూమాత అవతారంగా కాకుండా ఓ మానవ యువతిలా కనిపిస్తోంది నిధికి. ఆమె తనవెంట వస్తోంది కనుక ఆమె రక్షణ భారం తనదేననుకున్నాడు. ఆమెకు ఏ ఆపదా రాకుండా అప్రమత్తంగా ఉండాలనుకున్నాడు. అనుకుంటూనే మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు. తెల్లవారింది. కనురెప్పలు తెరచి, చుట్టూ చూసిన నిధికి అవని జాడ లేదు. ఆమె ఎక్కడికి వెళ్ళింది? ఆమెకేమైనా ఆపద సంభవించిందా?**

"ఇంకొక కారణం కూడా ఉందా?"

"ఉంది. ఆపదలు దాపురించినప్పుడు, పాపాత్ముల వల్లా, అధార్మికశక్తుల వల్లా భూభారం పెరిగిపోయిన ప్రతీసారీ నేను ఏడుస్తూ విష్ణుదేవుడి సన్నిధికి పరుగెత్తుకెళ్ళి మొరపెట్టుకోవడం ఒక ఆచారంగా మారిపోయింది. నేను శోధించడం... ఆయన ఓదార్చడం. పదే పదే జరిగే ఆ సంఘటనల వల్ల నేను చేతకాని దానిననీ, అన్నింటికీ ఆయనమీద ఆధారపడతాననీ నా సహచర భూతాలు నాలుగూ అంటుంటాయి. ఆ విధంగా కొంత నవ్వులపాలయ్యాను. నేను కేవలం నన్నే కాదు; ఆపదలలో ఇతరులను కాపాడగలను అనే నిజాన్ని నిరూపించాలనుకున్నాను. సరిగ్గా ఆ తరుణంలో నువ్వు తారసిల్లావు. అవతరించి ఆదుకొమ్మని విష్ణువును అర్థించడం కన్నా నేనే అవతరించి, ఆపన్నులను ఆదుకోవాలనుకున్నాను. అందుకే ఈ పాంచభౌతిక రూపం! అందుకే నిన్ను రక్షించడం! 'ఇది ఇంకొక కారణం!" అవని నవ్వింది.

"ఇంకొక.. అదే... మరొక కారణం కూడా ఉన్నట్టు నీ మాటలో ధ్వని చెప్తోంది. ఉందా?" నిధి ప్రశ్నించాడు.

"తెలివైనవాడివే!" అవని అంది. "ఉంది. నువ్వు ఒక మహాసాహసయాత్ర చేపట్టావు. నా మీద అంటే ఈ భూతలం మీద ఇప్పటివరకూ ఏ మానవుడూ తలపెట్టని సాహసం అది. మనుషులు అష్టైశ్వర్యాల కోసం ప్రయత్నించారు గానీ, నవనిధుల కోసం ప్రయత్నించలేదు. ఆ సాహసంలో నీకు సహాయం చేయాలని నాకు అనిపించింది. 'మరొక కారణం' ఇదే!"

నిధి ఆశగా, ఉత్సాహంగా చూశాడు. "అయితే నీ అద్భుతశక్తులు నాకు అందిస్తావన్న మాట! బలే!"

అవని చిరునవ్వుతో తలను అడ్డంగా ఊపింది. "ఇందాకే చెప్పాను. నా శరీరం నీ శరీరంలాగే ద్వంద్వాలకూ, పరిమితులకూ లోబడింది. పంచభూతాల కలయికతో ఏర్పడినందువల్ల పరిమితులూ, బలహీనతలూ ఉంటాయి. నా స్థూలరూపమైన భూమండలానికి ఒక మహత్తరశక్తి ఉంది. అది ఆకర్షణ. దాని కారణంగా నీకులాగే, అంటే ఇతర ప్రాణులలాగే నాకూ కొన్ని భూమి సంబంధమైన అజ్ఞానాలూ, బలహీనతలూ, ఆశలూ, ఆవేశాలూ, ఆగ్రహాలూ, ఆవేదనలూ అన్నీ ఉంటాయి. నా సహాయం ఆ పరిధులకి లోబడి ఉంటుంది. అర్థమైందా?"

"....అర్థమైంది" నిధి అన్నాడు. "నువ్వు చెప్పే అంశాలన్నీ నాకు ఆశ్చర్యం కలిగించేవిగానే ఉన్నాయి.."

"ఈ శరీరంతో కూడా నేను దేవతనే అని నువ్వు అనుకున్నంతకాలం అలాగే అనిపిస్తూ ఉంటుంది. దివి నుండి భువికి దిగివచ్చిన దేవతలు చిన్నచిన్న మహిమలు ప్రదర్శించినప్పటికీ, మానవులలాగే అన్నీ అనుభవించాల్సిందే. పాంచభౌతికమైన పరిమితులకు లోబడి ప్రవర్తించాల్సిందే. తెలియకుండానే, అసంకల్పితంగానే, అప్రయత్నంగానే ప్రవర్తిస్తారు. మళ్ళీ గుర్తుచేస్తున్నా. శ్రీమహాలక్ష్మి సీతాదేవిగా దిగివచ్చింది. శ్రీమహావిష్ణువు శ్రీరామచంద్రుడుగా దిగివచ్చాడు. సుఖాలనూ కష్టాలనూ, సంతోషాలనూ సంతాపాలనూ, సంయోగాన్నీ వియోగాన్నీ, ఆదరణలనూ అవమానాలనూ అనుభవించారు కదా! ఒక్క ముక్కలో సారాంశం విను: నువ్వెంతో, నేనూ అంతే! నీలాగే నేనూ!" అవని ముగించి, నిధి వైపు అర్థమైందా అన్నట్టు చూసింది.

"పరిమితులకు లోబడే అయినప్పటికీ, నాకు నువ్వు సహాయం చేస్తానన్న మాట నాకు కొండంత ధైర్యాన్నిస్తోంది. మనిషికి మనిషి తోడు చాలు!" నిధి అన్నాడు. "నవనిధుల సన్నిధి అయిన నా గమ్యాన్ని చేరుకోడానికి కొన్ని కొండగుర్తులున్నాయి. వాటిలో ఒకటి 'శివార్జున వృక్షం'. అది ఎక్కడ ఉందో చెప్పగలవా అవనీ?"

అవని చిన్నగా నవ్వింది. "భూగోళరూపంలో 'విపుల'గా, విస్తృతంగా ఉన్న నా మూల స్వరూపానికి తెలుసు. ఏ ప్రాణి భూలోకంలో ఎక్కడ ఉన్నా తన ముందున్నట్టే; స్థూల రూప పృథ్వికి! కానీ, పరిమితమైన ఈ శరీరంలో బంధించబడిన ఈ 'అవని'కి కాదు. ఆ వృక్షం ఎక్కడుందో ఇక్కడి నుండి చూసి చెప్పలేను! అన్వేషించాల్సిందే!"

"ఆ అన్వేషణ మీద నేను ఇంక ప్రయాణం సాగించాలి!" నిధి పైకిలేస్తూ అన్నాడు.

"నీతో పాటూ నేను కూడా" అవని పైకి లేచింది.

***

నిధి స్పందనను గ్రహించినట్టు, పచ్చిక రుచి చూడ్డం మాని, అతని దగ్గరగా వచ్చింది వాయు. నిధి అవని వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. "ముందా? వెనకా?"

"నువ్వు ముందు, నేను వెనుక..."

నిధి మారు మాట్లాడకుండా అశ్వం మీదికి చేరాడు. అవనికి తన చేతిని ఊతగా అందించాడు. అవని అతని వెనక, గుర్రం మీద సర్దుకుంది.

శ్వేతాశ్వం పరుగు ప్రారంభించింది. నదికి సమాంతరంగా ఆ ప్రయాణం సాగుతోంది. నదిలో నీటిచుక్క లేదు! భూకంప ప్రభావంతో పైభాగాన ఎక్కడో నది చీలికతో ఏర్పడిన అగాధంలోకి అంతర్థానమై పోయింది. వాలుగా ప్రవహిస్తున్న నీళ్ళు ప్రవహించుకుపోయి, నది నిర్జలం అయిపోయింది!

"నీకు ఆగ్రహం వస్తే– నీకు అంటే నీ స్థూల రూపానికి, భూగోళానికి– భయానక ప్రళయమే" నిధి గుర్రాన్ని వేగంగా పోనిస్తూ అన్నాడు. "నిన్ను –నీ మౌలికరూపాన్ని– 'భూమాత' అంటారు మా మానవులు. అమ్మకు ఇంత ఆగ్రహం తగునా?"

అవని చిన్నగా నవ్వింది. "నాకు ఎన్నో పేర్లున్నాయి. వాటిలో 'సర్వంసహ' అనేది ఒకటి. 'సర్వాన్నీ సహించేది' అని అర్థం. అన్నింటినీ సహనంతో భరించేది అని అర్థం. భూమండలంలో నివసించే అనేక

రకాల ప్రాణులు ముఖ్యంగా మానవులు అనుక్షణమూ ఏవో, ఎన్నో అపరిశుభ్రమైన అపవిత్రమైన పదార్థాలనూ, వ్యర్థాలనూ తాము భరించలేని వాటినీ నా మీద పడవేస్తూ ఉంటారు. నాలోపల కప్పిపెడుతూ వాటి పీడ వదిలించుకుంటూ ఉంటారు. ఆ కల్మష పదార్థాలను, వస్తువులను, విసర్జకాలను చంటిబిడ్డ మలమూత్రాలను భరించే తల్లి లాగా భరిస్తూ ఉంటాను. భూ'మాతను' కద! కొన్ని సందర్భాలలో అవాంతరాలు సంభవిస్తాయి. పచ్చని పంటలు పండిస్తూ, మనుషుల్ని పోషించే నది, కొన్ని సందర్భాలలో పొంగిపొరలి పంటల్ని ముంచివేసి, సర్వనాశనం చేస్తుంది. ఇలాంటి విపరీత పరిణామాలకు మానవ ప్రవర్తన కూడా కారణమవుతుంది, తెలుసా!"

నిధి తలపంకిస్తూ అన్నాడు. "ఇలాంటి అవాంతరాలను ప్రకృతి వైపరీత్యాలంటారు కద..."

"మానవుల వికృతి కూడా ప్రకృతి వైపరీత్యాలకు తోడవుతూ ఉంటుంది! దానికి కారణం ఏమిటో తెలుసా? ఈ సువిశాలమూ, విస్తారమూ అయిన 'చరాచర' ప్రకృతిలో తాను కూడా ఒక భాగమే అని మనిషి అనుకోడు. ప్రకృతి కంటే తాను ప్రత్యేకం అనుకుంటాడు. ప్రకృతి చాలా సామాన్యమైందనీ, తను అసామాన్యుడనీ, తన వ్యక్తిత్వం విశిష్టమైనదనీ, విభిన్నమైనదనీ భావిస్తాడు!"

"నువ్వు చెప్తుంటే నిజమే అనిపిస్తోంది అవనీ!" నిధి అన్నాడు.

"నిజమే మరి! చూశావా, నాకు ఆకలేస్తోంది!" అవని అంది.

"నాక్కూడా. భూకంప ప్రాంతాన్ని దాటినట్టు ఉన్నాం. ఎదురుగా దట్టంగా ఫలవృక్షాలు కనిపిస్తున్నాయి" నిధి అన్నాడు.

"త్వరగా పద, అయితే" అవని అంది.

శ్వేతాశ్వం వాయు తన పరుగులో వేగం పెంచింది.

"కొబ్బరిచెట్లు చూశావా? ముందుగా తియ్యటి కొబ్బరి తిందాం. తిన్నాక, తియ్యటి లేత కొబ్బరి నీళ్ళు తాగుదాం!" అవని అంది.

"అలాగే!" నిధి గుర్రాన్ని కొబ్బరిచెట్ల సమీపంలో ఉన్న పెద్ద వటవృక్షం వైపు మళ్ళిస్తూ అన్నాడు.

వటవృక్షం క్రింద వాయు ఆగింది. నిధి దిగి, అవని దిగటానికి సహాయం చేశాడు. అవని పచ్చిక మీద కూర్చుని, చుట్టూ చూసింది. అందమైన, పచ్చటి ప్రకృతి. అద్దంలో తనను చూసుకుంటున్నట్టు అనిపిస్తోందామెకు ఎందుకో!

కత్తి ఉన్న ఒరను ఆమె దగ్గరగా పచ్చికమీద పెట్టి, బాకును పళ్ళ మధ్య బిగించి, నిధి కొబ్బరి చెట్టు ఎక్కుతున్నాడు. కాస్సేపట్లో బాగా ముదిరిన కొబ్బరికాయలూ, ఆకుపచ్చ రంగులో ఉన్న లేత కొబ్బరికాయలూ మెత్తగా చప్పుడు చేస్తూ నేలమీద పడుతున్నాయి.

***

శ్వేతాశ్వం ఇద్దర్నీ అవలీలగా మోస్తూ సాయంకాలం నీరెండలో ఉత్సాహంగా పరుగెడుతోంది. ఆకలి తీర్చుకున్న అనంతరం సాగిన ప్రయాణం అంతా విశాలంగా ఉన్న పచ్చికబయలులోనే. ఇప్పుడు పొదలూ, చెట్లూ ప్రత్యక్షమవుతూ అరణ్య వాతావరణాన్ని కల్పిస్తున్నాయి. ఉన్నట్టుండి వాయు ఎత్తుగా పెరిగిన రకరకాల చెట్ల మధ్య మెలికలు తిరిగిన బాటలో పరుగెడుతోంది. బాట అస్పష్టంగా ఉంది. తరచుగా రాకపోకలు జరిగే మార్గంలా లేదు.

రకరకాల వృక్షాలతో, పొదలతో, తీగలతో అరణ్యం క్రమంగా దట్టంగా రూపొందుతోంది. ఉన్నట్టుండి గుర్రం పరుగెడుతున్న కాలిబాటకు రెండు వైపులా ఎవరో క్రమపద్ధతిలో నాటి, పెంచినట్టు తెల్లమద్ది చెట్లు ప్రత్యక్షమయ్యాయి. ముఖం ఆకాశానికి అభిముఖంగా ఉండేలా ఎత్తితేగానీ, వాటి చిటారు భాగాన్ని చూడలేనంత ఎత్తుగా ఉన్నాయి మద్ది చెట్లు. చేయి వేస్తే జారిపోయేలా నున్నగా మెరుస్తున్నాయవి. ఆ ప్రాంతంలో ఆ అర్జున వృక్షాలు మరొక జాతి చెట్టును ఎదగనిచ్చినట్టు లేదు! తమ ప్రయాణం అర్జునవనం మద్దిఅడవి చేరినట్టుంది.

సంధ్యారాగం మసక చీకట్లకు అవకాశం ఇచ్చే ప్రయత్నంలో ఉంది. రాత్రికి తమకు ఆహారాన్నీ, నీడనూ, నీటినీ ఇచ్చే ప్రదేశం కోసం చూస్తున్నాయి నిధి కళ్ళు. మలుపు తిరగగానే అతని అన్వేషణ ఫలించింది. అర్జునవృక్షాల అనుమతి లభించినట్టు కుడివైపున అరటి చెట్లు గుంపుగా ఉన్నాయి. రెండు మద్దిచెట్ల మధ్య సెలయేరు తేటగా పరుగెడుతోంది. సువాసనలు వెదజల్లుతున్న పువ్వులతో కనువిందు చేస్తున్న పొదరిండ్లు. నిధి వాయుని ఆపాడు.

***

ఆకాశంలో వెలిగిపోతున్న చంద్రుడు వెన్నెలను వెదజల్లుతున్నాడు. పొదరింట్లో రాలిన పువ్వుల మీద ఉన్న పుల్లల్నీ, పుడకల్నీ ఏరివేసి, అవనికి పడుకునే ఏర్పాటు చేశాడు నిధి. చంద్ర కిరణాలు పొదరింటి కప్పును చిల్లులు పొడుస్తున్నాయి. చేతిని తలగడగా చేసుకుని, నిధి నడుం వాల్చాడు. గుర్రం అతని దగ్గరగా నిలుచుంది. చల్లటి గాలి వీస్తోంది. నిధి అవని వైపు చూశాడు. కాలము జరిగేకొద్దీ, ఆమె సాహచర్యం పెరిగేకొద్దీ – అవని భూమాత అవతారంగా కాకుండా ఒక మానవ యువతిలా అనిపిస్తోందతనికి. ఆమె మాట తీరూ, ప్రవర్తనా, ఆమెలో అప్పుడప్పుడూ కనిపించే సంభ్రమాశ్చర్యం... ఆమెను ఒక అవతారంగా కాకుండా పంచభూతాల కలయికతో జన్మించిన సామాన్య ప్రాణిగా చూపిస్తున్నాయి. అవును. ఆమె యువతి. ఒక అబల. ఆమె యోగక్షేమాలు తను చూసుకోవాలి. ఆమె తనకోసం, తన వెంట వస్తోంది. ఆమెకు రక్షణగా ఉండాలి తను. ఆమెకు ఏ ఆపదా రాకుండా తాను అప్రమత్తంగా ఉండాలి. నిధి అప్రయత్నంగా ఒత్తిగిలి పడుకుని అప్పటికే నిద్రలోకి జారుకున్న అవనివైపు చూస్తూ ఉండిపోయాడు.

సూర్యోదయానికి ముందే మేల్కొన్న నిధి సెలయేటి వెంట కొంచెం దూరం నడిచాడు. అవనిని జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉండాలని అనుకుంటూనే రాత్రి తను నిద్రలోకి జారుకున్నాడు. సెలయేరు

## భాగమతి 'సైరా' అంటుందా?

టాలీవుడ్ జేజమ్మ అనుష్కశెట్టి 'భాగమతి' సినిమాలో నటిస్తోందన్న సంగతి తెలిసిందే. అయితే ఈ భాగమతికి మరో అవకాశం వచ్చిందట. చిరంజీవి నటిస్తున్న సైరా నరసింహారెడ్డి సినిమాలో ముగ్గురు హీరోయిన్లకు అవకాశాలుండగా, అందులో ఒకరు నయనతార అనుకోగా, ఇంకొక హీరోయిన్‌గా అనుష్కని తీసుకోనున్నట్లు సమాచారం. చిరంజీవి 150వ చిత్రం ఖైదీ నెంబర్ 150 సమయంలోనూ ఆమెను సంప్రదించగా, కొన్ని కారణాల వల్ల అనుష్క ఆ అవకాశాన్ని వదులుకుంది. కానీ ఇప్పుడు ఆమె ఆ అవకాశాన్ని వదులుకోదనే అభిప్రాయం ఫిల్మ్‌నగర్‌లో వ్యక్తమవుతోంది.



ఒక పల్లంలో విశాలంగా సరస్సులా ఏర్పడింది. తామరలు అప్పుడప్పుడే వికసిస్తున్నాయి. స్నానాది కాలు ముగించి, నిధి వెనుదిరిగాడు.

అప్పటికే మేలుకున్న అవని శ్వేతాశ్వాన్ని నిమురుతూ నిలుచుంది. దూరం నుండి ఆమె వైపు చూస్తూ నడుస్తున్న నిధి పాదానికి ఏదో గట్టిగా తగిలింది. నిధి తలవంచి చూశాడు. ఒత్తుగా పెరిగిన పచ్చికలోంచీ అర్ధచంద్రాకారంలో ఉన్న నల్లటి కొయ్యముక్క తొంగిచూస్తోంది. నిధి వంగి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. చేవతో బలంగా, నల్లగా ఉంది ఆ కొయ్యముక్క. పూర్తిగా అర్ధచంద్రుడి ఆకారంలో లేదది. చూపుడు వేలూ, బొటనవేలూ – రెండింటినీ ఎడంగా జరిపితే ఏర్పడే ఆకారంలా ఉందది. చేత్తో అటూఇటూ తిప్పి, విసిరి పారేయబోతూ ఆగాడు నిధి. కళ్ళు చిట్లిస్తూ, సాలోచనగా కొయ్యముక్కను చూస్తూ ముందుకు నడిచాడు.

అవని పూలతో, మొగ్గలతో నిండిన పొదరిండ్ల మధ్య తిరుగుతూ వాటి సువాసనను అనుభవిస్తోంది. నిధి నేలమీద కూర్చొని బాకును తీశాడు. ఎడమ చేతిలోని కొయ్యముక్కను చెక్కడం ప్రారంభించాడు.

అవని దగ్గరగా వచ్చింది. నిధి తన పని కొనసాగిస్తూ, ఆమెను చిరునవ్వుతో చూశాడు.

"ఏం చేస్తున్నావ్?" అవని అడిగింది, కుతూహలంగా.

"ఆయుధం..." నిధి బాకుతో చెక్కుతూ అన్నాడు. బాగా చేవతేలిన కొయ్య లోహంలాగా గట్టిగా ఉంది.

"ఆయుధమా? అంత చిన్న కొయ్యముక్కతో ఆయుధమేం చేస్తావ్?" అవని ప్రశ్నించింది. "అయినా నీ వద్ద కత్తీ, బాకూ ఉన్నాయిగా!"

"ఉన్నాయి. అయితే అవి చేతిలో ఉన్నంతవరకే! చేయిజారితే పనిచేయవు. మళ్ళీ మనం అందుకుని ప్రయోగించాల్సిందే! కత్తి, బాకు, గద అన్నీ అంతే..."

"ఇది?"

"ఇప్పుడు నేను ఈ చిన్న కొయ్యముక్కతో రూపొందిస్తున్న ఆయుధం ప్రయోగిస్తే, లక్ష్యాన్ని తాకి, మళ్ళీ ప్రయోగించాల్సిన వ్యక్తి వద్దకు తిరిగి వస్తుంది!"

"ప్రాణం లేని ఈ ఆయుధం తిరిగి వస్తుందా?"

"ఆ! మచ్చికైన మనిషి వద్దకు మరలివచ్చే పక్షి లాగా తిరిగొస్తుంది!" నిధి తన పని కొనసాగిస్తూనే అన్నాడు.

### రాజశేఖర చరిత్ర రచన ఇలా...

"తెలుగులో స్వతంత్రంగా వచనరచనకు మీరు పూనుకోలేరా?" అని కందుకూరివారిని మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో ప్రొఫెసర్ అయిన సమర్థి రంగయ్య ప్రోత్సహించారు. దాని ఫలితమే కందుకూరి వీరేశలింగం గారి నవల 'రాజశేఖర చరిత్రము.' ఇది ఆలివర్ గోల్డ్‌స్మిత్ రాసిన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' ఇంగ్లీషు నవలకు అనుసరణ అని 'తెలుగు రథం' పుస్తకంలో డా.తుర్లపాటి రాజేశ్వరి పేర్కొన్నారు.

**సేకరణ: ఎన్. తారకరామారావు**

"విచిత్రంగా ఉందే! దాని పేరేమిటి నిధీ?"

"దోదుమ్మ"

"దోదుమ్మా" అవని ఆశ్చర్యంతో అంది.

"ఆ... 'దోదుమ్మి', 'దోదుమి' అని కూడా అంటారు.."

"అయితే విష్ణుదేవుడి ఆయుధం సుదర్శనచక్రం లాగా అంటావా?"

"సుదర్శనచక్రం అనను, అనకూడదు! మనం విసిరినంత దూరం వెళ్ళి, తిరిగొస్తుందని మాత్రం చెప్పగలను."

"నువ్వు స్నానం చేసినట్టున్నావు..." తడిగా ఉన్న నిధి గిరజాల జుత్తును చూస్తూ అంది అవని.

"కొంచెం దూరంలో, రాళ్ళచాటున సెలయేరు కొలనుగా మారింది. అక్కడ హాయిగా స్నానం చేశాను."

"కొలనా? అయితే నేను వెళ్ళొస్తాను" అవని ఉత్సాహంగా అంది.

నిధి ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు. "అదిగో... నా ఉత్తరీయం.. ఉతికి ఆరవేశాను. తీసుకెళ్ళు.."

అవని పొదరింటి మీదున్న నిధి ఉత్తరీయం అందుకుని, సెలయేటి వెంట బయలుదేరింది. నిధి 'దోదుమ్మి'కి పదును పెట్టడం ప్రారంభించాడు.

నిధి చిన్నపాటి ఆయుధాన్ని చేత్తో పట్టుకుని, అటూఇటూ త్రిప్పి చూశాడు. అంచులు పదునెక్కిన లోహం అంచుల్లా ఉన్నాయి. దోదుమ్మి ఆయుధ పరిమాణాన్ని, బరువును పరిశీలిస్తూ చూసి, నిధి తృప్తిగా నిట్టూర్చాడు. ముచ్చటగా ఉన్న చిన్న ఆయుధం నిర్దేశిత ప్రమాణాలకు అనుగుణంగా ఉంది.

మీద ప్రసరిస్తూ చురుక్కుమంటున్న ఎండ నిధికి కాలాన్ని గుర్తుచేసింది. తలెత్తి చూశాడు. ఎప్పుడో ఉదయించిన సూర్యుడు పైకి ఎగబ్రాకేశాడు. నిధి అప్రయత్నంగా చుట్టూ చూశాడు. వాయు ఉంది, అవని లేదు. సరోవరం వద్ద చాలాసేపట్నుంచీ ఉండిపోయినట్టుంది. ఎండ తీవ్రతరం కాకముందే ప్రయాణం సాగించాలి. అవని పరిసరాలను తిలకిస్తూ ఉండిపోయింది. నిధి లేచి ఆయుధాలను తీసుకుని కొలనువైపు బయలుదేరాడు. వాయు అతన్ని అనుసరించసాగింది.

అటువైపున ఉన్న సరోవరానికి అడ్డుగా ఉన్న ఎత్తయిన రాయి దగ్గర ఆగి నిధి పిలిచాడు. "అవనీ!".

సమాధానం లేదు. నిధి చెవులు రిక్కించాడు. కొలనులో నీళ్ళు శబ్దం చేయడం లేదు. అంటే నీటిలో ఎవ్వరూ లేరు. పైగా అవని ఇటువైపు వచ్చి చాలాసేపు దాటింది. నిధి మళ్ళీ బిగ్గరగా పిలుస్తూ, కొలనువైపు వెళ్ళాడు. కొలను చుట్టూ కలియజూశాడు. అవని లేదు. కొలను ఒడ్డు నుండి సన్నటి దారి తూర్పువైపు వెళ్తోంది. నిధి ఆ దారివైపు వెళ్ళబోతూ, ఆగి, కొలనును పరిశీలనగా చూశాడు. ఏదో వెలితి తన దృష్టిని ఆకర్షించిందని అతనికి తెలుసు. ఆ కొరత ఏమిటో క్షణంలో తెలిసిపోయిందతనికి. ఉదయం తాను స్నానానికి వచ్చినప్పుడు వికసించిన తామరల్లో ఒక్కటి కూడా ఇప్పుడు నీటి మీద లేదు! కొలను బోసిపోయినట్టు కనిపిస్తోంది. అప్పుడు ఎన్నో తామరలు తనకు కనువిందు చేశాయి. ఆ తామరలన్నీ ఇప్పుడు ఏమయ్యాయి? ఎవరు కోశారు? అవని ఆ పని చేసి ఉంటుందా? ఆమెకు అన్ని తామరలు దేనికి? కొలను నిండా ఉన్న తామర పువ్వులన్నింటినీ అవని కోసి ఉంటుందంటే నమ్మబుద్ధి కావడం లేదతనికి.

ఇంతకీ అవని ఏమైంది? ఎక్కడికెళ్ళింది? నిధి ఆలోచిస్తూ కాలిబాట వైపు నడిచాడు. వాయు అతన్ని వెంబడించింది. బాట రెండు గోరింట పొదల మధ్య దూరింది. నిధి తటాలున ఆగాడు. ఎడమవైపున పొద మీద తన ఉత్తరీయం పడి ఉంది. నిధి గుండె దడదడ కొట్టుకుంది. ఉత్తరీయం చిరిగి ఉంది. దాని మీద రక్తం మరకలు.

**(ఇంకా వుంది)**



# ఆరోగ్యదాయిని కొబ్బరి



**గుడికెళ్లినప్పుడో, పండుగ సమయంలోనో కొబ్బరికాయలు కొడతాం. ఇక ఆరోగ్యం బాలేకుంటే శరీరానికి మళ్లీ సత్తువ రావాలంటే కొబ్బరి నీళ్లను తాగుతాం. వంటకాల్లో రుచులకోసం కొబ్బరిని వాడతాం. రకరకాల వస్తువులు తయారు చేయడానికి కొబ్బరి పీచును, కాండాన్ని రకరకాలుగా ఉపయోగిస్తాం. ఇలా ఆరోగ్యదాయినిగా, రుచికరమైన పదార్థంగా, ఆర్థిక వనరుగా కొబ్బరిచెట్టు మనకు ఉపయోగపడుతుంది.**

## పచ్చి కొబ్బరితో ప్రయోజనాలెన్నో

ప్రసాదరూపంలోనో లేక ఏదైనా వంటల్లోనో కొన్నిసార్లు ఎండుకొబ్బరికి బదులు పచ్చికొబ్బరిని వాడతాం. ఇలా పచ్చికొబ్బరి తినడం వల్ల ఆరోగ్యానికి ఎంతో మేలు చేసినవారవుతారని ఆరోగ్య నిపుణులు చెబుతున్నారు. పచ్చికొబ్బరిలో ఆరోగ్యానికి మంచి చేసే పోషకాలు పుష్కలంగా ఉన్నాయి. గుండె సంబంధిత సమస్యలున్నవారు పచ్చి కొబ్బరి తినటం వల్ల, ఇందులోని కొలెస్ట్రాల్ గుండె పనితీరును మెరుగుపరచటమే కాకుండా పచ్చికొబ్బరిలో లభించే ఉపయోగకరమైన కొలెస్ట్రాల్ బరువును కూడా తగ్గిస్తుంది. అంతేకాకుండా పచ్చికొబ్బరిలో యాంటీ వైరల్, యాంటీ బ్యాక్టీరియల్ గుణాలు ఎక్కువగా ఉంటాయి. ఇవి రోగనిరోధక శక్తిని పెంచుతాయి. శరీరం నిస్సత్తువగా అనిపించినప్పుడు నాలుగైదు పచ్చి కొబ్బరి ముక్కలు తింటే చాలు శరీరానికి తక్షణ శక్తి అందుతుంది.

ఎక్కువగా ఆటలాడే పిల్లలకు పచ్చికొబ్బరిని తినిపించవచ్చు. కొబ్బరి తినడం వల్ల జీర్ణశక్తి మెరుగుపడుతుంది. శరీరంలోని వ్యర్థాలు బయటకు పోతాయి. చర్మానికి కూడా మేలు జరుగుతుంది. శరీరంపై కనిపించే ముడతలకు చెక్ పెట్టవచ్చు. కొబ్బరి తినడం ద్వారా థైరాయిడ్ సమస్య అదుపులో ఉంటుంది. మూత్రనాళాల ఇన్ఫెక్షన్లకు చెక్ పెట్టవచ్చు. పచ్చికొబ్బరి ఎముకలు, దంతాలు, గోళ్ళకు మేలు చేస్తుంది. నోటిపూతను నయం చేస్తుంది.

## కొబ్బరి నీళ్లలో పోషక విలువలు

శరీరం నిస్సత్తువగా ఉన్నప్పుడో లేక ఆరోగ్యం బాగాలేనప్పుడో కొబ్బరినీళ్లు తాగుతుంటాం. ఇక వేసవి వచ్చిందంటే వీధికొక కొబ్బరిబొండాం దుకాణం వెలుస్తుంది. వేసవితాపం నుంచి ఉపశమనం పొందడానికి దివ్యౌషధం కొబ్బరిబొండాం. పుష్కలమైన లవణాలు, పోషక విలువలు ఉండే కొబ్బరి నీళ్లు శరీరానికి చల్లదనం ఇవ్వడంతో పాటు ఆరోగ్యానికి ఎంతో మేలు చేస్తాయి. కొబ్బరి నీటిలో ప్రొటీన్ల శాతం ఆవుపాలలో కంటే ఎక్కువగా ఉంటాయి. కొబ్బరినీరు తాగడం వల్ల రోగనిరోధక శక్తి పెరుగుతుంది, రక్తం శుద్ధి అవుతుంది. కంటిచూపు మెరుగు పడటమే కాకుండా జ్వరం, జలుబు ఉన్నవారికి టానిక్‌లా పనిచేస్తుంది. కొబ్బరి నీరు వాంతుల నుంచి ఉపశమనం కలిగిస్తుంది. దీనివల్ల కడుపులో మంట తగ్గుతుంది. శరీరానికి ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని అందిస్తుంది. అంతేకాదు మూత్ర విసర్జనలో ఎలాంటి ఇబ్బందులు రాకుండా కొబ్బరి నీరు దోహదపడుతుంది.

కొబ్బరి నీరు శరీరానికి కావాల్సిన విటమిన్-బిను పూర్తి స్థాయిలో అందిస్తుంది. ఇది జీవక్రియలను పెంచడమే కాకుండా, కండరాలకు బలాన్ని చేకూర్చి వాటికి మంచి ఆకృతినిస్తుంది. సహజ గ్లూకోజ్‌ను కలిగి ఉండే కొబ్బరినీరు తాగడం వల్ల తరచుగా ఆకలిగా అనిపించే పరిస్థితిని అదుపులో ఉంచుకోవచ్చు. అసలు కొవ్వు పదార్థాలు లేని ద్రావణంగా కొబ్బరినీటిని చెప్పుకోవచ్చు. ఒక కప్పు కొబ్బరి నీరు 46 కేలరీలు కలిగి ఉంటుంది. కాబట్టి బరువు తగ్గాలి అనుకునే వారికి ఇది మంచి ప్రత్యామ్నాయం.

కొబ్బరిబొండాంలో ఉండే కొబ్బరితో పోలిస్తే, అందులో ఉండే కొబ్బరి నీరు చాలా గాఢత కలిగి ఉంటుంది. కాబట్టి, శరీర బరువు తగ్గాలి అనుకునే వారికి వైద్యులు ఎక్కువగా దీనినే సిఫార్సు చేస్తున్నారు. కొబ్బరు నీరు, నిమ్మరసం కలిపి తాగటం వలన జీవక్రియ పెరగటమే కాకుండా, జీర్ణక్రియ కూడా మెరుగుపడుతుంది. ఇందులో చాలా తక్కువ స్థాయిలో చక్కెరలు ఉంటాయి కాబట్టి మధుమేహ వ్యాధిగ్రస్థులు కూడా నిరభ్యంతరంగా ఈ నీటిని తాగవచ్చు.

## అందానికి కూడా!

కొబ్బరి కేవలం ఆరోగ్యానికే కాదు అందాన్ని మెరుగుపర్చుకోవడానికి కూడా ఉపయోగపడుతుంది. కొబ్బరినీటిలో దూదిని ముంచి ముఖానికి మర్దన చేయడం వల్ల నల్లగా మారిన చర్మం తిరిగి నిగారింపు సంతరించుకుంటుంది. చిక్కటి కొబ్బరి పాలలో కొంచెం తేనె, రెండు టేబుల్ స్పూన్ల బియ్యపురవ్వ, బాదాం నూనె కలిపి పాదాలకు పట్టించి, మర్దన చేసి, ఆ తర్వాత చల్లటి నీళ్లతో కడుక్కుంటే పాదాలు మృదువుగా తయారవుతాయి.



\- నివేదిత



# కొంచెం దూరం-ఎంతో మేలు

**సమాజంలో నిత్యం మనకు ఎంతోమంది పరిచయమవుతూ ఉంటారు, మన చుట్టూ ఉంటూ మనల్ని ప్రోత్సహించేవారు కొందరైతే, నిరుత్సాహపరిచే వారు కూడా మరికొంద రుంటారు. కానీ సమాజమన్నాక అందరితో కలవక తప్పదు. వీటిని దృష్టిలో పెట్టుకునే ఎదుటి వారితో మన స్నేహం కొనసాగించాలి. అందుకే సజ్జనసాంగత్యమే ఎంతో మేలు, దుర్జన సాంగత్యం విడిచిపెట్టమని పెద్దలు చెబుతుంటారు. మంచి-చెడు, ఈర్ష్యఅసూయ, స్వార్థం దయలాంటి గుణాలున్న రకరకాల వ్యక్తులు మనకు నిత్యం ఎంతోమంది తారసపడు తుంటారు. అందరూ మంచివారని చెప్పలేం, అలా అని అందరూ చెడ్డవారని కూడా చెప్పలేం.**

వారి ప్రవర్తన, జీవనవిధానం, మాటతీరును బట్టి వ్యక్తుల తీరుతెన్నులను గుర్తించవచ్చు. అయితే వీరిలో నెగెటివ్ ఆలోచనలు ఉన్నవారి వల్ల మనకు ఏదో ఒక సందర్భంలో సమస్య వస్తే మరి కొన్నిసార్లు మానసికంగా తీవ్ర ఇబ్బందులు కూడా ఎదుర్కోవల్సిరావచ్చు. పెద్దలు చెప్పినట్లు ఆరు నెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారన్నట్లు, చెడుసావాసంవల్ల మంచి వ్యక్తిత్వమున్నవారు కూడా చెడ్డగా మారిపోయే ప్రమాదం ఉందన డంలో సందేహమేమీ అక్కర్లేదు. కాబట్టి అలాంటి వ్యక్తులకు ఎంత దూరంగా ఉంటే అంత మేలు. మరి ఎలాంటి వ్యక్తులను దూరంపెడితే మంచిదో మీరూ చదవండి. మీ నిత్యజీవితంలో మీకూ ఇలాంటి వ్యక్తులు ఎదురవుతే వారిపట్ల సానుకూలంగా ఉంటూనే నిర్మొహమాటంగా హద్దుల్లో ఉంచడం ఉత్తమం. ఫలితంగా మీ వ్యక్తిత్వం దెబ్బతినకుండా ఉండడంతో పాటు మానసికంగా ఎలాంటి ఒత్తిళ్లు లేకుండా హాయిగా జీవించవచ్చు.

## రెండు నాల్కల ధోరణి

మనం దగ్గర ఉన్నప్పుడు మనతో ఫ్రెండ్లీగా ఉంటారు. వీళ్లను నమ్మొచ్చు అనేంతగా ప్రవర్తి స్తారు. మన సమక్షంలోంచి వెళ్లగానే మన గురించి లేనిపోనివన్నీ ఇతరులకు చెప్తుంటారు. ఇలాంటి వారు మన చుట్టుపక్కల చాలామందే ఉంటారు. మనతో నమ్మకంగా మాట్లాడుతూ, మన పరో క్షంలో మనగురించి ఇతరులకు ఎదుటివారికి మరో కలాగ చెప్తుంటారు. ఎవరినైనా నమ్మొచ్చేమోగానీ, ఇలాంటి రెండు నాల్కల ధోరణి ఉన్నవారిని అసలు నమ్మకూడదు. ఎవరో ఒక వ్యక్తి మన గురించి ఎదుటివారితో ఇలా గుసగుసలాడుతున్నా రన్న విషయం మనకు తెలిస్తే ఎంతో బాధగా ఉంటుంది కదా! అందుకే వారు ఇలాంటి వ్యక్తు లని వారి మనస్తత్వం బయటపడిన దగ్గర్నుంచైనా వారిని దూరంగా పెట్టడం మంచిది. లేదంటే ఇత రులతో మీకున్న సత్సంబంధాలను కూడా వారు చెడ గొట్టే అవకాశం ఉంది. ఇలా మీముందు ఒకలా వెన కాల ఒకలా మాట్లాడుతున్నారని తెలిసినప్పుడు నేనెంత క్లోజ్ అనుకున్నాను, తెలిసిన వ్యక్తే ఇలా చేశారేంటి అని ఆలోచిస్తూ తెలియకుండానే ఒత్తి డికి గురవుతాం. దానివల్ల మానసికంగా నష్టపోవ డంతో పాటు సమయం వృథా అవుతుంది. కాబట్టి ఇలాంటి వారి గురించి, వారు ఇతరులతో చెప్పిన విషయాల గురించి అతిగా ఆలోచించి సమయం వృథా చేసుకోవద్దు. వారు ఫలానా అని తెలిసినప్పటి నుంచి వారిని కాస్త దూరంగా పెట్టడం మంచిది. అయితే ఇలాంటి వారిలో పాజిటివ్‌నెస్ తెచ్చేం దుకు, సానుకూలమార్పు తెచ్చేందుకు మంచి సల హాలిచ్చి తీర్చిదిద్దగలమనే విశ్వాసం మనలో ఉంటే ఆ పని చేయడం మరీ మంచిది. అది పదుగురికీ ఉప యోగపడుతుంది. ఒకరకంగా అది మోటివేషన్ లాంటిదే కూడా.

## అతిగా భావోద్వేగాలుంటే

భావోద్వేగాలు అందరికీ ఉంటాయి. కానీ అందరూ అన్ని వేళలా ప్రదర్శించరు. వీటిని అదు పులో పెట్టుకున్నంత వరకు అటు మీకు, ఇటు ఎదుటి వారికి ఎలాంటి ఇబ్బంది ఉండదు. కానీ కొందరు వీటిని అదుపులో పెట్టుకోలేరు. ఏచిన్న కష్టం వచ్చినా తట్టుకోలేరు. సంతోషం, వేసినా తట్టుకో లేరు. ఓవర్‌గా ఎగ్జయిట్ అవుతుంటారు. ఉదాహర ణకు సంతోషకర విషయమైతే అందరితో చెప్పడం, కోపం రప్పించే విషయమైతే సంబంధంలేకున్నా అందరిపై కోపం ప్రదర్శించడం, ఎదుటి వారిపై గట్టిగా అరవడం, కోప్పడడం చేస్తుంటారు. మరి కొందరైతే ఇతరులు అన్నమాటలు పట్టుకుని సంబంధంలేని వ్యక్తులను కూడా నిందిస్తారు. వారి గురించి ఇతరులవద్ద అతిగా చెప్పడం వంటివి చేస్తుంటారు. ఇలాంటివారు స్ప్రెడ్‌చేసే ఇబ్బందికర మైన విషయాలు, ప్రవర్తనవల్ల అప్పుడప్పుడు చేదు అనుభవాలు ఎదురయ్యే అవకాశం ఉంది. ఫలితంగా మనస్తాపానికి గురవుతాం. కాబట్టి ఇలా భావోద్వేగాలు



ఎక్కువగా ఉండే వ్యక్తులను ఎంత దూరం పెడితే అంత మంచిది.

### జాలి చూపిస్తున్నారా?

జాలి చూపించడం కొన్ని విషయాల్లో మంచిదే. కన్సర్న్ అనేది ప్రతి ఒక్కరూ కోరుకుంటారు. కానీ కొంతమంది ఎదుటివారిపై అధికంగా జాలి చూపిస్తుంటారు. అతి ఎప్పుడూ అనర్థదాయకమే అన్నట్లు అతి ప్రేమ, అతిగా జాలిచూపించే వారివల్ల కూడా ఎప్పుడో ఒక సందర్భంలో తిప్పలు తప్పవన్నది గుర్తుంచుకోండి. అందుకే అతిగా జాలి చూపించేవాళ్లని వీలైనంత దూరంగా పెట్టడం మేలు. ఎందుకంటే ఇలా మనపై అతిగా జాలి చూపిస్తుంటే మనం కూడా వారిగురించి మరింత ఎక్కువ ఆలోచించడం మొదలుపెడతాం. ఇలా మన మనసును పూర్తిగా వారివైపు తిప్పుకుని వారిపై మనకు సానుకూల దృక్పథం ఏర్పడేలా చేస్తారు. ఫలితంగా వారు మంచిచేసినా చెడు చేసినా మనకు అది కరెక్ట్‌గానే అనిపించే అవకాశం ఉంది. అదీకాక ఇలాంటి వ్యక్తుల్లో కొందరు వారిని పూర్తిగా నమ్మాం కదాని మనతో అప్పుడప్పుడూ కొన్ని నెగెటివ్ పనులు కూడా చేయించడానికి ప్రయత్నిస్తుంటారు. ఫలితంగా అది మనపై ఇతరులకు చెడు అభిప్రాయం కలిగేలా చేయవచ్చు. మొదట్లో వారు అడిగిన పనల్లా చేస్తుంటే మార్పు తెలియదు. ఈ మార్పు గమనించకుండా ఎక్కువ కాలం ఇలాంటి వ్యక్తులతో స్నేహం కొనసాగిస్తే మనలోని సద్గుణాలన్నీ తగ్గిపోయి మనం వారిలా తయారయ్యే అవకాశాలు లేకపోలేదు. కాబట్టి ఇలాంటి వ్యక్తులతో స్నేహం చేసేటప్పుడు కాస్త జాగ్రత్తగా ఉండడం మంచిది. ఏమాత్రం తేడాగా అనిపించినా అతిగా జాలి ప్రదర్శించే వారిని ఎంత దూరం పెడితే అంత శ్రేయస్కరం.

### ప్రతికూల దృక్పథం

జీవితంలో మనకు రకరకాల మనస్తత్వాలున్న వారు పరిచయం అవుతుంటారు. కొందరు ఎంకరేజ్ చేస్తే ఇంకొందరు ఏం చెప్పినా సరే, ఇదెందుకు అదెందుకు అంటూ నిరుత్సాహపరుస్తుంటారు. అంటే ఇలాంటివారు ప్రతికూల ఆలోచనలున్నవారన్న మాట. సందర్భం, పరిస్థితులు మనకు అనుకూలంగా ఉన్నాసరే ఇలాంటివారు నెగెటివ్‌థాట్స్ చేస్తారు. అంతేకాదు, మనల్ని కూడా అలా ఆలోచింపచేస్తుంటారు. ఇలాంటి వారి ప్రభావం మనమీద పడకుండా చూసుకోవాలి. మనలోని పాజిటివ్‌నెస్ పోగొట్టుకోకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. ప్రతి చిన్న విషయాన్ని ప్రతికూలంగా ఆలోచించే స్థాయికివెళితే, మనలో ఆత్మస్థైర్యం, ఆత్మవిశ్వాసం, మనపై మనకుండే నమ్మకం క్రమంగా సన్నగిల్లిపోతాయి. దీని వల్ల హాయిగా సాగిపోయే జీవితం బాధల్లోకినెట్టి మరింత దిగజార్చేలా చేస్తుంది. కాబట్టి ఇలాంటి వారి సలహాలు తీసుకోవడం, వారితో మన భావాలను చర్చించడం మంచిది కాదు. అందుకే ఇలాంటి వారికి వీలైనంత దూరంగా ఉండే ప్రయత్నం చేయాలి. నెగెటివ్ ఆలోచనలు చేస్తున్న వారికంటే పాజిటివ్ ఆలోచనలున్న వ్యక్తులతో స్నేహం మనకు ఎంతో మేలు చేస్తుంది.

### స్వార్థపరులు

వారివల్ల ఏమవుతుందండి, నేను చూడండి చిటికెలో చేస్తాను. అయినా ఈపని నేను మాత్రమే చేయగలను, ఇంకెవరు చేస్తారు నేను కాకుంటే... కొందరు తరచూ ఇతరులతో ఇలా మాట్లాడుతుంటారు. అందరిలోకీ నేనే గొప్ప, నాకు వంగి సలామ్‌లు కొట్టాలి, నేను ఏది చేసినా చెల్లుతుంది, నాకే సాధ్యం, ఎదురు చెప్పకూడదనే తరహా మనుషులు మన చుట్టుపక్కల ఉంటారు. ఇలాంటి వారితో మనకు తెలిసిన విషయాలు చెప్పి, వారితో చర్చించి వారి సలహాలు తీసుకోవడంవల్ల వారికున్న తప్పుడు అవగాహన, 'తాపట్టిన కుందేటికి మూడేకాళ్లు' అన్నట్టు తాము చెప్పిందే కరెక్టనీ, మనం చెప్పింది తప్పు అనీ వాదిస్తుంటారు. కొన్ని కొన్ని సందర్భాల్లో వాళ్లు చెప్పింది నిజం కావచ్చు, మనమే తప్పుకావచ్చు అనే భావన మనకు కలిగిస్తారు. ఆ సందర్భంలో మనం చెప్పింది నిజమైనా, చివరికి వారి ప్రవర్తనవల్ల మన భావనల్లోనే తప్పుందనుకుని నెగెటివ్ ధోరణిలోకి వెళ్లిపోతాం.

ఇక కొందరైతే వాళ్లు చెప్పినట్లు మనం వింటేనే మనతో స్నేహం చేస్తారు. వాళ్లు చెప్పినట్లు వినకపోతే మనపై కోపం ప్రదర్శించి నలుగురికీ మన గురించి చెడుగా చెబుతారు. ఇలాంటివాళ్లతో ప్రతి రోజూ మాట్లాడడం వల్ల కొంతకాలానికి ఆ ప్రభావంతో మన ప్రవర్తనలో తీవ్రలోపాలు ఏర్పడే అవకాశమూ లేకపోలేదు. ఇలాంటి ప్రవర్తనవల్ల మన పట్ల ఇతరులకు చెడు అభిప్రాయం కలిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే ఇలాంటి వ్యక్తుల్ని వీలైనంత దూరంగా పెట్టడం ఒకవేళ వారు అతిగా వాదించినా విననట్టుగా ఉండిపోవడం చేయాలి.

**–విజేత**



### ఎలాంటి వ్యక్తులతో స్నేహం చేస్తున్నారు?

*1. ఏ పని చేసినా వద్దు, కూడదు అంటున్నారా?*
*(ఏ) అవును, (బి) కాదు*

*2. ప్రతి చిన్న విషయానికి మీతో వాదన పెట్టుకుంటున్నారా?*
*(ఏ) అవును, (బి) కాదు*

*3. మీరంటే ఇష్టమని ప్రేమ కురిపిస్తూ మీతో అన్నిపనులూ చేయించుకుంటున్నారా?*
*(ఏ) అవును, (బి) కాదు*

*4. మీముందు ఒకలా మాట్లాడి, మీ వెనుక మరోలా మాట్లాడుతున్నారా?*
*(ఏ) అవును, (బి) కాదు*

*5. మీరు ఏపని చేసినా సరే వాళ్లకు సంబంధం లేకున్నా మీపట్ల అతిగా రియాక్ట్ అవుతున్నారా?*
*(ఏ) అవును, (బి) కాదు*

*పై ఐదు ప్రశ్నలలో కనీసం మూడింటికి 'అవును' మీ సమాధానమైతే అలాంటి వ్యక్తులను మీరు ఎంత దూరం పెడితే అంత మంచిది.*



### స్ట్రాంగ్‌గా ఉండాలి

ఎప్పుడూ పాజిటివ్‌గా ఉండడం మంచి లక్షణం. ఎవరో ఏదో అన్నారని నిరాశా నిస్పృహలకు లోనవుతుంటే జీవితంలో అనుకున్నవి సాధించలేం. మనమీద ఏవైనా గాసిప్స్, వ్యతిరేక వార్తలు వచ్చినా దాని గురించి వర్రీ అవసరం లేదు. మీరేంటో మీకు తెలుసు కాబట్టి మీ పని ద్వారా, ప్రవర్తన ద్వారా ఇతరులకు మీరేంటో తెలియజేయండి. తద్వారా సమాజం కూడా మీరేంటో గ్రహిస్తుంది. అంతేకాని ఎవరో ఏదో అన్నారని డీలా పడిపోతే ఏదీ సాధించకుండా మిగిలిపోతాం. ప్రతి వ్యతిరేకతనూ చిరునవ్వుతో ఎదుర్కొని అందరినీ కలుపుకుంటూ, అప్రమత్తంగా ఉండాలి. అలా ముందుకు సాగితే విజయం మీదే.




యండి.' విధ్వంసం సృష్టించండని దానర్థం. వేలాది మంది అనుచరులకు వెయ్యి రూపాయల చొప్పున ఇచ్చి, విధ్వంసానికి పురిగొల్పారు. వారంతా కోర్టు ఆవరణలో, పోలీస్ స్టేషన్ల చుట్టూ తిరగడం ప్రారంభించారు. పోలీసులు ఈ సంగతిని పసిగట్టి వందలాది మందిని అరెస్టు చేశారు. అయితే అప్పటికే హర్యానాలో జరగాల్సిన విధ్వంసం జరిగిపోయింది. అనుచరులు సృష్టించిన బీభత్స కాండకు ముప్పయ్ మందికి పైగా బలైపోయారు. రామ్ రహీమ్ సింగ్ డేరా బాబా చేతుల్లో అత్యాచారానికి గురైన బాలికల్లో ఇద్దరు బాలికలు ఎంతో గుండెధైర్యంతో పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేయడానికి రావడం, పోలీసులు వారి ఫిర్యాదును పట్టించుకోకపోవడం, అయినప్పటికీ వారు ఒక జర్నలిస్టును కలిసి చెప్పుకోవడం, జర్నలిస్టు ధైర్యంతో రాసిన కథనాన్ని సూమోటోగా స్వీకరించి కోర్టు విచారణ జరపడం నిజంగా ప్రశంసనీయమైన విషయం. లేకపోతే దేవుడి ముసుగులో ఈ మానవ మృగం ఇంకా ఎంతకు తెగించేదో అర్థం చేసుకోవడం కూడా కష్టమే.

### భారీగా ప్రజల మద్దతు

హర్యానాలోని సిర్సాలో డేరా సింగ్ ఓ విశాల సామ్రాజ్యాన్ని నడుపుతున్న తీరు చూసి పోలీసులు సైతం నిర్ఘాంతపోయారు. ఆ సామ్రాజ్యంలో డేరా ఓ పోటీ లేదా సమాంతర ఆర్థిక వ్యవస్థను కూడా నిర్వహించాడంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ సామ్రాజ్యంలో ఉన్న డేరా అనుచరులెవరూ బయటి ప్రపంచంతో ఎటువంటి సంబంధాలూ పెట్టుకోకూడదనే నియమం ఉంది. మగవారైనా, మహిళలైనా ఇక్కడి అనుచరులు లేదా సభ్యులు ఈ సామ్రాజ్యానికే పరిమితమైపోవాలి. ఎవరైనా ఈ నియమాన్ని అతిక్రమిస్తే గురూజీ ఆగ్రహానికి గురికాక తప్పదు. అంటే ఒక్కోసారి మరణ శిక్షలు కూడా ఉండొచ్చన్న మాట.

# మూఢనమ్మకాలే పెట్టుబడి

**దేశంలో డేరా బాబా వంటి వారు పుట్టి పెరగడానికి దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలే కారణం. ఇవి మారనంత వరకూ డేరాలు తప్పవనిపిస్తోంది.**

అత్యాచారాల కేసులో ప్రస్తుతం ఇరవై ఏళ్ల జైలుశిక్ష పడిన డేరా సచ్చా సౌదా బాబా గుర్మీత్ రామ్ రహీమ్ సింగ్ సుమారు పదిహేనేళ్ల క్రితం తన శిష్యులకు చెప్పింది ఒకటే. తమ ఆశ్రమంలో ఉన్న భక్తులు, తమ ఆశ్రమానికి వచ్చే భక్తులకు తాను కనిపించీ కనిపించనట్టు కనిపించాలి. ఆయన ఎప్పుడు దర్శనమిస్తాడా, తమను ఎప్పుడు తరింపజేస్తాడా అని ఎదురు చూడాలి. ఆయన ఎవరు, ఎట్లా ఉంటారు, ఎలా తమను అనుగ్రహిస్తారు అని ప్రతి క్షణం సంభ్రమాశ్చర్యాలకు లోనవుతుండాలి. ఒక్క క్షణం తాను కనిపించినా దేవుడే ప్రత్యక్షమైనట్టుగా భావించాలి. ఇక భక్తులంతా తనకు విధేయులై ఉండాలి. తాను చెప్పిందే వేదం అన్నట్టుగా వ్యవహరించాలి.

ఆయన శిష్యకోటి తమ గురువు నుంచి వచ్చిన ఆదేశాలను తూచా తప్పకుండా పాటించారు. అంతే. ఆ దివ్య సందేశమే ఆయనను అందలాలకు ఎక్కించింది. ఆయన చుట్టూ ఓ అభేద్యమైన కోట ఏర్పడిపోయింది. తానే దేవుడని చెప్పుకునే ఈ గడ్డం సాధువు తన చుట్టూ నిర్మించుకున్న, అల్లుకున్న 'స్వర్గ' వాతావరణం సుమారు అయిదు కోట్ల మంది భక్తులను సమ్మోహనపరచింది. ఆయనకు పాదాక్రాంతుల్ని చేసింది. కాలక్రమంలో భక్తులను సమ్మోహనపరచడంలో ఆరితేరిన ఈ డేరా బాబా భూకబ్జాలకు పాల్పడినా, అత్యాచారాలకు పాల్పడినా, సిరి సంపదలు కూడగట్టుకున్నా పదిహేనేళ్లపాటు ఎదురే లేకుండాపోయింది. సినీ ప్రముఖులు, వ్యాపార, వాణిజ్యవేత్తలు, పారిశ్రామికవేత్తలు, పోలీస్ ఉన్నతాధికారులు, ప్రభుత్వాధికారులు, మంత్రులు, చట్టసభల సభ్యులు...ఇలా వారూ వీరూ అనేమిటి, ఉత్తరాదిన ముఖ్యంగా హర్యానా, పంజాబ్ రాష్ట్రాలలో ప్రతివారూ ఆయనకు సాగిలపడి పోవడం ప్రారంభించారు. భక్తులే కాదు, చివరికి ఆయన సైతం తాను దేవుడినని నమ్మే స్థితికి చేరుకున్నారు.

చివరికి ఈ అభేద్యమైన కంచుకోట పేకమేడలా కూలిపోవడానికి ఎంతో కాలం పట్టలేదు. తన పాపం పండి, తన బండారం బట్టబయలైనప్పుడు, కోర్టు తనను దోషిగా నిర్ధారించినప్పుడు ఆయన తన సహజసిద్ధమైన ధోరణితో అనుచరులకు కోడ్ భాషలో మార్మిక సందేశం జారీ చేశారు. అది: టమేటాలను నలిపినట్టు నలిపే






**- రాజశుక**

మరో ఆసక్తికర విషయమేమిటంటే, డేరా సింగ్ తన ఆశ్రమంగా చెప్పుకునే కంచుకోటలో ప్రత్యేక కరెన్సీ చలామణీలో ఉంది. ఇక్కడ భారతీయ కరెన్సీతో అల్యూమినియం నాణాలను కొనాల్సి ఉంటుంది. భోజనానికి, వసతికి ఈ నాణాలనే ఉపయోగించాల్సి ఉంటుంది. ఇతర కరెన్సీలను ఇక్కడ అనుమతించరు. ఇక ఈ సామ్రాజ్యంలో ఎక్కడా టీవీలు కనిపించవు. పెద్ద పెద్ద స్క్రీన్లు మాత్రం అమర్చి ఉంటాయి. ఈ స్క్రీన్లమీద గురూజీ గురించి మాత్రమే చూపిస్తుంటారు. దశావతారాలు ఎత్తిన విష్ణువుతో గురూజీని పోలుస్తూ కథలు, కథనాలు ప్రసారం అవుతూ ఉంటాయి. ఆయన్నొక సాధువుగా, దాతగా, క్రీడాకారునిగా, నటునిగా, గాయకునిగా, చలనచిత్ర దర్శకునిగా, రచయితగా, గేయ రచయితగా, దేవదూతగా రకరకాల అవతారాలలో ప్రదర్శిస్తుంటారు. చాలా కాలం పాటు తాను కూడా అతని ఉచ్చులో ఉండిపోయాననీ, సుమారు ఇరవై ఎకరాలు పోగొట్టుకున్న తర్వాత జ్ఞానోదయం అయిందనీ ఓ రైతు చెప్పాడు.

ఆ ఆశ్రమంలో డేరా బాబాకు ఓ చీకటి గుహ కూడా ఉందని తెలిసింది. ఏకాంతం కోసం మధ్య మధ్య ఆయన ఆ గుహలో ప్రవేశించి కాలక్షేపం చేస్తుంటాడు. ఆ గుహను చూస్తే పాతాళభైరవి సినిమాలో మాంత్రికుడి గుహ గుర్తుకొస్తుంది. ఆ గుహలోకి వెళ్లాలంటే ఓ సొరంగం గుండా నడవాల్సి ఉంటుంది. మరీ ఆంతరంగిక శిష్యులను మాత్రం చాలా అరుదుగా ఆ గుహలోకి రానిస్తుంటాడు. ఆ గుహలో ఆయనకో పెద్ద సింహాసనం, ఓ హంస తూలికాతల్పం ఉన్నాయి. ఆ గుహలో లేని సౌకర్యం అంటూ లేదు. లోపల ఏసీలు కూడా ఉన్నాయి. ఇక కార్లలో వేగంగా ప్రయాణించడమంటే ఆయనకు చాలా ఇష్టం. కారు ఆగగానే తలుపులు వాటంతటవే తెరుచుకుంటాయి. పక్కనే సాయుధ అంగరక్షకులు ఉంటారు. ఇక ఆయన దగ్గర ఎన్ని డెబిట్ కార్డులున్నాయో లెక్క లేదు. ఆయన మాట్లాడుతున్నంత సేపూ శిష్యులైనా, భక్తులైనా, అనుచరులైనా తలెత్తి ఆయన వైపు చూడకూడదు. తల వంచుకునే ఉండాలి. అంటే ఆయన కాళ్ల వైపే చూస్తుండాలన్న మాట. మారు మాట్లాడకూడదు.

### అసలు కారణమేమిటి?

ఆయన సామ్రాజ్యంలో పళ్ల రసాలు తయారు చేసే కర్మాగారం ఉంది. ఓ క్రీడా మైదానం ఉంది. ఓపెన్ ఎయిర్ థియేటర్ ఉంది. వర్షం పడితే ఓ ఫైబర్ గ్లాస్ కవర్ వెంటనే ఏర్పడిపోతుంది. ఆ సామ్రాజ్యంలో ఆయనే మొదటి వ్యక్తి. చివరి వ్యక్తి కూడా. తన తర్వాత రెండవ వ్యక్తిగా, మూడవ వ్యక్తిగా ఎవరైనా ఉండడానికి ఆయన ఇష్టపడరు. భక్తులకు ప్రవచనాలు ఇస్తున్నప్పుడు బాబాలు ధరించే విధంగానే తెల్లటి పొడవైన వస్త్రాలు ధరిస్తాడు. ఇంటర్వ్యూలలో మాత్రం కౌబాయ్ సినిమాలో హీరోలా దుస్తులు వేసుకుంటాడు. ఆయన పదిహేను సెకన్లలో పాట రాసేస్తారు. ఒక్క నిమిషంలో షూటింగ్, రికార్డింగ్ కూడా పూర్తవుతుంది. ఆయన దేవుడు గనుక ఇటువంటివన్నీ చేయగలడని భక్తులు భావిస్తుంటారు. 'జీసస్ క్రైస్ట్ సూపర్‌స్టార్' కావాలనేది ఆయన ఆశయం. తన ఆశ్రమం ఓ పెద్ద మీడియా సంస్థగా మారాలని ఆయన ఆలోచిస్తున్నారు. ఇందులో ఓ వార్తా పత్రిక, ఓ వార్తా చానెల్, వందలాది మంది రిపోర్టర్లు ఉండాలని ఆయన భావిస్తున్నారు. ఆయన ఓ ఆంగ్లపత్రికకు చెందిన ఓ సీనియర్ ఎడిటర్‌ను పిలిచి తన జీవితకథ రాయాలని పురమాయించారు. చివరికి ఆ ప్లాన్ ఏమైందో తెలియదు.

ప్రస్తుతం హర్యానా పోలీసులే కాకుండా, పంజాబ్ పోలీసులు కూడా దేశ విదేశాల్లో ఉన్న ఆయన ఆస్తుల వివరాలను సేకరించి జాబితా రూపొందించే పనిలో నిమగ్నమయ్యారు. ఢిల్లీలోని ఓ హవాలా వ్యాపారితో ఆయన కోట్లాది రూపాయలు విదేశాలకు తరలించినట్టు పోలీసుల దర్యాప్తులో తేలింది. ప్రస్తుతం పోలీసులు ఆ హవాలా వ్యాపారిని గుర్తించే పనిలో ఉన్నారు. ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్, ఆదాయ పన్నుశాఖల అధికారులు ఆయన మీద ఓ కన్ను వేసి ఉన్నారు. ఆయన ప్యానెల్‌లో ఎంత మంది వైద్య నిపుణులు ఉన్నారో లెక్కలేదు. అఖిల భారత వైద్య విజ్ఞాన సంస్థకు చెందిన డాక్టర్లలో చాలామంది ఆయన జాబితాలో ఉన్నట్టు కూడా పోలీసుల దర్యాప్తులో వెల్లడైంది. ఎంతో మంది పురుష భక్తుల వృషణాలను తొలగింపజేసి, తాను మాత్రం మహిళా భక్తులను ఉపయోగించుకునే డేరా బాబా చెరలో చాలా మంది వైద్యులున్నట్టు వెల్లడైంది.



**అత్యాచారాల కేసులో ఇరవైఏళ్ళు శిక్షపడిన దేరాబాబా ఇంతకాలం హర్యానాలో ఒక విశాల సామ్రాజ్యం నడిపాడు. ఆయన కంచుకోటలో ప్రత్యేక కరెన్సీ ఉంది. ఆయనకో సొరంగగుహ ఉంది. అక్కడ ఏసీలు, ప్రత్యేక సింహాసనం, హంసతూలికాతల్పం ఉన్నాయి. ఆయనతో మాట్లాడేవారు తలెత్తి చూడకూడదు. విదేశాల్లో కోట్లాది ఆస్తులు, ఐదుకోట్లమంది భక్తులున్న దేరాబాబా పూర్తివివరాలు తెలుసుకుంటే కళ్ళుతిరిగే పడిపోవాల్సిందే.**

ఆయనకు ఇంతమంది శిష్యులు, భక్తులు, అనుచరులు ఎలా ఏర్పడ్డారన్నది విచిత్రమే. డేరా బాబా విషయానికి వస్తే, 'డేరా'లో కుల మత వ్యత్యాసాలు లేవు. అక్కడ అందరూ సమానులే. డేరా బాబాకు విశ్వాసపాత్రునిగా ఉన్నంతవరకూ అక్కడ ఎవరు ఏ కులం ఏ మతం అన్నది ఎవరూ పట్టించుకోరు. అక్కడ పెద్దా చిన్నా తేడా కూడా లేదు. రాష్ట్రాన్ని ఓ మండలం చొప్పున విభజించి, మండలానికో 'భంగీదాస్'ను ఏర్పాటు చేస్తారు. అతనే భక్తులు వ్యవహారాలు చూసుకుంటుంటాడు. భక్తులందరికీ బాగా తగ్గింపు ధరలకు మృష్టాన్న భోజనం లభిస్తుంది. అక్కడ బస చేసేవారికి ఉచితంగా ఆహార ధాన్యాలు, స్టవ్ వగైరాలు అందజేస్తారు. హర్యానాలోని సిర్సాలో చాలామందికి ఆరోగ్యాలు బాగుండవు. బహుశా కలుషిత నీటి సరఫరా కావచ్చు. ముఖ్యంగా మోకాళ్ల నొప్పులు, కేన్సర్ బాధితులు ఎక్కువ. వారందరికీ అక్కడ ఉచితంగా చికిత్స, వసతి సౌకర్యాలు లభిస్తాయి. ఆయనకు కోట్లాది మంది శిష్యులు ఏర్పడడానికి బహుశా ఇవే కారణాలు కావచ్చు. సాధారణంగా ఇక్కడకు వచ్చేవారికి భావోద్వేగపరమైన, ఆధ్యాత్మిక సంబంధమైన సాంత్వన లభించడం కూడా మరో కారణం కావచ్చు.

ఇక సామాజిక, వైద్య, విద్య, ఆధ్యాత్మిక రంగాలలో ఈ డేరా చేస్తున్న సేవలు కూడా జనాన్ని బాగా ఆకట్టుకుంటున్నాయి. గత ఇరవై ఏళ్ల కాలంలో ఓ మత సంస్థ కన్నా ఎక్కువగా ఈ డేరా సంస్థ హర్యానా, పంజాబ్ గ్రామాల్లో సేవలు అందించిందని అధికారులు చెబుతుంటారు. విచిత్రమేమిటంటే ఈ సంస్థ సేవా కార్యక్రమాల్లో వివాహ సంబంధాలు కుదర్చడం కూడా ఒకటి. పేదల పెళ్లి ఖర్చును కూడా ఈ సంస్థే భరిస్తుంటుంది. స్థానిక సిక్కులకు మాత్రం ఈ సంస్థ కార్యకలాపాల పట్ల మొదటినుంచీ అనుమానాలున్నాయి. జనాన్ని గురుద్వారాలకు రానివ్వకుండా ఈ డేరా అడ్డుపడుతోందని కూడా వారు భావిస్తున్నారు. గురుద్వారాలకు రావాల్సిన ఆహార ధాన్యాలు, నగదు కూడా డేరా వైపే వెళ్లిపోతున్నాయని కూడా వారు సందేహిస్తున్నారు. రాజకీయంగా కూడా కొత్త తరం బడుగు వర్గాలవారు డేరావైపు ఆకర్షితులవుతున్నారు. ఇదంతా ఎక్కడికి వెడుతోందో సామాజిక శాస్త్రవేత్తలకు అంతుబట్టడం లేదు. దేశంలో డేరా బాబా వంటి వారు ఆవిర్భవించడానికి సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలు కూడా తోడవుతున్నాయి. వీటిని ఛేదించడం ఒక్క రోజులో పూర్తయ్యే వ్యవహారం కాదు. ఇందుకు కొన్ని వందల సంవత్సరాలు పట్టినా పట్టవచ్చు. అంతవరకూ ఇటువంటి డేరాలు పుడుతూనే ఉంటారు.

# వీడని బంధం

-రావులపాటి సీతారాంరావు

**ఆ ఊళ్లో మాకు మిగిలిన ఆస్తి ఒక మామిడితోట, ఇల్లు మాత్రమే. వాటిని కూడా అమ్మేయాలనే ఆలోచన వచ్చినా, సొంత ఊరుతో ఉన్న అనుబంధం వదులుకోదల్చుకోలేదు. అందుకే ప్రతి ఏడాది చివర్లో మా ఊరికొచ్చి మామిడితోటమీద వచ్చే ఆ నాలుగు కౌలు డబ్బులు వసూలుచేసుకుని, చిన్నచిన్న రిపేర్లతో ఇంటిని నివాసయోగ్యంగా మలుచుకుని టౌనులోని సొంతగూటికి చేరుకోవటం చాలా సంవత్సరాలనుంచి ఆనవాయితీగా ఆచరిస్తూనే ఉన్నాను.**

ఈసారి ట్రిప్‌లో అనుకున్నంత వేగంగా పనులు జరగలేదు. మామిడితోటను ఎప్పుడూ కౌలుకు తీసుకునే అప్పయ్య మరణించాడు. ప్రతి సంవత్సరం ఇంటికి మరమ్మత్తులు చేసేవాడు అందుబాటులోలేడు. మరికొన్నాళ్ళు ఆ ఊళ్ళో ఒక్కణ్ణే బిక్కుబిక్కుమంటూ ఉండాల్సి వస్తుందేమోనని దిగులుచెందుతున్న తరుణంలో చిన్ననాటి స్నేహితుడు, ఆ ఊరి వాడే అయిన శేఖరం నా ముందు ప్రత్యక్షమై ఆశ్చర్యపరిచాడు. తోడు దొరికినందుకు క్షణకాలం మనసు తెరిపినబడింది. శేఖరం మొదటి నుంచీ నాకు దగ్గరైన మిత్రుడు. ఈ మధ్య టౌనులో కలవటంలేదు కానీ, చాలా సంవత్సరాలు అరమరికలు లేకుండా ఒకరి కష్టసుఖాలు మరొకరం పంచుకున్న వాళ్ళమే! దాదాపు పదిసంవత్సరాల క్రిందట కొడుకు రాజాను ఫారిన్ పంపేందుకు నానాకష్టాలు పడ్డాడు. అంతెందుకు నా దగ్గర కూడా సర్దుబాటుగా కొంత డబ్బు తీసుకుని కొడుకు పైచదువుల కోసం యాతనపడ్డవాడే!

శేఖరం రాకతో నాలో ఒక్కసారిగా ఉత్సాహం పెల్లుబికింది. చిక్కటి కాఫీ చేతికందిస్తూ "ఏరా! ఎన్నాళ్ళు ప్రోగ్రాం వేసుకున్నావ్?" అని అడిగాను.

కాఫీ చప్పరిస్తూ, 'నేనిక్కడ ఎన్నాళ్ళు ఉండటమనేది నీ మీదే ఆధారపడి ఉంది!' అన్నాడు.



నాకు అర్థం కాలేదు. "నేను ఈసారి ఈ కౌలు గొడవలో పదిరోజులు ఉండాల్సి వస్తుందేమో" అన్నాను. నేనున్నాళ్ళు వాడు తోడుగా ఇక్కడుంటే పండుగే! హాయిగా మా ఇంటికి కాపలాగా ఉంటున్న పనిమనిషి లక్ష్మి వంటచేసి పెడ్తుంటే ఊరంతా చిన్నప్పటి మాదిరి కలియదిరగొచ్చు! సాయం సమయాల్లో పొలాల గట్టుమీద నడుస్తూ పాతజ్ఞాపకాలు నెమరేసుకోవచ్చు.

'కౌలుచేసే అప్పయ్య పోయాడని విన్నాను. నీ తోట నాకు కౌలుకు ఇవ్వరా! ఈ ఇంట్లో నేనూ, నా భార్యా హాయిగా ఉంటాం! ఎప్పుడైనా మీరొస్తే సుఖంగా ఉండొచ్చు! కౌలు డబ్బులు, నీ ఇంటద్దె క్రమం తప్పకుండా కట్టేపూచీ కూడా ఇస్తున్నాను' అన్నాడు. ఆ మాటల్లో విచారపు పొర తొంగి చూసింది.

శేఖరం ఇబ్బంది నాకు వెంటనే అర్థం కాలేదు. ఇద్దరే పిల్లలు వాడికి. రాజా పేరుకుతగ్గట్టు రాజాలా ఫారిన్‌లో సెటిలయ్యాడు. కూతురికి ఎప్పుడో పెళ్ళి చేశాడు. టౌనులోనే నిక్షేపంగా కాపురం. ఆ పిల్ల తల్లిదండ్రులకు చేదోడు వాడోడుగా ఉంటున్న సంగతి నాకు తెలుసు. మరి ఇంక శేఖరానికి ఏం కష్టం వచ్చిపడింది. ఈ ఊళ్ళో, ఈ వయసులో ఉండాల్సిన అవసరం శేఖరానికి ఎందుకు వచ్చింది?

'నేనూ కమలా కలిసే వచ్చాం. నువ్విక్కడ ఉన్నావని తెలియగానే నీ దగ్గర వాలిపోయాను' అన్నాడు. కమల శేఖరం భార్య. చాలా కలుపుగోలు మనిషి. "ఆమెను ఎక్కడ ఉంచి వచ్చావ్?" ఆదుర్దాగా అడిగాను.

'పక్కనే... తెలిసిన వాళ్ళేగా! అక్కడ ఉంచి ఇటు వచ్చాను' శేఖరం నానుస్తూ చెప్పాడు. సంగతి అర్థమైంది. ఇక్కడికి తీసుకురావటానికి మొహమాటపడ్డట్లుంది.

"వెళ్ళు, వెళ్ళు! పాపం అక్కడ వదిలివచ్చావా? వెంటనే ఇక్కడికి తీసుకురా. భోజనంచేస్తూ అసలు సంగతేమిటో మాట్లాడుకుందాం" అన్నాను.

శేఖరం మొహం విప్పారింది. వెంటనే కమలను తీసుకురావటానికి బయలుదేరాడు.

***

భోజనాలుచేసి ఓ కునుకు తీసిన తర్వాత సాయంకాలంవేళ బయట కూర్చున్నప్పుడు శేఖరం అసలు సంగతి ప్రస్తావించసాగాడు. కమల వదనంలో కలవరం దోబూచులాడింది శేఖరం అసలు సంగతి మొదలుపెట్టగానే!

'ఏం లేదురా! ప్రశాంతంగా జీవనం సాగిస్తున్న మాకు రాజా మూడునెలలు ఏదో ప్రాజెక్టు పని మీద ఇండియాకు ఫ్యామిలీతో సహా వస్తున్నానని ఫోన్‌చేసేసరికి కలవరం మొదలైంది. ఈ ట్రంప్ గొడవతో మూడునెలలు మనదేశంలో ఉన్న తర్వాత తిరిగి వెనక్కువెళ్ళటం సాధ్యమా కాదా అనే అనుమానంతో ఇద్దరం మథనపడుతున్నాం. అయినా వాడు వెళ్ళి చాలా సంవత్సరాలైందన్న సంగతి నీకు తెల్సుగా! 'మీడియా హడావిడేగానీ, ఇక్కడ ఏం లేదు నాన్నా! మీరు అనవసరంగా కంగారుపడుతున్నారు' అంటూ ఫోన్‌లో ఎన్నోసార్లు వాడు మాకు ధైర్యం చెప్పాడు. మాకేమో కాళ్ళూచేతులూ ఆడటం లేదు. వాళ్ళు ఇక్కడికి రావటం, ఉండటం మాకు ఇష్టమే! కొన్నాళ్ళపాటైతే ఫర్వాలేదుగానీ, అక్కడ ఉండలేని పరిస్థితుల్లో ఇక్కడకు వస్తే, అన్ని సౌకర్యాలు చవిచూసిన వాళ్ళు, ఇక్కడ ఇమడగల్గుతారా అన్నదే మా భయం!' అన్నాడు.

కాయకష్టం చేసి, ఆస్తులమ్మి చదివించి అతణ్ణి ప్రయోజకుణ్ణి చేశాడు తండ్రి. అతను కూడా అదేతోవలో ప్రయాణించాడు. కష్టపడి తన కొడుకును చదివించి విదేశాల్లో స్థిరపడేట్టు చేశాడు. చాలామంది తండ్రులు ఇలాగే చేస్తారు. కానీ ఆకస్మికంగా ఇండియాకు తిరిగి వచ్చేస్తానన్న కొడుకు కోసం మళ్ళీ మరో త్యాగానికి సిద్ధపడ్డాడు ఆ తండ్రి. ఇంతకూ అతడు చేయాలనుకున్న త్యాగం ఏమిటి? ఆ తండ్రి ఆలోచన సరైనదేనా?

శేఖరం మాట్లాడటం ఆపుచేయగానే 'అదికాదు అన్నయ్య గారూ' అంటూ అందుకుంది కమల. 'మేం అక్కడికి వెళ్ళినప్పుడు చూశాంగా! యాంత్రికంగా ఉన్నట్లు అన్పిస్తుందిగానీ ఎన్ని సౌకర్యాలు! హాయిగా వారాంతంలో స్నేహితులందరూ కలుస్తారు. ముచ్చటగా కబుర్లతో భోజనాలతో కాలక్షేపం చేస్తారు. అందరికీ ఉద్యోగాలు! పిల్లలకు చదువులుకూడా బాగానే అబ్బుతున్నాయి. మా మనవడు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే నాకెంత సంతోషం వేస్తుందో! నా కొడుకు ఆ దేశానికి వెళ్ళటం వల్లనే గదా పల్లెటూరిలో పెరిగిన నాలాంటి దానికి మరోదేశం చూసే అవకాశం వచ్చింది! దూరంగా ఉండటం చేతనో ఏమోగానీ, అక్కా బావా అన్నా, వాళ్ళ పిల్లలన్నా తెగ ప్రేమ పడతాడు రాజా! పండుగకూ, పబ్బానికీ, బహుమతులనీ, అవనీ, ఇవనీ, పంపిస్తూనే ఉంటాడు! ఇక్కడ ఉంటే, ఎంత కలిసి ఉందామనుకున్నా చిన్నాచితకా విషయాల్లో చిన్నపాటి తగాదాలు అవునన్నా కాదన్నా రాకమానవు! దూరాన ఉండటంవల్ల ప్రేమలు పెరిగినట్లనిపిస్తుంది నాకు. దూరంగా ఉన్నారనే భావన కలగనీయకుండా ప్రతిరోజూ ఫోన్లూ, వాట్సాప్‌లేనాయె! అంతకంటే కావల్సిందేముంది?' చెప్పాల్సిందంతా గుక్కతిప్పుకోకుండా చెప్పేసింది.

"మీరు పడుతున్న అవస్థ నాకు అర్థమైందిగానీ ఈ పల్లెటూళ్లో ఉందామని ఎందుకనుకుంటున్నారు?" వారిద్దరూ నెమ్మదించి కుదుటపడ్డాక అడిగాను. శేఖరం భారంగా చెప్పాడు.

'రాజా అంటే నాకెంతో ఇష్టంరా! మా కోడలు కూడా బాగా కలిసిపోయింది. మనవడంటే మాకు ప్రాణం. వాళ్ళు కేవలం ప్రాజెక్టు పనిమీదనే వస్తుంటే మాకు సంతోషమే! కానీ ఏ కారణం చేతనైనా వాళ్ళు మళ్ళీ తిరిగివెళ్ళలేకపోతే వాళ్ళకు ఎలాంటి అసౌకర్యం కలగకూడదని మేమిద్దరం అనుకున్నాం. టౌనులో మా ఇల్లు నువ్వు చూశావుగా, సౌకర్యంగానే ఉంటుందిగానీ వాళ్ళతోపాటు మేము కూడా ఉంటే ఎంత సర్దుకున్నా వాళ్ళకు అసౌకర్యంగానే ఉంటుంది. పైగా అక్కడ అంత బ్రహ్మాండంగా ఉండి ఇక్కడ నా కొడుకు ఎందుకు ఇబ్బంది పడాలి? నువ్వే చెప్పు! మూడునెలల తర్వాత ఏ కారణం చేతనైనా పోలేకపోతే ఆ ఇంట్లో హాయిగా ఉండొచ్చు. మంచి ఉద్యోగం చూసుకోవచ్చు. వాడి దగ్గర కొంతడబ్బు ఉండే ఉంటుంది! లేకపోయినా ఫర్వాలేదు. రిటైరైన తర్వాత నాకొచ్చిన డబ్బు ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో ఉంది. అది ఇచ్చేస్తాను. ఇక్కడ సెటిల్ అయ్యేంతవరకూ అది అక్కరకు వస్తుంది' అన్నాడు.

శేఖరం చెప్తున్నంతసేపూ ఆమె కళ్ళు అద్దుకుంటూనే ఉంది. 'ఏం లేదు అన్నయ్యగారూ, ఈ ఊరు టౌనుకు దగ్గర కదా! పిల్లల చదువులకోసం, అవసరాల కోసం పొలాలూ అవీ అమ్మేశాంగానీ ఇప్పుడు ఈ ఊరు చూస్తుంటే పల్లెటూళ్లో కూడా ఎంత హాయిగా ఉంటుందో అర్థం అవుతున్నది. మా వారికి వ్యవసాయం అంటే చిన్నప్పటి నుంచి ఇష్టమన్న సంగతి మీకు తెలుసు కదా! అందుకే ఎవరిదైనా ఇల్లు అద్దెకు తీసుకుని పొలాలు కౌలుకు తీసుకుని హాయిగా ఉండాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాం. రాజా ఫోన్‌తో మా ఆలోచన మరింత దృఢపడింది'. వాళ్ళిద్దరి మాటలు నాలో ఆలోచనతో పాటు నవ్వు రప్పించాయి. పిల్లలపట్ల తల్లిదండ్రుల ప్రేమ అర్థం చేసుకోగలను కానీ, శేఖరం దంపతులు మరీ అంత విపరీతంగా ఆలోచించటమే నాకు నవ్వు రప్పించింది!

నేను నవ్వుతుంటే కమల కొంచెం చిన్నబుచ్చుకుందిగానీ, నేను ఏం చెప్తానా అని శేఖరం ఎదురు చూస్తున్నాడు.

"శేఖరం! మీ ఇద్దరి ఆందోళన అర్థం చేసుకోగలను. తల్లిదండ్రుల ప్రేమను మీరు నాకు నిలువుటద్దంలో చూపించారు. కానీ మీరు ఒక విషయం మరచిపోయారు. శేఖర్! నువ్వు రాజాలాగానే చదువుకున్నావు. కష్టపడి మీ నాన్న సాయంతో ఉద్యోగం సంపాదించుకున్నావు. నీ చదువుకూ, టౌనులో ఉండటానికీ, ఉద్యోగంలో సెటిల్ కావటానికీ మీ నాన్న చాలా ఆస్తి అమ్మటంకూడా నాకు తెలుసు. నువ్వు కూడా నీ పిల్లల బాగోగులకోసం కష్టపడ్డావు. వారిని పైకి తెచ్చావు. రాజా పైచదువులకూ, ఫారిన్ వెళ్ళటానికీ మిగతా ఆస్తి అమ్మేసావు! నువ్వూ మీ నాన్నలాగానే చేశావ్! ఆ మాటకొస్తే నేనూ అంతే చేశాను! పిల్లల్ని పైకి తేవటం సహజమైన బాధ్యత! వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడేస్థితికి వచ్చినతర్వాత వాళ్ళ తరపున మనం ఆలోచించి, ఏమవుతుందో అని అనవసరంగా దిగులుపడాల్సిన అవసరంలేదు. పల్లెటూరి జీవితంకోసం, ఈ వయసులో సొంత ఊళ్ళో ఉండాలనుకోవడం నిజంగా చాలా మంచిఆలోచన! అది వేరే విషయం. టౌనులో ఉంటున్నా, నేను ఈ ఇంటినీ, మామిడి తోటనూ అంటిపెట్టుకుని ఉండటానికి కారణం అనుబంధం! తల్లిదండ్రుల అనుబంధం లాంటిదే సొంతూరుతో ఉండే అనుబంధం! మీవాడు నిజంగానే ఏదైనా ఇబ్బంది వచ్చి ఇండియాకు తిరిగివచ్చి సెటిల్ కావటం ఎలాంటిది అంటే, నువ్వు కారణం ఏదైనా టౌను నుంచి స్వంత గ్రామంలో ఉండాలనుకోవటం లాంటిదే! పిల్లలు పెద్దవాళ్ళైన తర్వాత ఎవరి జీవితాలు వారు చూసుకోగలరు!

ఎప్పుడూ తల్లిదండ్రులమీదే ఆధారపడాలని పిల్లలు కోరుకుంటారని నేను అనుకోను. ఒకవేళ రాజా ఇండియాలోనే ఉండాల్సివచ్చినా వాడి సౌకర్యం కోసం నువ్వు ఖాళీచేసిన ఆ ఇంట్లో సంతోషంగా ఉంటాడని నేను అనుకోను. వాడిపట్ల నువ్వు చూపిన ప్రేమను అర్థం చేసుకోగలడుగానీ వాడి కోసం నువ్వు అంత ఔదార్యం చూపించటం భరించలేడు. పల్లెటూరు ఎంత బాగుందని చెప్పినా తమ కోసమే మీరు అలా ఉండాల్సివచ్చిందని వాళ్ళు ఖచ్చితంగా అనుకుంటారు. అయితే నువ్వు, ఆలోచించాల్సింది ఏమిటంటే నువ్వు నీ జీవితంకోసం ఏ విధంగా పల్లెటూరువదిలి టౌనుకు వెళ్ళావో అలాగే రాజా వాడి జీవితంకోసం ఇండియా వదిలి అమెరికా వెళ్ళాడు. రాజాకు వచ్చిన ఇబ్బందికోసం నువ్వు టౌను వదిలి ఎలా నువ్వు నీ గ్రామానికి వద్దామనుకుంటున్నావో అలాగే వాడు అమెరికావదిలి స్వంత దేశానికి వద్దామనుకుంటాడు. ఇదిచాలా సహజమైన విషయం. నువ్వు, కమల తెగ కష్టపడి ప్రణాళికలు రచించాల్సిన అవసరంలేదని నా ఉద్దేశం" అన్నాను.

నా మాటలు శేఖర్‌లో స్పష్టత తెచ్చినట్లున్నాయి, తలూపసాగాడు. కమల కూడా నావైపు తదేకంగా చూస్తూ విప్పారిన మొహంతో నేను చెప్పినదంతా విన్నది. ఆ సమయంలోనే చల్లటిగాలి కొబ్బరిచెట్లమీదుగా వచ్చి మా ముగ్గురికీ ఆహ్లాదం కలిగించింది.

'అన్నయ్యగారూ! రాజావిషయం ఎలా ఉన్నా కొన్నాళ్ళపాటు ఇక్కడే హాయిగా ఉండాలనిపిస్తోంది' అంది కమల. 'అదే వీడనిబంధం' అన్నాడు శేఖరం. అప్పుడే శేఖరం సెల్‌ఫోన్ మ్రోగింది. ఫోన్లో మాటలు వింటూ 'అలాగా! సరే మంచిది' అని స్విచాఫ్ చేశాడు.

మావైపు చూస్తూ, 'రాజా! వాళ్ళ ఇండియాట్రిప్ ఇప్పట్లో లేదట! కొన్నాళ్ళు పోస్ట్‌పోన్ అయిందని చెప్పాడు' అన్నాడు శేఖరం.

"రాజా ప్రయాణం ఎలా ఉన్నా, మీరు నిరభ్యంతరంగా నా కౌలుడబ్బు ఇస్తూ, ఇంటి కిరాయి చెల్లిస్తూ ఉండొచ్చు" అన్నాను నవ్వుతూ.

తేలికపడిన వాతావరణంలో ఇద్దరూ నాతో నవ్వు కలిపారు.

సెల్: 800 800 2909





నవ్వడం ఒక భోగం.. నవ్వించడం ఒక యోగం... నవ్వలేకపోవడం ఓ రోగం అన్నారు పెద్దలు. ఒక చిన్న చిరునవ్వు మనసును వికసింపచేస్తుంది. అసలు మనసారా నవ్వటం అనేది సృష్టిలో మనిషికి లభించిన ఓ గొప్ప వరం. మనిషి తనకు తాను సృష్టించుకున్న ఓ అద్భుత సౌందర్య సాధనం నవ్వు. నవ్వు శారీరక, మానసికారోగ్యంపై ప్రభావం చూపుతుందని అనేక పరిశోధనల్లో కూడా నిరూపితమైంది. చిరునవ్వు, దరహాసం, మందహాసం ఏదైనా సరే నవ్వడమే ముఖ్యం. ఒకరు బాధపడటానికి లక్ష కారణాలు ఉండవచ్చు. అయితే నవ్వు, సంతోషం అనే వజ్రాయుధంతో వాటన్నిటిపై విజయం సాధించవచ్చు. ఎప్పుడూ నవ్వుతూ ఉండడం వల్ల నీ చుట్టూ ఉన్న ఆందోళనకర వాతావరణాన్ని తేలికపరచవచ్చు. నవ్వేవారితో కలిసి పనిచేసేందుకు ప్రపంచమంతా సిద్ధంగా ఉంటుంది. అందుకే నాయకుడిగా ఎదగాలనుకునేవారు తమకు ఇష్టమున్నా లేకున్నా నవ్వుల వర్షం కురిపిస్తుంటారు. గొప్ప వక్త లందరూ వారి హాస్య చతురతతో శ్రోతలను ఆకట్టుకున్న వారే కదా!

# నవ్వు! నవ్వించు! నవ్వులు పండించు!

### నవ్వంటే...

నవ్వు లేదా మందహాసం ఒక విధమైన ముఖకవళిక. నవ్వినప్పుడు ముఖంలోని కండరాలు, ముఖ్యంగా నోటికి ఇరువైపులా ఉండేవి వ్యాకోచిస్తాయి. మానవుల్లో నవ్వు ఆనందానికి, సంతోషానికి, ఆహ్లాదానికి సంకేతం. కొందరు నిశ్శబ్దంగా తమలో తామే నవ్వుకుంటే, ఇంకొందరు బయటకు శబ్దం వచ్చేలా నవ్వితే, మరికొందరు పడీ పడీ నవ్వుతారు. నవ్వడాన్ని మెదడు నియంత్రిస్తుంది. సంఘంలోని వ్యక్తుల మధ్య సంబంధాలు, సంభాషణలలో ఒకరకమైన ఉత్తేజాన్ని కలిగిస్తుంది. నవ్వు ఇతరుల నుంచి కలయికను కాంక్షిస్తుంది. అంతేకాదు నవ్వుతో మీ హావభావాలు కూడా తెలిసిపోతాయట. మనిషి ముఖంలోని 44 కండరాలతో ఐదువేల రకాల హావభావాలను ప్రదర్శించవచ్చునట.

బోసి నవ్వు, వెకిలి నవ్వు, వెగటు నవ్వు, వెలవెలబోయే నవ్వు, ఆనందపు నవ్వు...ఇలా ఎన్నో రకాల నవ్వులు మనిషి మనసులోని భావాలను ఇట్టే పట్టిస్తాయి. "స్మైల్ ఈజ్ ద ఇండెక్స్ ఆఫ్ యువర్ హార్ట్ అండ్ ఫీలింగ్స్" అని ఊరికే అనలేదు కదా!

### ఎందుకు నవ్వలేకపోతున్నాం

నవరసాల్లో హాస్యం ఒకటి. అయితే ఆధునిక జీవనశైలి కారణంగా, మనిషి డబ్బుతో మాత్రమే సంతోషాలను పొందవచ్చునుకోవడం వల్ల మనసారా నవ్వలేకపోతున్నాడు. జీవితంలో ఎదురయ్యే ఒత్తిడులు, ఆర్థిక పరిస్థితులు, పెరుగుతున్న అభద్రతాభావం, ఆందోళనలు, ఆరోగ్య సమస్యలు, వైవాహిక జీవిత సమస్యలు, కుటుంబ కలహాలు, నిరాశా నిస్పృహలు మనిషిని నవ్వు నుంచి దూరం చేస్తున్నాయి.

గడిచిన దశాబ్దాలతో పోల్చుకుంటే మనిషి అవసరాలు పెరిగాయి(పెంచుకున్నాడు). దీంతో అవసరాలు, కోరికలు తీర్చుకునేందుకు మనిషి విపరీతంగా కష్టపడుతున్నాడు. డబ్బు సంపాదన కోసం పరుగుపందెంలో అలసిపోతున్నాడు. కొందరు జీవితాల్లో పూర్తిగా నవ్వును కోల్పోయారు. మోడువారిన వారి జీవితాలను కొత్తగా చిగురింపచేసే శక్తి చిరునవ్వుకే ఉందని గ్రహించాలి. కాసేపు నింపాదిగా గడిపితేనే కదా ఇతరులతో మాటా ముచ్చటా కలిసేది? సంభాషణ కొనసాగేది? అప్పుడే హాస్యం పుడుతుంది. సన్నిహితులతో మాట్లాడే సంభాషణలో చతురోక్తులు, ఛలోక్తులు పేలుతుంటాయి. అవి మన మోముపై సన్నని నవ్వులు పూయిస్తాయి. నిరంతరం ఒత్తిడితో కాపురం చేసేవారిలో హాస్య ప్రియత్వం హరించుకుపోతుంది. దీంతో నవ్వడాన్ని నేర్చుకోవాల్సిన దౌర్భాగ్య స్థితి. ఏదయితేనేం అవసరం కొత్త దారులను అన్వేషిస్తుంది. ఆ దారుల ఫలితమే 'లాఫింగ్‌క్లబ్బులు'.



### లాఫింగ్ యోగా

లాఫర్ యోగాపై నానాటికీ క్రేజ్ పెరిగిపోతోంది. వీటిల్లో వినోదంతో పాటు ఆరోగ్యాన్ని కాపాడుకోవడంపై శిక్షణ ఇస్తారు. నడుమును ఇష్టానుసారంగా తిప్పే పొట్ట ఎక్సర్‌సైజ్, మోకాలి వ్యాయామాలు, నాలుకను ముందుకు చాచి సింహంలాగా దూకుతూ 'ఆఆఆఆఆఆ' అని అరుస్తూ చేసే సింహగర్జన వీటిల్లో ప్రత్యేకం. కుడిచెయ్యి బొటనవేలును అటూ ఇటూ తిప్పుతూ కళ్ళు కరెక్ట్‌గా దాన్ని ఫాలో అవడం వల్ల రక్తప్రసరణ పెరుగుతుందని యోగా నిపుణులు పేర్కొంటున్నారు. చివర్లో ఓంకారం చేసి కళ్ళు మూసుకొని బిగ్గరగా నవ్వుతూ 'ఊఊఊఊఊఊ' అని అరవడం వల్ల మెదడు చురుకుగా తయా




## నవ్వుకీ ఓరోజు ఉందండోయ్

సమస్యలకు, బాధలకు, కష్టాలకు అంకుశం వంటి నవ్వుని కూడా సెలబ్రేట్ చేసుకుంటున్నారు. ప్రత్యేకంగా దానికోసమే ఓరోజు కేటాయించుకుని, నవ్వుల దినోత్సవంగా జరుపుకుంటున్నారు. ఆరోజున ఏంచేస్తారు అనుకుంటున్నారా? ఏం లేదు... ఆరోజంతా ఎటువంటి ఆలోచనల జోలికి పోకుండా హాయిగా నవ్వుతూ ఆనందంగా, సరదాగా గడపడమే! అసలు నవ్వుల దినోత్సవాన్ని ప్రపంచానికి అందించిన ఘనత భారతీయులదే. తొలిసారిగా నవ్వుల దినోత్సవాన్ని ముంబయిలో నిర్వహించారు. ఆ తర్వాత ఇది ప్రపంచమంతా పాకింది. వరల్డ్ ఆర్గనైజేషన్ 1998 జనవరి 10వ తేదిని నవ్వుల దినోత్సవంగా ప్రకటించింది. ఎందుకంటే ఆ రోజున వివిధ దేశాలకు చెందిన 12వేల మందికి పైగా ముంబయిలోని రేస్ కోర్సు గ్రౌండ్‌కు చేరుకుని వివిధ కార్యక్రమాలతో నవ్వులు పూయించారు. ఈ సమావేశంలో వైద్యనిపుణులు, పరిశోధకులు ఆరోగ్యంపై నవ్వుల ప్రాధాన్యతను వివరించారు.

రవుతుందని వారు తెలిపారు.

### జబ్బులకు చెక్

ఒత్తిడి కారణంగా అధిక రక్తపోటు, గుండె జబ్బులు, డిప్రెషన్, నిద్రలేమి, మైగ్రేన్, ఆత్రుత వంటి అధిక శాతం జబ్బులు వస్తాయి. అయితే నవ్వు అనే మందుతో ఈ జబ్బులను నయం చేసుకోవచ్చు. తరచూ నవ్వేవారికి గుండెజబ్బులు రావని పలు అధ్యయనాల్లో నిరూపితమైంది. నవ్వడం వల్ల ఒత్తిడికి కారణమయ్యే హార్మోన్ల ఉత్పత్తి తగ్గి ఉపశమనం కలుగుతుంది. 10 నిమిషాలు నవ్వితే 10–20 నిమిషాల రక్తపోటు తగ్గుతుంది. రోజువారీ నవ్వులు రోగనిరోధకశక్తిని పెంచుతాయట. వీటికి అవసరమయ్యే లింఫోసైట్స్ ఉత్పత్తిని పెంచుతాయి. ముక్కు, శ్వాసకోశ వ్యవస్థకు సంబంధించిన పొరల్లో మెరుగుదల ఉంటుంది. అలాగే శరీరంలో సహజ రోగనిరోధకాలైన హార్మోన్ల ఉత్పత్తి పెరిగి ఆర్థరైటిస్, స్పాండిలైటిస్ వంటి వ్యాధుల నుంచి ఉపశమనం కలుగుతుంది. దీంతో రక్తంలో ఆక్సిజన్ పరిమాణం పెరుగుతుంది. ఆస్తమా రోగులకు మేలు కలుగుతుంది.

### నవ్వితే నవరత్నాలు

నవ్వేవారు ఇతరుల కంటే చలాకీగా ఉంటారు. మనసారా నవ్వితే చాలు విపరీత మానసిక ఉద్రేకాలు, వికారాలు దూరమవుతాయి. హాయిగా నవ్వడం ద్వారా రక్తపోటు, గుండెజబ్బులు, నరాల బలహీనత వంటి శారీరక రుగ్మతల నుంచి దూరంగా ఉండవచ్చు. నవ్వు శరీరంలో కిటికోల్ అయాన్ హార్మోన్లను విడుదల చేస్తుంది. ఇది బాధను మరిపిస్తుందట. మనసారా నవ్వడం సహజసిద్ధమైన పెయిన్‌కిల్లర్‌గా పనిచేస్తుంది. ఒత్తిడి స్థాయిని తగ్గిస్తుంది. అందుకే అమెరికా, బ్రిటన్ వంటి దేశాల్లో ఆస్పత్రులకు అనుబంధంగా నవ్వుల ఆస్పత్రులు ఏర్పడ్డాయి. వీటిలో హాస్య చిత్రాలు, వీడియోలు చూపిస్తారు. హాస్యచిత్రాలు, నాటకాలు, హాస్య రచనలు, కార్టూన్లు వగైరాల వల్ల గుండె బరువెక్కే ప్రమాదం ఉండదు.

### మనస్ఫూర్తిగా నవ్వండి

మనిషి సంఘజీవి. ఒంటరిగా బతకలేడు. ఎప్పుడూ నవ్వుతూ ఉండేవారికి అందరూ స్నేహితులుగా ఉంటారు. ఒంటరితనం దరిచేరదు. అందుకే ఎప్పుడూ నవ్వేవారి చుట్టూ అందరూ పోగవుతారు. నవ్వనివారిని మాత్రం నవ్వితే ఏమన్నా నవరత్నాలు రాలతాయా? అని ఎద్దేవా చేస్తుంటారు. అంతేకాదు వ్యక్తుల మధ్య నమ్మకాన్ని పెంపొందించడానికి నవ్వు చక్కటి సాధనం. నవ్వుతో సంఘంలో సత్సంబంధాలు ఏర్పడతాయి. ఆనందం వెల్లివిరుస్తుంది. బతుకులో ఆశలు చిగురిస్తాయి. నిజాయితీ లేని నవ్వుని ఇతరులు ఇట్టే గుర్తుపట్టేస్తారు. అందుకే నవ్వు నాలుగు విధాల చేటు వంటి వాటిని వదిలేయాలి. నవ్వేవారితో జట్టుకట్టాలి. నవ్వితే మీ మొహం చంద్రబింబంలా వెలిగిపోతుంది. కావాలంటే ప్రయత్నించి చూడండి. కాబట్టి హాయిగా మనస్ఫూర్తిగా నవ్వండి.

పుట్టేటప్పుడూ ఎలాగూ ఏడుస్తూనే పుడతాం. పోయేటప్పుడు ఏడిపిస్తూ పోతాం. మధ్యలోనయినా కొంచెం నవ్వుతూ బతుకుదాం. మనిషి బతకాలంటే ఆశ, విశ్వాసం అవసరం. ఈ రెండింటినీ అందించే శక్తి హాస్యానికే ఉంది. ముఖంలో చెరగని నవ్వులు తొణికిసలాడే వారే అత్యంత ఆకర్షణీయమైనవారు. కాబట్టి కీప్ స్మైలింగ్. లాఫ్ అండ్ లాఫ్ అండ్ లాఫ్ అంటిల్ యూ కాఫ్!

—లక్ష్మీనర్మద

### మీకు తెలుసా?



చింపాంజీలు, గొరిల్లాలకు చక్కిలిగిలి పెడితే అవి ఎంచక్కా నవ్వుతాయి. అయితే వాటి శబ్దాలు వాటివి. అవే మానవ శబ్దాలకు మూలాలు.

ఆడవాళ్ళు మగవారికంటే ఎక్కువ నవ్వుతారట.

మనసు దోచుకున్న మగువను నవ్వించడానికి మగవాళ్ళు నానా తంటాలు పడితే తమకు నచ్చిన వాడి సన్నిధిలో అతివలు అధికంగా నవ్వులు కురిపిస్తారట.

తమ మీద తామే జోకులు వేసుకుని నవ్వుకునే వారికి అత్యధిక స్థాయిలో ఆత్మవిశ్వాసం ఉంటుంది.

ఇతరులు పేల్చే జోకులకు మనస్ఫూర్తిగా నవ్వలేనివారు ఆత్మన్యూనత భావాలతో బాధపడతారట.

ఇతరులతో పోలిస్తే సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఎక్కువగా ఉన్న ఉద్యోగులు అత్యధిక సామర్థ్యంతో పనిచేస్తారని వివిధ అధ్యయనాలు తెలిపాయి.

నవ్వు అంటువ్యాధిలా ఒకరినుంచి మరొకరికి అంటుకుంటుంది. అయితే ఈ వ్యాధి మంచిదే.

భారతదేశంలో హాస్యానికి ప్రాముఖ్యం ఉంది. పూర్వకాలంలో రాజుల ఆస్థానంలో విదూషకులు ఉండేవారు. అలాగే బీర్బల్, తెనాలి రామకృష్ణ వంటి వారి కథలు ఇప్పటికీ మనల్ని గిలిగింతలు పెడుతుంటాయి.

మానవుల్లో నవ్వు, హాస్యానికి సంబంధించిన మానసిక, శరీరధర్మశాస్త్ర ప్రభావాలను గురించి తెలిపే శాస్త్ర విజ్ఞానాన్ని జెలోటాలజీ అంటారు.

నవ్వనివారితో పోల్చుకుంటే నవ్వేవారు ఏడేళ్ళు ఎక్కువగా బతుకుతారట.



14

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**'రాగిణి చనిపోయింది',**

**అన్న మాటలు వినగానే, జవసత్వాలుడిగిపోయిన వాడిలా, నేను కానిస్టేబుల్ చేతుల్లో నుండి జారి, కింద కూలబడిపోయాను. ఇంత ఘోరం జరుగుతుందని నేనూహించలేదు. రాగిణిని కిడ్నాప్ చేసి, తనను అడ్డం పెట్టుకుని నన్ను బెదిరిస్తారేమోనని, బాలగోపాల్ లోన్ ఫైలు క్లియర్ చేయమని ఒత్తిడి తెస్తారేమోనని, ఒకవేళ అట్లాంటి సందేశం ఏదైనా వస్తే రాగిణిని ఏం చేసైనా సరే కాపాడుకోవాలని మనసులో అనుకుంటున్నాను. కానీ, ఇది ఇలా రాగిణి ప్రాణాలు పోయేంత క్రూరంగా పరిణమిస్తుందని కలలో కూడా ఊహించలేదు.**

అయిపోయింది... నా స్వప్న సౌధం కూలిపోయింది. మేమిద్దరమూ కలిసి బంగారు భవిష్యత్తు గురించి కన్న కలలన్నీ కాలిపోయాయి.

ఒక వ్యక్తి గుండె మార్పిడి ప్రక్రియలో, ఆ మనిషి నుండి గుండెను తీసేసి, మరో గుండెను అమర్చే లోగా శరీరంలోని సిరలు, ధమనులను ఒక కృత్రిమ పరికరానికి అనుసంధానం చేస్తారు. ఆ కృత్రిమ గుండె సహాయంతో మనిషి శరీరం జీవక్రియలను నిర్వహిస్తుంది.

మెషీన్లతో పనిచేసే ఆ శరీరానికి ఏ స్పందనా ఉండదు. హృదయమే లేని శరీరానికి స్పందనలు ఉండవు గదా! అప్పటి ఆ శరీరంలా, నేను ఆ క్షణం, జీవచ్ఛవమై పోయాను. మ్రాన్పడిపోయాను.

వేయి ఓల్టుల విద్యుత్ తగిలినప్పుడు మనిషి లోని కేంద్ర నాడీవ్యవస్థ కాలి మసిబొగ్గయి పోతుంది. అలా నాలోని చైతన్యం చచ్చిపోయింది.

### జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పని చేసే ఆ అధికారి, మాకనూరు బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. పార్టీలో, రామస్వామిని చూసి, గతస్మృతులలోకి జారుకుంటాడు. కష్ట పడి బ్యాంకులో ఉద్యోగం సంపాదిస్తాడతను. స్టెనో ఆఫీసర్ రాగిణితో సాన్నిహిత్యం పెరిగి, ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకుంటారు. ఎంపీ బాలగోపాల్ విద్యుత్ ప్రాజెక్ట్ లోన్ విషయంలో అతన్ని కలిసి హెచ్చరిస్తాడు. ఇంతలో రాగిణి చనిపోవడంతో, పోలీసులు అతన్ని అరెస్ట్ చేస్తారు.

ఆ తర్వాత...

'నాకెందుకు బేడీలేశారో, నన్నెందుకు కొట్టారో, నాకేం జరుగుతోందో నాకు తెలియడం లేదు. నన్నక్కడి నుంచి పోలీస్ జీపులో ఎక్కడికి తీసుకెళ్తున్నారో కూడా నాకు అర్థం కావడం లేదు.'

నేనొక సుషుప్తావస్థలో ఉండిపోయాను.

'రాగిణి చనిపోయింది. కానీ, తను ఇప్పుడు ఎక్కడుందో? రాగిణి శవం ఎక్కడుందో అని అనుకోవడానికి నా మనసు ఒప్పుకోవడం లేదు. రాగిణి, రాగిణిని... చూడాలి.'

నాకు తెలియకుండానే నా కళ్ళు వర్షిస్తున్నాయి. చెంపల మీదుగా, ధారగా కన్నీళ్ళు కారుతున్నాయి. తుడుచుకోవాలన్న స్పృహే లేదు నాకు.

పోలీస్ జీప్ ఎటో ఎటో తిరుగుతోంది. ఒక అపార్ట్‌మెంట్ సెల్లార్‌లో ఆగగానే నన్ను దిగమని గద్దించారు. వాళ్ళను అనుసరించి మూడో ఫ్లోర్‌కు వెళ్ళాను. ఆ పరిసరాలు ఎక్కడో చూసినట్టుగానే అనిపిస్తున్నాయి కానీ మెదడులో వాటికి సంబంధించిన లింక్ కనెక్ట్ కావడం లేదు.

అక్కడ అందరూ గుమికూడి ఉన్నారు. వాళ్ళు నన్ను వింతగా చూస్తున్నారు. అక్కడ ఉన్న కానిస్టేబుల్ తాళం తీయగానే, నన్ను ఆ ఫ్లాట్ లోపలికి తోసి తలుపులు మూశారు.

గోడల నిండా నావీ, రాగిణివీ నిలువెత్తు ఫోటోలు ఉన్నాయి. హాలులోకి ప్రవేశించగానే, ఎదురుగా నేనూ రాగిణీ పెళ్ళికి ముందు, వాళ్ళింట్లో, వారం రోజుల క్రితం ఏర్పాటు చేసిన ఒక ఫంక్షన్‌లో తీసుకున్న ఎనిమిది అడుగుల ఎత్తున్న ఫోటో ఉంది. ఆ ఫోటో మీదనే పడే విధంగా ఏర్పాటు చేసిన స్పాట్‌లైట్ వెలుగుల్లో, మేమిద్దరం పగలబడి నవ్వుతున్నాం. ప్రపంచాన్ని జయించిన ప్రేమికుల మాదిరిగా ఉన్నాయి మా హావభావాలు, ఆ ఫోటోలో.

అప్పుడు తట్టింది నాకు.

అది రాగిణి కొన్న మా ఫ్లాట్.

మా "ప్రేమ సౌధం."

పెళ్ళి అయ్యాకే నేను ఆ ఇంట్లోకి అడుగు పెట్టాలని రాగిణి విధించిన షరతునుల్లంఘించి, పోలీ సులు బలవంతంగా నన్ను ఆ ఇంటికి తీసుకొచ్చారు.

'ఇప్పుడు నన్ను ఇక్కడికెందుకు తెచ్చారని' అంత దుఃఖంలోనూ మనసులో ఒక శంక బయలు దేరింది. అలా అనుకుంటుండగానే నన్ను ఒక బెడ్ రూములోకి తోశారు.

మేమిద్దరమూ, రాగిణీ నేనూ, కలిసి సెలెక్ట్ చేసిన డిజైనర్ బెడ్ రూమంతా పరుచుకుని ఉంది.

దానిమీద ఉన్న ఫ్యానుకు 'రాగిణి' వేలాడుతోంది.

భూమి అట్టడుగు పొరల్లో ఒక అణుబాంబును ప్రయోగాత్మకంగా పేల్చినప్పుడు దాని ప్రభావానికి భూమి పొరలను చీల్చుకుని కొన్ని కిలోమీటర్ల ఎత్తు వరకూ దుమ్మూ, ధూళీ ఎగిసిపడుతుంది. ఆ ధూళిలో దృశ్యం కనుమరుగవుతుంది.

అలా నా హృదయంలోని చిట్టచివరనున్న కణజాలపు సమూహాలు విచ్ఛిన్నమై వాటి నుండి దుఃఖం పొర్లుకొచ్చింది. నాకా క్షణమే, నా గుండెలు పగిలిపోయి చచ్చిపోతే బాగుండుననిపించింది.

"రాగిణీ... రాగిణీ... రాగిణీ...." అంటూ 'రాగిణి' కాళ్ళు పట్టుకున్నాను.

నిన్న మధ్యాహ్నం తనను వాళ్ళ అపార్ట్‌మెంట్ ముందు దించిన తర్వాత, మళ్ళీ 'రాగిణి'ని ఇప్పుడే చూడడం.

అప్పుడు సజీవ చైతన్యస్రవంతిలా ఉన్న నా రాగిణి ఇప్పుడు నిర్జీవంగా, ఫ్యానుకు వేలాడుతూ కనిపించింది. తను చనిపోయినా నాకు అలా అనిపించడం లేదు. నిన్ననే తలం



టుకున్న రాగిణి జుట్టు సన్నగా కదులుతోంది.

'అంటే ప్రాణం ఉన్నట్టేనా...?'

ఆలోచనలతో, అంతు చిక్కని ప్రశ్నలతో నా బుర్ర వేడెక్కిపోయింది.

ముందు రోజు మధ్యాహ్నం నుంచి, రాగిణితో కలిసి 'హేవ్‌మోర్'లో తిన్న ఐస్‌క్రీం తప్ప, అన్నం కాదు కదా ఒక్క మంచినీటి బొట్టు కూడా లోపలికి పోకపోవడం, రాత్రంతా నిద్ర లేకపోవడం దానికి తోడు రాగిణిని ఆ స్థితిలో చూడడంతో నా శరీరమూ, మనసూ రెండూ నా వశం తప్పాయి. నేను స్పృహ తప్పాను.

***

నాకు మళ్ళీ స్పృహ వచ్చేసరికి హాస్పిటల్‌లో ఉన్నాను.

అప్పుడప్పుడే చీకట్లు ముసురుకుంటున్నాయి. 'వెలుతురు'ను మింగేందుకు ఆవురావురుమంటూ చీకటి కాలసర్పం జరజరా పాక్కుంటూ వచ్చేస్తోంది. నీడలు పొడుగ్గా దయ్యాల్లా పరుచుకుంటున్నాయి.

అమ్మానాన్నా నా మంచం పక్కనే ఉన్నారు. వాళ్ళిద్దరి ముఖాలు పీక్కుపోయి ఉన్నాయి. వాళ్ళు అగ్నిప్రమాదంలో చిక్కుకుని సర్వస్వం పోగొట్టుకున్న బాధితుల్లా ఉన్నారు.

నేను లేవడం చూసి, నా చెల్లెలు నా ఛాతి మీదకు ఒరిగి,

"అన్నయ్యా! వదిన..." అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

నేను దిగ్గున లేచి కూర్చున్నాను. రాగిణి



అకస్మాత్తుగా మీ ఇద్దరూ కలిసి పెళ్ళి కార్డు ఇచ్చేసరికి, వాళ్ళ వ్యూహం మారిందట. వీలయితే నిన్నూ, లేక పోతే రాగిణినీ వెంటనే వేసేయమని ఆర్డర్స్ వచ్చాయట. నీ వేరబౌట్స్ తెలియకపోవడంతో రాగిణిని కిడ్నాప్ చేశారు. నువ్వు సిటీలోకి ఎంటర్ అయిన ప్పటి నుంచీ నేను నీతో ఉండడంతో నీ మీద అటాక్ జరగలేదు. కదా డీయస్పీ గారూ!"

"అవును సార్! కానీ, ఒక దశలో మీ ఇద్దరినీ వేసేద్దామనుకున్నారట. కానీ, పైనుంచి మిమ్మల్ని టచ్ చేయొద్దని ఆర్డర్స్ వచ్చాయట సార్!" అని ఐపీయస్‌ను చూస్తూ అన్నాడు.

"ఏడ్చారు వెధవలు! నన్ను టచ్ చేసి ఉంటే తెలిసేది. అప్పుడు నేను రాగిణిని కూడా రక్షించి ఉండేవాణ్ణి. ఈ కుట్రను అప్పుడే భగ్నం చేసి ఉండే వాడిని!" అన్నాడు.

నేను అతని వైపు చూశాను.

"కానీ, రాగిణి కనపడలేదని తెలియగానే నాకు ఫోన్ చేస్తే ఈ అనర్థం జరగకుండా ప్రయత్నించే వాణ్ణి. అమూల్యమైన నాలుగైదు గంటల ప్రైం టైం వేస్ట్ అయింది. ఇదంతా కేవలం దురదృష్టం మ్యాన్!" అన్నాడు.

నేను నిర్ఘాంతపోయాను. నా మెదడులో వేలల్లో విస్ఫోటనాలు జరుగుతున్నాయి. కళ్ళు ఎరుపెక్కాయి.

"పిరికి వెధవలు. పువ్వులాంటి ఒక అబల మీదనా వాళ్ళ ప్రతాపం. వాళ్ళ అంతు చూస్తా!" అంటూ అరిచాను.

"కూల్.. కూల్ మ్యాన్! టు బీ ఫ్రాంక్, నువ్వు వాళ్ళనేం చేయలేవు. వాళ్ళు సమాజంలో బలవంతులు. డబ్బు, అధికారం ఉన్న వ్యక్తులు. నువ్వు వాళ్ళను

## లాకర్ నెం.369
### కూపన్ నెం.10 విజేత
**ఎస్. సాయి అర్చిత**
**మహబూబ్‌నగర్**

డీకొనే ముందే ఇవన్నీ ఆలోచించుకుని ఉండాల్సింది. నీ మూర్ఖత్వం వల్ల రాగిణి బలైపోయింది.

రాగిణి పెళ్ళి అని వాళ్ళకు తెలుసు గానీ అది నీతోనే అనే విషయం నిన్న మీరు వెళ్ళి చెప్పినప్పుడే తెలిసింది. దాంతో వాళ్ళు అయోమయంలో పడ్డారు. అలర్ట్ అయ్యారు. మీకు ఎటువంటి దురుద్దేశం లేకున్నా వాళ్ళు అలా ఆలోచించలేదు. రాగిణి జడ్‌ఎం పి.ఎ కాబట్టి ఆమెకు అనేక రహస్యాలు తెలుసు. ఇప్పుడు మీరిద్దరూ పెళ్ళి చేసుకుంటే ఆ రహస్యాలన్నీ బయటపడతాయని కంగారు పడ్డారు. అంతే కాకుండా, నువ్వు సీఏఐఐబీ పరీక్ష రాసినప్పటి రహస్యమేదో రాగిణికి తెలుసని మా పరిశోధనలో తేలింది. అందుకే వెంటనే రామస్వామి రంగంలోకి బాల గోపాల్‌ను దించి ఉంటాడు.

మా ప్రయత్నం మేము చేస్తున్నాం. వాళ్ళిద్దరి ఫోన్ కాల్ రికార్డ్స్ పరిశీలిస్తున్నాం. కానీ, అదంతా సెకండరీ ఎవిడెన్స్, సర్కమస్టాన్షియల్ ఋజువు మాత్రమే. వాళ్ళకు వ్యతిరేకంగా కోర్టులో కేసు నిల బడడం కష్టం. అందుకే అంటున్నా. నువ్వు వాళ్ళను ఏం చేయలేవు" అన్నాడు.

"అంటే రాగిణిని రేప్ చేసి హత్య చేసిన వాళ్ళను క్షమించి వదిలేయాల్సిందేనా? ఇదేనా చట్టం చెప్పింది?" అన్నాను ఆక్రోశంతో.

"న్యాయం, చట్టం ఋజువులు మీదా, సాక్ష్యాల మీదా ఆధారపడి పని చేస్తుంది. ఇప్పుడు మాకు లొంగిపోయిన నిందితులు పోలీస్ కస్టడీలో ఉన్నప్పుడు నేరం చేశామని ఒప్పుకున్నా, రేపు కోర్టులో తాము ఏ నేరమూ చేయలేదని, పోలీసులు తమను హింసించి బలవంతంగా తమతో నేరం ఒప్పించి, స్టేట్‌మెంట్ మీద సంతకాలు తీసుకున్నారని చెబుతారు. వాళ్ళ తరపున లక్షల్లో ఫీజులు తీసుకునే క్రిమినల్ లాయర్లు కేసును చీల్చి చెండాడుతారు.

నువ్వనుకుంటున్నటువంటి న్యాయం లావాటి న్యాయశాస్త్ర పుస్తకాల బరువు కింద నలిగి చిక్కిపోతోంది.

ముడుతలు పడిన ఒక కాగితాన్ని సాపుగా చేయడానికి బరువైన పుస్తకం ఒత్తు పెట్టి, దాని కింద ఆ కాగితాన్ని పెడతాం. కొంచెంసేపు తర్వాత చూస్తే సాపుగా ఉన్నట్టే కనపడుతుంది. పుస్తకం బరువు తీయగానే ముడుతలు యథావిధిగానే ఉంటాయి.

---

ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## లాకర్ నెం. 369-12 (13-9-2017)

మా ప్రశ్న: బీహార్ గ్యాంగ్‌కి ఎక్కడినుంచి సుపారీ వచ్చింది?

మీ జవాబు--------------------------------------------

చిరునామా--------------------------------------------

----------------------------------------------------

------------------------పిన్-------------ఫోన్‌నెం.-----------------

ఈ కూపన్‌ను 12 సెప్టెంబర్ 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33



*నిబంధనలు వర్తిస్తాయి

గురించి అప్పుడే గుర్తొచ్చినట్టుగా, పిచ్చి చూపులు చూస్తూ,

"అవును! రాగిణి... రాగిణికేమయింది?" అన్నాను.

"ఇంకెక్కడి రాగిణిరా నాయనా? చచ్చిపోయింది కదరా?" అంటూ అమ్మ గుండెలు బాదుకుంటూ ఏడ్చింది.

నాకు టెంపరరీ అమ్నీసియా, తాత్కాలిక మతి మరుపు, వచ్చినట్టుగా రాగిణి గురించి మరచిపోయాను. అమ్మ అనగానే, ఫ్యానుకు వేలాడుతున్న 'రాగిణి' కళ్ళముందు ప్రత్యక్షమయింది. నేను మంచం మీది నుంచి లేస్తూ,

"అమ్మా! రాగిణిని చూడాలమ్మా! చివరిసారిగా ఒక్కసారైనా చూడాలమ్మా?" అని బయటకు వెళ్ళ డానికి ప్రయత్నిస్తుంటే,

ఆ శబ్దానికి బయట కూర్చున్న కానిస్టేబుల్ లోపలికొచ్చి లేచి ఉన్న నన్ను చూసి వెంటనే మొబైల్లో, ఎవరికో ఫోన్ చేశాడు.




నేను బయటకు వెళ్ళడానికి సిద్ధపడుతుంటే,

"వద్దు సార్! మీరు బయటకు వెళ్ళడానికి వీల్లేదు. మా సార్ వస్తున్నాడు. అంతవరకు మీరు నా కస్టడీలోనే ఉండాలి" అన్నాడు.

నేను అతన్ని ఎదిరించి బయటకు వెళ్ళడానికి ప్రయత్నించాను. కానీ, నా బలం సరిపోలేదు. బలహీ నంగా ఉన్న నన్ను అతను మంచంపై పడుకోబెట్టాడు.

అరగంటలో నా ఐపీయస్ ఫ్రెండ్, డీయస్పీ అంతా వచ్చారు.

వాళ్ళతో పాటే వచ్చిన డాక్టర్, నా రెండు చేతు లకూ ఉన్న IV కాన్యులాలను తొలగించాడు.

నేను నా ఫ్రెండ్ భుజం మీద తలవాల్చి ఏడ్చాను. వాడి కళ్ళల్లో కూడా నీళ్ళు తిరిగాయి.

"రాగిణి..." అన్నాను, అనుమానంగా. వాడు నా వైపు చూసి,

"పోస్టుమార్టం కాగానే బాడీని వాళ్ళ నాన్నకు అప్పగించాం. క్రిమేషన్‌కు వెళ్ళారు" అన్నాడు.

'హు, రాగిణి, బాడీ అయిపోయింది. క్రిమేషన్ కూడా అయిపోయింది' అని మనసులో అనుకుని,

"నా రాగిణి చివరి చూపుకు కూడా నోచుకో లేదా నేను..." అని కుమిలి కుమిలి ఏడ్చాను.

"వద్దు. మీ పెళ్ళి కోసం వాళ్ళింటికి వచ్చిన చుట్టా లంతా రాగిణిని నువ్వే హత్య చేశావనుకుంటు న్నారు. నువ్వక్కడికి వెళ్తే పరిస్థితులు అదుపు తప్పు తాయి. అందుకే, నిన్ను సిటీకి దూరంగా ఈ హాస్పిటల్లో చేర్పించి, పోలీసును కాపలాగా పెట్టాను" అన్నాడు.

నా ఒంట్లోని రక్తమంతా తోడేసినట్టయింది.

"మరి, అంకుల్...?"

"వాళ్ళంతా అంకుల్ మాట వినే పరిస్థితిలో లేరు. ఇంకా..."

అంటూ ఏదో చెప్పబోయి, అమ్మా వాళ్ళ వైపు తిరిగి, "మీరు కొంచెం సేపు బయట వెయిట్ చేయండమ్మా!" అన్నాడు.

"ఇవాళ ఉదయమే నారాయణగూడ పోలీస్ స్టేషనుకు, ఖాళీగా ఉన్న ఆ ఫ్లాట్ తలుపులు తెరచి ఉండడంతో, అనుమానమొచ్చి అపార్ట్‌మెంట్ వాళ్ళె వరో ఫోన్ చేసి కంప్లయింట్ చేశారు. దాంతో అక్క డికి వెళ్ళిన సీఐ, రాగిణి శవం దగ్గర దొరికిన పర్సు లోని ఐడీకార్డు, మొబైల్ సహాయంతో ఆమె తల్లి దండ్రులను పిలిపించాడు.

వాళ్ళు నిన్న ఉదయం రాగిణి నీతో వెళ్ళిన విషయం చెప్పడం, అప్పటి నుంచి మళ్ళీ రాగిణి ఇంటికి రాకపోవడం, నువ్వు కూడా ఎవ్వరికీ అందుబాటు లోకి రాలేదని చెప్పడంతో, సీఐ సహజంగానే ఆ టైములో నువ్వే హత్యచేసి, ఆత్మహత్యగా చిత్రీకరించావని మొదట అనుమానపడి నిన్ను అరెస్ట్ చేశాడు.

నేనూ, డీయస్పీగారూ జరిగిన విషయం చెప్పి కిడ్నాప్ కంప్లయింట్ చూపించిన తర్వాత వది లాడు. అక్కడి నుంచి తీసుకొచ్చి నిన్ను హాస్పిటల్లో చేర్చాం" అన్నాడు.

దూరంగా రూము తలుపు దగ్గర నిలబడిన కానిస్టేబుల్‌ను చూపించి బయటకు పంపించమని డీయస్పీకి సైగ చేశాడు. కానిస్టేబుల్ బయటకు వెళ్ళగానే, నా ఫ్రెండు నా దగ్గరగా జరిగి,

"కమాన్ మ్యాన్! ధైర్యం తెచ్చుకో! జరిగిందేదో జరిగిపోయింది" అన్నాడు.

'నిజంగా పోలీసు ఉద్యోగంలో చేరగానే మను షుల హృదయాలు కఠిన పాషాణాలయిపోతాయా?'

'జరిగిందేదో జరిగిపోయిందా?' ఏదో సైకిల్లో, పర్సో పోతే ఓదార్చినట్టుగా, ప్రియతములను పోగొ ట్టుకుని దుఃఖిస్తున్న వారికి చెప్పడం సమంజస మేనా?'

నేను అతని వైపు నిరసనగా చూశాను.

"సారీ! తప్పుగా మాట్లాడాను" కొంచెం పశ్చా త్తాప ధ్వనిలో అని,

"కానీ నువ్వు ధైర్యం తెచ్చుకోవాలి. నేను ఎందుకు చెప్తున్నానో అర్థం చేసుకో! నిన్న నువ్వు తనను అపార్ట్‌మెంట్ దగ్గర వదిలి వెళ్ళగానే, రాగిణి పార్కింగులో పెట్టడానికని కారెక్కగానే అప్పటికే కారులో మాటేసిన ఒకడు ఆమెకు మత్తుమందిచ్చి కారును మేడ్చల్ వైపు తీసుకెళ్ళాడు. మళ్ళీ రాత్రి పదిగంటల సమయంలో హిమాయత్‌నగర్‌లోని కొత్త ఫ్లాటుకు తీసుకొచ్చారు. అప్పటి వరకూ రాగి ణికి మత్తుమందు ఇస్తూనే ఉన్నారు. అక్కడికి వచ్చేసరికి తను స్పృహలో లేదు. రాగిణి కొన్న కొత్త ఫ్లాట్ గురించి కూడా తెలిసిందంటే వాళ్ళు మిమ్మల్ని చాలా రోజులుగా ఫాలో అవుతున్నారన్న మాట. లేదా బ్యాంకు లోను తీసుకుని కొన్న ఫ్లాట్ కాబట్టి, బ్యాంకులో పనిచేసే వాళ్ళే ఆ విషయం దుండగు లకు చెప్పి ఉంటారు. ఆ ఫ్లాట్‌లోనే రాగిణిని రేప్ చేసి, వీడియో తీశారు. వీడియో తీసినట్టుగా మనకు హాల్లోని సీసీటీవీల ద్వారా తెలిసింది. ఆ అవమానం భరించలేక రాగిణి ఆత్మహత్య చేసుకుంది. అది హత్యా? ఆత్మహత్యా? అన్న విషయం పూర్తిగా తేల లేదు. నేనయితే అది ఆత్మహత్యే అనుకుంటున్నాను. ల్యాబ్ రిపోర్టులు వస్తేనే గానీ కన్ఫర్మ్‌గా తెలి యదు. నేను కమీషనర్‌గారితో మాట్లాడి కేసు బుక్ చేయించాను.

ఆ జోనల్ మేనేజర్ రామస్వామి, బాలగోపాల్ ఇద్దరూ ఊళ్ళో లేరు. నువ్వూ రాగిణీ కలిసి వెళ్ళి కార్డు ఇచ్చిన తర్వాత ఆ జడ్ఎం అర్జెంటుగా మధ్యాహ్నం ఫ్లైటుకు కొల్‌కత వెళ్ళాడు. ఎఫ్ఐఆర్‌లో వాళ్ళిద్దరి పేర్లు ఇంక్లూడ్ చేయడానికి చాలా కష్ట పడాల్సి వచ్చింది. కానీ, వాళ్ళు బలమైన 'ఎలిబీ' సృష్టించు కున్నారు. బాలగోపాల్ ఎంపీ కాబట్టి అతన్ని అరెస్ట్ చేయాలంటే లోక్‌సభ స్పీకర్ పర్మిషన్ కూడా తీసు కోవాలి.

అసలు ఈ ఘోరం చేసిన వాళ్ళంతా ప్రొఫెష నల్ కిల్లర్సే. బిహార్ గ్యాంగ్. వాళ్ళు కావాలనే సీసీ టీవీల్లో పడ్డారు. అంటే అరెస్టుకు సిద్ధపడే, శిక్ష పడు తుందని తెలిసే ఈ క్రైం చేశారు. ఇట్లాంటి ఆపరేషన్స్‌కు కోట్లల్లో సుపారీ ఉంటుంది. మా వాళ్ళు పెద్దగా కష్టపడకుండానే మొత్తం చెప్పేశారు.

బిహార్ గ్యాంగ్ వాళ్ళకు చండీఘర్ నుంచి సుపారీ వచ్చిందంట. నెల రోజుల నుంచీ టోలిచౌకిలోని అపార్ట్ మెంట్‌లో ఉంచారట. రోజుకో సిమ్ కార్డు సప్లై చేశారట. మిమ్మల్ని ఫాలో అవుతూ, రోజూ ఉదయం, సాయంత్రం రిపోర్ట్ చేసేవారట. సమయం చూసి అటాక్ చేయమన్నారట. నువ్వే వాళ్ళ టార్గెట్. కానీ,

అలాగే న్యాయం కూడా అంతే. చట్టాల పుస్తకం కింద నిజంగా, నిష్పక్షపాతంగా ఉన్నట్టుగానే అనిపిస్తుంది. కానీ, పరీక్షగా చూస్తే న్యాయానికి, ఎప్పుడూ చిక్కుముళ్ళే. సాపు కాని ముడుతలే ఉంటాయి.

ఐపీయస్ ట్రైనీగా చెబుతున్నా. కేసు కోర్టుకు చేరిందంటే, అది, ఎన్నేళ్ళకు తీర్పుకు నోచుకుంటుందో, ఏ కోర్టు వరకు వెళ్తుందో పెరుమాళ్ళకే ఎరుక. ఇంతా చేసి, అన్ని చోట్లా న్యాయదేవత మన పక్షాన ఉన్నా, ఒకవేళ ఆ క్రిమినల్స్‌లో ఎవరికైనా పడితే గిడితే రెండు మూడేళ్ళ శిక్ష పడుతుంది.

జడ్ఎం రామస్వామి, బాలగోపాల్ సేఫ్‌గా బయట పడతారు. కాకపోతే, కొన్ని రోజులు ప్రెస్సు, టీవీల నోళ్ళల్లో నానుతారు. మహిళా సంఘాల తిట్లు తింటారు. కానీ, రాజకీయనాయకులకు అవన్నీ మామూలే. థిక్ స్కిన్‌డ్ పీపుల్ పట్టించుకోరు. పరిస్థితి ఇంకా సీరియస్‌గా మారితే 'ఇదంతా ప్రతిపక్షాల కుట్ర'గా తేల్చేస్తారు."

అంటూ తన సుదీర్ఘ ఉపన్యాసం ముగించాడు.

కనుగుడ్లు పేలిపోయి రక్తం చిమ్ముతున్నట్లుగా నా కళ్ళు ఎరుపెక్కాయి.

"నా మాట విను. నీ శ్రేయోభిలాషిగా చెప్తున్నాను. నీ శారీరక మానసిక ఆరోగ్య పరిస్థితి బాగోలేదు. అమ్మానాన్నలతో మీ సొంతూరుకు వెళ్ళి ఓ రెండు నెలల పాటు రెస్ట్ తీసుకో. ఏం చేయాలో తర్వాత ప్రశాంతంగా ఆలోచిద్దాం" అన్నాడు.

నేను ఆలోచనల్లో పడిపోయాను.

మనసు పొరలు ఖండఖండాలుగా నరికివేయబడుతున్నాయి. నా కళ్ళ ముందు జరుగుతున్న ఘోరాలకు నా మనసు లాజికల్‌గా ఆలోచించే శక్తిని కోల్పోయింది. ప్రతీ ఒక్కరినీ అనుమానపు దృక్కులతోనే చూస్తున్నానా అని అనిపిస్తోంది. కష్టకాలంలో ఆదుకున్న స్నేహితుణ్ణి కూడా అనుమానించే స్థితికి జారిపోయినందుకు, ఒక్క క్షణం, సిగ్గు పడ్డాను.

'గుండెల్లో కొండలా పేరుకుపోయిన దుఃఖం, ఘనీభవించిన విషాదం నన్ను జడంగా మార్చేసిందా?

అంత దారుణ మారణకాండకు గురవుతున్నపుడు రాగిణి ఎంత నరకయాతన అనుభవించిందోనని తలుచుకుంటేనే నా రక్తం రగిలిపోతోంది.

## తిప్పలు పడుతోంది

***టాలీవుడ్‌లో*** *ఐటెంసాంగ్‌తో హిట్ కొట్టేసి అందరిచేతా గ్లామర్‌డాల్ అనిపించుకుంది రాయ్‌లక్ష్మి. జూలీ–2 సినిమాతో బాలీవుడ్‌లోకి అడుగు పెట్టింది. ఈ సినిమాలో టైటిల్ రోల్ పోషించిన ఈ ముద్దుగుమ్మ, అందాల ఆరబోతలో అస్సలు కాంప్రమైజ్ అవ్వలేదట. అయితే అయ్యోరిగుర్రానికి అన్నీ అవరోధాలే అన్నట్లుగా ఏడాదిక్రితమే విడుదల కావాల్సిన ఈ సినిమా అనేక కారణాల వల్ల వాయిదా పడుతూ వస్తోంది. దాంతో ఆ సినిమాని ఎప్పటికప్పుడు వార్తల్లో నిలిపేందుకు ప్రయత్నిస్తోందట రాయ్‌లక్ష్మి. సోషల్‌మీడియాలో తన కొత్తకొత్త ఫోటోలు పెడుతూ ఎన్నో తిప్పలు పడుతోంది అంటున్నారు సినీజనాలు.*



'ఇంతేనా? ఒక ఆఫీసరయి ఉండి కూడా కళ్ళ ముందు ఇంత ఘోరం జరిగితే, ఒక అబలను బలాత్కారం చేసి చంపేస్తే, చేసినవాళ్ళూ, చేయించినవాళ్ళూ ఎవరో తెలిసినా ఏమీ చేయకుండా నిస్సహాయంగా సొంతూరుకు పారిపోయి ప్రశాంతంగా ఆలోచించుకుంటూ ఉండాల్సిందేనా?

ఇక ఈ దేశంలో న్యాయం, చట్టం అన్నవి నీటి మీద రాసిన రాతలేనా? లేకపోతే నా ఫ్రెండును కూడా ప్రలోభాలకు గురిచేసి, ఉల్టా నా మీదకే గురి పెట్టారా? స్నేహితుడిగా నటిస్తూనే నా దగ్గరున్న గుట్లన్నీ తెలుసుకుని అవతలి పార్టీకి చేరవేసే కుట్ర జరుగుతోందా? అందుకే నన్ను సీనులో నుండి తప్పించడానికి రెండు నెలల రెస్ట్ అనే పన్నాగం పన్నారా?

ఎందుకంటే, అతనితో నా స్నేహం వయసు లా కాలేజీలో చదివిన రెండు సంవత్సరాలే. మా మధ్య ఉన్నది ఒక పలుచటి, సుతారమైన స్నేహబంధమే! దానికీ బలమైన పునాది లేదు. పరిచయానికి, స్నేహానికి మధ్యన ఉన్న సున్నిత స్థితి.

లేకపోతే అతను ట్రైనింగులో ఉన్నాడు కాబట్టి, అతనికి నాతో స్నేహం కన్నా, ఉద్యోగ భద్రత ముఖ్యం కాబట్టి అతని బాసు ఆజ్ఞల ప్రకారం నడుచుకుంటున్నాడా? చూసీ చూడనట్టు వదిలేయమని అతనికి రాజకీయనాయకుల నుండి అజ్ఞాత సందేశాలు వచ్చాయా?'

ఎడతెగని ఆలోచనలతో రంపపు కోత మెషిన్‌లో ముక్కలు ముక్కలుగా కోసి వేయబడుతున్న కర్ర దుంగల మాదిరిగా, నాకు ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టవుతోంది. నాలాంటి మూర్ఖుణ్ణి ప్రేమించి బలయినందుకు, ఆ క్షణంలో, నన్ను తప్పనిసరిగా శపించే ఉంటుంది.

ఈ పాటికి రాగిణి మంటల్లో దగ్ధమయి బూడిదయిపోయి ఉంటుంది. తన ఆత్మ ఆకాశంలో విహరిస్తూ ఉంటుంది.

అప్పటికి నా వయస్సు ఇరవై ఆరేళ్ళు. బ్యాంకులో చేరి మూడేళ్ళయింది. కానీ, కొన్ని జన్మలకు సరిపడేంత విషాదాన్ని మూటకట్టుకున్నాను. ఇంత చిన్న వయసులో ఏ మనిషి కూడా ఊహించలేని అనుభవాలను సంపాదించాను. తొలి వలపులోని తీయదనాన్ని తనివితీరా అనుభవించకుండానే జీవన మంజూషలో విషాన్ని ఒంపుకున్నాను.

నా మూర్ఖత్వం వల్ల ఎక్కడో రాయపూర్ నుంచి వచ్చిన ఒక పవిత్రమూర్తి ఘోరాతిఘోరంగా చనిపోవడానికి కారణమయ్యాను. ఛీ... నాదేం బతుకు...'

ఎవరో పిలుస్తున్నారు. కానీ, ఆ మాటలు నా మెదడుకెక్కడం లేదు. కళ్ళముందు మసకమసకగా రాగిణి నవ్వు ముఖం ఫేడౌట్ అవుతుండగా, మాయమవుతుండగా, కొంతసేపటికి మృత్యువు లాంటి మత్తు నన్ను కబళించింది.

***

ఎవరో పిలుస్తున్నారు. కానీ, ఆ మాటలు నా మెదడుకెక్కడం లేదు. కళ్ళముందు మసకమసకగా ఆందోళనగా ఉన్న సాక్షి ముఖం ఫేడిన్ అవుతూ నా ముందు ప్రత్యక్షమవుతుండగా, మృత్యువు లాంటి మత్తు నుండి మేలుకున్నాను.

**(ఇంకా వుంది)**




**"చిల్లర లేదు మేడమ్.."- ఆ మాట విన గానే నాకు చిర్రెత్తుకొచ్చింది. పది రూపా యల నోటు ఇచ్చినా అదే సమాధానం.. రెండు వేల నోటు ఇచ్చినా అదే సమాధానం. ఏ బిల్లు అయినా ఎప్పుడూ రౌండ్ ఫిగర్ ఉండదు. చివర చిల్లర రూపాయలో, చిల్లర పైసలో మిగులుతాయి. "ఉండు తెస్తా.." అని వెనక్కి తిరిగా.**



# ఇందులోనే సెటిల్ అవుతా!

'మిగిలిన చిల్లర కొట్టేయటానికి ఈ వేషాలు..' అని సణుక్కుంటూ లోపలికి వెళ్లా. చిల్లర పట్టుకు వచ్చి బిల్లు సెటిల్ చేశా. "నా దగ్గర నిజంగా చిల్లర లేదు మేడమ్. నాకు కావాలంటే ఓ పది రూపా యలు టిప్ అడుగుతా. అబద్ధం మాత్రం చెప్పను.." అన్నాడు. నాకెందుకో చాలా ఇబ్బందిగా అనిపించింది. కొన్నిసార్లు మన మనసులో మాటలు అప్రయత్నంగా బయటకు వచ్చేస్తూ ఉంటాయి. అప్పుడు జరిగే డామేజ్ అంతా ఇంతా కాదు. "నాకు ఇలాంటి ఎక్స్‌పీరియన్స్‌లు చాలా ఉన్నాయి. అందుకే అన్నా.." అని తలుపేసేసు కున్నా. తలుపేసిన తర్వాత నేను అలా ప్రవర్తించ కుండా ఉండాల్సిందనుకున్నా. ఆ ఆలోచన ఆ క్షణం వరకే.. తర్వాత మళ్లీ రొటీన్‌లో పడిపోయా.

### తప్పులు ఒప్పు చేసుకోవచ్చు

మూడురోజుల తర్వాత ఫ్రెండ్ ఎవరో వస్తే మళ్లీ పిజ్జా ఆర్డర్ చేశాం. బెల్లు మోగింది. తలుపు తీసి చూస్తే మళ్లీ పాత కుర్రాడే. నన్ను చూడగానే స్నేహపూర్వకంగా నవ్వాడు. నాకే ఎందుకో గిల్టీగా అనిపించింది. డ్రస్ మీద పేరు చూస్తే రాంబాబు అని ఉంది. పిజ్జా తీసుకొని బిల్లు ఇచ్చేశా. ఇరవై రూపాయలు టిప్పు కూడా ఇచ్చా. మాట్లాడకుండా తీసుకువెళ్లిపోయాడు. నాకెందుకో గిల్టీ పోయింది. 'డబ్బుతో మన తప్పులు ఒప్పు చేసుకోవచ్చు..' అనే సూత్రం మరోసారి రుజువైంది అనుకున్నా. ఈ రెండు సంఘటనలు జరిగిన పదిహేను రోజులకు ఇంటికి కజిన్స్ వచ్చారు. టీవీలో పిజ్జా సినిమా వస్తోంది. అందరం కూర్చుని చూస్తున్నాం. నాకెం దుకో రాంబాబు గుర్తొచ్చాడు. "అక్కా..పిజ్జా తినా లని ఉంది.." అంటు గునిశాడు మా కజిన్ బ్రదర్. ఆకలి, ఆవలింతలు ఒంటరిగా రావు. అందరికీ కలిసే వస్తాయి. పిజ్జాలు ఆర్డర్ చేశాం. వాటిని పట్టుకొని రాంబాబు వచ్చాడు.

### టైం పాస్ కోసమా?

"రోజుకు ఎన్ని పిజ్జాలు డెలివరీ చేస్తావు బ్రదర్.." అని మా వాడు ఇంటరాగేషన్ మొదలు పెట్టాడు. "20 నుంచి 30 ఇళ్లు ఉంటాయి సార్." అనే రాంబాబు సమాధానం నాకు లోపలికి విని పించింది. "పెట్రోలు వాళ్లే ఇస్తారనుకుంటా.. అందరి ఇళ్లకు వెళ్లి ఆర్డర్‌లు డెలివరీ చేయటమే కదా.." అన్నాడు మావాడు. "అంత ఈజీ కాదు సార్. డెలివరీ టైమ్ 20 నిమిషాలు. డిలే అయితే కస్టమర్లు విసుక్కుంటారు. కొందరైతే బిల్లు కూడా ఇవ్వరు. బిల్లు మా జీతం నుంచి కట్ అవుతుంది.." అన్నాడు రాంబాబు. "కానీ బాగా చేస్తే ఇన్‌సెం టివ్స్ ఉంటాయి కదా.." అని ఆగాడు మావాడు. ఏదో గుర్తుకొచ్చినట్లు "ఇంతకీ నువ్వు ఏం చది వావు.." అని అడిగాడు. "ఎంబీఏ పార్ట్ టైమ్ చేస్తున్నా సార్.." అని సమాధానమిచ్చాడు రాంబాబు. అతని గొంతులో కొంత గర్వం కని పించింది. "మరి ఈ పనెందుకు చేస్తున్నావు.. టైం పాసా.." అని ఎదురుప్రశ్న వేశాడు మావాడు. "ఫుల్‌టైం సార్. ఎంబీఏ అయిన తర్వాత దీంట్లోనే సెటిల్ అవుతా. ఇప్పుడు అన్నీ పోను పద్దెనిమిది వేల దాకా వస్తుంది. ఎంబీఏ పూర్తయి మేనేజర్ అయితే పాతికవేల దాకా వస్తుంది. అప్పుడు లైఫ్ సెటిల్ అయిపోయినట్లే" అన్నాడు రాంబాబు. ఈ సంభాషణ వింటున్న నాకు ఇబ్బంది పెరిగి పోతోంది. "చిన్నా.. ఓ సారి లోపలికి వస్తావా?" అని మావాడిని లోపలికి పిలిచా. "వస్తా సార్..!" అంటూ రాంబాబు వెళ్లిపోయాడు.

### ఏదో ఒకటి ఉంటుంది

"పిజ్జా వాడితో నీకేంటిరా కబుర్లు..." అని మావాడిని గదమాయించా. "కాలేజీలో ఉన్నప్పుడు నాకు పిజ్జా బోయ్ అవ్వాలని ఉండేదే! వెధవ సాఫ్ట్ వేర్‌లో వచ్చి పడ్డా. లేకపోతే నేనూ వాడిలా పిజ్జా బోయ్ అయి ఉండేవాడిని.." అన్నాడు. "వాడు ఎంత కష్టపడుతున్నాడో నీకు తెలుసా? రోజుకు 20 డెలివరీలు ఇవ్వటమంటే మాటలా? నిన్ను గ్లాసు తీసి పక్కన పెట్టమంటే పెట్టవు. ఎవరూ ఏమీ అనకపోయినా చిందులేసేస్తావు. నేనే ఓ రోజు వాడిని చిల్లర లేదన్నాడని విసుక్కున్నా. నువ్వా పొజిషన్‌లో ఉంటే ఏం చేస్తావురా.." అన్నా. బహుశా మా వాడు నేను ఇన్ని మాటలు అంటా నని ఊహించి ఉండడు. "ప్రతి ప్రొఫెషన్‌లో ఏదో ఒకటి ఉంటుందే! మా మేనేజర్లు మమ్మల్ని అనటం లేదా!" అని దబాయించబోయాడు. మళ్లీ ఎందుకో వాడికే జ్ఞానోదయమైనట్లుంది. "వాళ్లను చూస్తే పాపం అనిపిస్తుందే! ఎండలోను, వానలోను తిర గాలి. పిజ్జా టైంకి రాకపోతే తిడతాం. టేస్ట్ బావుం డకపోతే తిడతాం.. పైగా పిజ్జాలాంటి సినిమాలు చూసి అందరూ దొంగలే అనుకుంటాం.." అన్నాడు. ఒక్క క్షణం ఆగి "నీకు నెలకు యాభై వేలు ఇస్తాం.. పిజ్జా డెలివరీ చేస్తావా? అని అడిగితే ఏం చేస్తావు?" అని ప్రశ్నించాడు. "చేయను" అని వెంటనే సమాధానమిచ్చా. ఆ సమాధానం చెప్పిన తర్వాత అర్థమైంది నేనెంత కంఫర్ట్ జోన్‌లో ఉద్యోగం చేస్తున్నానో...!


—సీత

email: fbackfm@gmail.com

CRIME

# ఒకే దెబ్బకు రెండు పిట్టలు

**రాత్రి పదకొండు గంటల సమయం.**

**సన్నగా వర్షపు చుక్కలు పడుతున్నాయి.**

**నిశ్శబ్దంతోపాటు చీకటి కూడా వాతావరణాన్ని ఆక్రమించుకుంది.**

**సరిగ్గా అదే సమయంలో, ఓ వ్యక్తి పిల్లిలా అడుగులు వేస్తూ ఆ గది దగ్గరికి చేరుకున్నాడు.**

**తలుపుల ముందు ఓ క్షణం ఆగి చుట్టూ చూశాడు. ఆ తరువాత మెల్లగా తలుపులు తోశాడు.**

లోపల....గది మధ్యలో మంచంమీద పడుకున్న ఓ స్త్రీ అతడిని చూడగానే మత్తుగా నవ్వింది.

ఆ నవ్వు చూడగానే అతని గుండె లయ తప్పింది. చప్పున గదిలోకి అడుగుపెట్టి తలుపు మూసి గడియపెట్టాడు. సుడిగాలిలా వెళ్ళి ఆమె మీద పడ్డాడు. క్షణంలో ఆమె ఒంటిమీది దుస్తులు ఆమె నుంచి వేరయ్యాయి. పాలరాతి విగ్రహంలా మెరిసిపోతున్న ఆమెను ఆబగా ఆక్రమించుకున్నాడు. మత్తుగా మూల్గుతూ ఆమె అతడిని అల్లుకు పోయింది. అరగంట గడిచింది.

జాకెట్ హుక్స్ పెట్టుకుంటూ, "ఎందుకింత ఆలస్యంగా వచ్చావు. నీ కోసం ఎంతసేపటి నుంచి ఎదురు చూస్తున్నానో తెలుసా?" అందామె ఒళ్ళు విరుచుకుంటూ.

ఆ విరుపులో వంద మెరుపులు మెరిసినట్టయ్యింది.

"ఏం చేయను. మీ ఆయన గుడ్లగూబ లేచి ఉన్నాడు. అతను నిద్రలోకి జారుకున్నాక ఇలా వచ్చాను"

"నిన్ను వదిలి ఒక్కక్షణం కూడా ఉండలేననిపిస్తోంది"

"మన సుఖానికి అడ్డుగా ఉన్నాడు. ఏం చేయాలో నాకు తోచటం లేదు".

"దారిలో ముళ్ళుంటే ఏం చేస్తాం?" అందామె ఆలోచనగా అతనివైపు చూస్తూ.

ఆమె మాటలకు అతను ఉలికిపడ్డాడు.

ఆమెవైపే చూస్తూ, "అంటే వాడిని శాశ్వతంగా నిదురబుచ్చాలా?" అనుమానంగా అడిగాడు.

"అలా చేస్తేనే మనకు సంపూర్ణమైన స్వేచ్ఛ దొరుకుతుంది. అప్పుడు రాత్రీ పగలూ.."

ఆ మాటలు వినగానే అతను ఆవేశంగా మళ్ళీ ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

కొద్దిసేపటి తరువాత అతను మంచం దిగాడు.

ఆమె కూడా మంచం దిగి అతడి చెవిలో ఏదో చెప్పింది.

"ఇప్పుడేనా?" అన్నాడు.

"ఆc ఇప్పుడే" అందామె.

ఆమె మంచంకింద దాచిన గొడ్డలి తీసి ఇచ్చింది.

అతను తలుపులు తీసుకుని గొడ్డలితో బయటికి వచ్చాడు.

ఇంటి ముంగిట్లో మంచంమీద పడుకున్న వ్యక్తిని ఓ క్షణం తీక్షణంగా చూశాడు.

మరుక్షణం అతను చేతిలోని గొడ్డలిని పైకెత్తి విసురుగా దించాడు.

మరుక్షణం భూనభోంతరాలు దద్దరిల్లేటట్టు ఒక కేక మంచం మీదున్న వ్యక్తి కంఠం నుంచి వెలువడింది.

ఆ వ్యక్తి మెడ సగం తెగింది. అతను కోడిపిల్లలా గిలగిలా తన్నుకున్నాడు. కొద్ది నిముషాల తరువాత అతనిలో చలనం ఆగిపోయింది.

సరిగ్గా అదే సమయంలో "రక్షించండి, రక్షించండి... అయ్యో ఈ దుర్మార్గుడు నా భర్తను చంపేస్తున్నాడు" అని ఆమె కేకలు పెట్టసాగింది.

ఆమె కేకలు వినగానే అతను అదిరిపడి ఆమెవైపు పిచ్చిగా చూశాడు.

అంతకుముందు హతుడువేసిన కేకకు మేల్కొన్న ఇరుగుపొరుగు జనం ఆమె కేకలకు పూర్తిగా స్పృహలోకి వచ్చి క్షణాల్లో అక్కడికి చేరుకున్నారు.

రక్తపు మడుగులో పడున్నవ్యక్తిని, పక్కనే గొడ్డలి పట్టుకున్న వ్యక్తిని, గుండెలు బాదుకుంటూ హృదయవిదారకంగా ఏడుస్తున్న ఆమెను చూసి నిర్ఘాంతపోయారు.

ఆ గుంపులోవున్న ఒకడు వెంటనే పోలీసులకు ఫోన్ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ తన సిబ్బందితో అక్కడికి చేరుకున్నాడు.

**అతడు పిల్లిలా వెళ్ళి ఆ గదిలోకి తొంగి చూశాడు. నిండు యవ్వనంలో ఉన్న యువతి మంచంమీద పడుకుని ఉంది. అతడిని చూసి నవ్వింది. తలుపు గడియవేసి సుడిగాలిలా వెళ్ళి ఆమెను ఆక్రమించుకున్నాడు. క్షణంలో ఆమె ఒంటిమీద దుస్తులు వేరయ్యాయి. పాలరాతి విగ్రహంలా మెరిసిపోతున్న ఆ యువతి మత్తుగా మూలుగుతూ అతడిని అల్లుకుపోయింది. అరగంట తర్వాత ఆమె జాకెట్ హుక్స్ పెట్టుకుంటూ....**

హంతకుడి దగ్గర నుంచి గొడ్డలి స్వాధీనం చేసుకుని, శవపంచనామా జరిపించి శవాన్ని పోస్ట్ మార్టం నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రికి తరలించారు. ఇన్‌స్పెక్టర్ సింగ్ హతుడి భార్యను, అక్కడ గుమిగూడిన జనాన్ని ప్రశ్నించి వివరాలు నమోదుచేసుకుని, పిచ్చి చూపులు చూస్తున్న హంతకుడిని పోలీస్ స్టేషన్‌కు తీసుకొచ్చారు.

అటు తరువాత పోలీసు ఇంటరాగేషన్‌లో హంతకుడు పూసగుచ్చినట్టు జరిగిన విషయాలు చెప్పాడు. అతను చెప్పినదంతావిన్న ఇన్‌స్పెక్టర్ సింగ్ హతుడిభార్యను పిలిపించి ప్రశ్నించాడు. మొదట్లో ఆమె బుకాయించినా చివరికి నోరువిప్పక తప్పలేదు. ఆమె చెప్పిన కథంతా విన్న తరువాత పోలీసులు ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టారు.

ఇంతకీ ఆ హత్య ఎందుకు జరిగింది? ప్రియుడిని పురికొల్పి భర్తను హత్య చేయించటమే కాకుండా అతడినే ఆమె ఎందుకు హంతకుడిగా పట్టించింది?

***

ఆ జిల్లాలో బాగా అభివృద్ధి చెందిన ప్రాంతం రామ్‌పూర్. ఆ ఊళ్ళోని ధనవంతుల వీధిలో భార్యా, ఇద్దరు పిల్లలతో దివాకర్ కాపురముంటున్నాడు. అతని భార్య విజయ. ఆమె అతనికి రెండవభార్య. ఇద్దరు పిల్లలు పుట్టాక అతడి మొదటిభార్య జబ్బు చేసి మరణించింది. పిల్లల్ని చూసుకునేందుకు దివాకర్‌కు రెండవపెళ్ళి చేసుకోక తప్పలేదు.

ఆర్థికపరిస్థితుల కారణంగా విజయ తల్లిదండ్రులు వయస్సులో పెద్దవాడు, ఇద్దరు పిల్లల తండ్రి దివాకర్‌కి ఇచ్చి పెళ్ళిచేసి తమ గుండెలమీది బరువు దించుకున్నారు. కుటుంబ పరిస్థితులకు తలొగ్గి ఆమె ఈ పెళ్ళి చేసుకుంది.

అయితే ఆమె తల వంచినా, ఆమెలోని కోరికలు తలవంచుకుని ఉండలేకపోయాయి. మొదటి రాత్రి దివాకర్ ఆమెను తన కౌగిట్లోకి తీసుకున్నా, కొద్దిక్షణాల్లోనే అలసిపోయి పక్కకు తిరిగి పడుకుని నిద్రలోకి జారిపోయాడు.

నిండు యవ్వనంలో ఉన్న విజయ రాత్రంతా అసంతృప్తితో దొర్లుతూ ఉండిపోయింది.

సరిగ్గా అలాంటి సమయంలోనే ఆమె కళ్ళు ధర్మేంద్రపై పడ్డాయి.

దివాకర్ చిన్నతమ్ముడు ధర్మేంద్ర. పొడుగ్గా, బలంగా, చూడటానికి చలాకీగా ఉండే పాతికేళ్ళ కుర్రాడు. ఇంకా ఉద్యోగం రాలేదు. అతడికి పిల్లనివ్వటానికి ఎవరూ ముందుకు రావడంలేదు. అదే సమయంలో భార్యమరణంతో పిల్లలకోసం దివాకర్ మంచి వయసులో ఉన్న అందమైన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. దివాకర్ అదృష్టానికి ఆ వీధిలో వాళ్ళు లోలోపల అసూయ పడేవాళ్ళు. వాళ్ళతో

పాటే ధర్మేంద్ర కూడా అసూయపడే వాడు.

విజయ తెల్లగా బొద్దుగా అందంగా ఉండేది.

చక్కటి శరీరసౌష్టవంతో చూపరులను అమాంతంగా తనవైపు లాగేసేలా ఆకర్షణీయంగా ఉండేది. తన కంటే వయసులో చిన్నదైనా, విజయ రూపం ధర్మేంద్రలో సంచలనం కలిగించింది.

మొదట్లో ఆమెను కామదృష్టితో చూడటం పాపం అని నిగ్రహించుకున్నాడు. రానురాను అతని మనసు అదుపు తప్పసాగింది. ఒకరోజు దివాకర్ ఏదో పని మీద పొరుగూరు వెళ్ళాడు.

విజయ ఒక్కతే ఇంట్లో ఉంది. ధర్మేంద్ర హాలులో పేపర్ చదువుతున్నాడు.

విజయ స్నానం చేసి వస్తానని చెప్పి లోపలికి వెళ్ళింది. ఆమెవెళ్ళిన రెండు నిమిషాలకు ధర్మేంద్ర వీధివాకిలి గడియపెట్టి ఆమె గదిలోకి వెళ్ళాడు. బాత్‌రూం నుంచి నీళ్ళ చప్పుడు వస్తోంది. ఆమె ఆ పరిస్థితిలో ఎలా ఉంటుందో ఊహించుకోగానే అతని ఒళ్ళు వేడెక్కిపోయింది. కోరికతో రగిలిపోయాడు.



బాత్‌రూం డోర్‌మీద చేయి వేశాడు. లోపల గడియ పెట్టలేదు. డోర్ తెరుచుకుంది.

ఎదురుగా నగ్నంగా ఉన్న ఆమె, అతడిని చూడగానే సిగ్గుతో నవ్వింది.

ధర్మేంద్ర లోపలికి దూరి ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. ఆమె అతని బిగికౌగిలిలో ఒదిగిపోయింది. బాత్‌రూం వారి వేడి ఊర్పులతో వేడెక్కింది. ఆనాటినుంచి వాళ్ళిద్దరూ అవకాశం దొరికినప్పుడల్లా కోరికలు తీర్చుకునేవాళ్ళు. అదే సమయంలో ధర్మేంద్రకు ఉద్యోగం వచ్చింది. ఉద్యోగరీత్యా అతను మరో ఊరికి వెళ్ళాల్సి వచ్చింది. దాంతో అతను వారం పది రోజులకు ఒకసారి వచ్చేవాడు. వచ్చిన ప్రతీసారి వాళ్ళిద్దరూ స్వర్గసుఖాలు అనుభవించేవారు.

అయితే నిండు యవ్వనంలో ఉన్న ఆమె కోరికలు పది రోజులకొకసారి కూడా తీరేవి కావు.

ఆమెలో అసంతృప్తి మొదలైంది. ఆ సమయంలోనే పొరుగువీధిలోనే ఉండే శాంతారామ్‌తో ఆమెకు గుడిలో పరిచయం కలిగింది. మొదటి పరిచయంలోనే అతను ఆమె అందాన్ని బాగా పొగిడాడు. భర్తను వదిలేసివస్తే ఇద్దరం ఎక్కడికైనావెళ్ళి పెళ్ళి చేసుకుని హాయిగా బతుకుదామని చెప్పాడు. అతడి మాటలకు ఆమె ఆలోచనలో పడింది.

శాంతారామ్ మాటలు ఆమె మీద బాగా ప్రభావం చూపాయి. 'అతను తనను కేవలం కోరికతో వాడుకోవటానికి ప్రయత్నించలేదు. పెళ్ళి చేసుకునే ఉద్దేశం ఉన్నట్టు మాట్లాడటం ఆమెకు ఆనందం కలిగించింది. దివాకర్‌తో ఆమెకు ఇష్టంలేని బలవంతపు పెళ్ళి జరిగింది. పరిస్థితులకు తలొంచవలసి వచ్చింది. అంతేకాదు, దివాకర్ తనకు తగినవాడుకాదని ఆమె మనస్సు బాధపడుతూ ఉండేది. అలాంటి సమయంలో ధర్మేంద్రతో సంబంధం ఏర్పడింది. అయితే, అతడికి పెళ్ళయ్యాక అతని భార్య వస్తే అప్పుడు తన పరిస్థితి? జీవితాంతం ఇలాగే బాధపడుతూ బతకాలి. లేదా శాంతారామ్‌తో ఎక్కడికైనా వెళ్ళిపోయి అతడిని పెళ్ళి చేసుకుంటే కొత్త జీవితం ప్రారంభించవచ్చు' ఇలా విజయ మళ్ళీ ఆలోచనలోపడింది. భర్తను వదిలేసి, శాంతారామ్‌తో పారిపోయినాగానీ, ధర్మేంద్ర కచ్చితంగా తనను వెదికి పట్టుకుంటాడు. కాబట్టి భర్తతోపాటు ధర్మేంద్రను కూడా వదిలించుకోవటం మంచిదని విజయ భావించింది. దీనిపైన ఆమె తీవ్రంగా ఆలోచించిన తర్వాత చివరికి ఆమెకు ఒక ఆలోచన తట్టింది. ఆ ఆలోచన రాగానే ఆమెకు కళ్ళు తళుక్కున మెరిశాయి. 'ఒకే దెబ్బకు రెండు పిట్టలు' అనుకుంది. ఇక అప్పటినుంచీ ధర్మేంద్ర రాకకోసం ఎదురు చూడసాగింది. వారాంతపు సెలవు రోజున ధర్మేంద్ర రానేవచ్చాడు. పగలంతా వాళ్ళిద్దరూ హాయిగా కులాసాగా కబుర్లు చెప్పుకున్నారు.

ఆ రాత్రి

పదకొండు గంటల సమయం.

సన్నగా వర్షపు చుక్కలు పడుతున్నాయి.

నిశ్శబ్దంతో పాటు చీకటి కూడా వాతావరణాన్ని ఆక్రమించుకుంది.

సరిగ్గా అదే సమయంలో, ధర్మేంద్ర పిల్లిలా అడుగులు వేస్తూ ఆ గది దగ్గరికి చేరుకున్నాడు.

తలుపుల ముందు ఓ క్షణం ఆగి చుట్టూ చూశాడు. ఆ తరువాత మెల్లగా తలుపులు తోశాడు. లోపల గది మధ్యలో మంచంమీద పడుకున్న విజయ అతడిని చూడగానే మత్తుగా నవ్వింది. ఆ నవ్వు చూడగానే అతనిగుండె లయ తప్పింది. చప్పున గదిలోకి అడుగుపెట్టి తలుపు మూసి గడియ పెట్టాడు.

సుడిగాలిలా వెళ్ళి ఆమెమీద పడ్డాడు. క్షణంలో ఆమె ఒంటిమీద దుస్తులు ఆమె నుంచి వేరయ్యాయి. పాలరాతి విగ్రహంలా మెరిసిపోతున్న ఆమెను ఆబగా ఆక్రమించుకున్నాడు. మత్తుగా మూల్గుతూ ఆమె అతడిని అల్లుకుపోయింది.

అరగంట తరువాత ఆమె అతనిచేతికి గొడ్డలి అందించింది. రెచ్చగొట్టి పంపింది. కామంతో కళ్ళు మూసుకునిపోయిన ధర్మేంద్ర ఆమె పన్నాగం గ్రహించలేకపోయాడు. నిర్దాక్షిణ్యంగా అన్నను చంపేశాడు.

'రక్షించండి.... రక్షించండి... అయ్యో ఈ దుర్మార్గుడు నా భర్తను చంపేస్తున్నాడు' అని విజయ కేకలు పెట్టసాగింది.

ఆమె కేకలు ఆ వీధిని తట్టిలేపాయి.

***

విజయ పథకం ప్రకారం, ధర్మేంద్రచేత తన భర్తను హత్యచేయించి అతడిని జైలుపాలుచేసి ఇద్దరి అడ్డూ తొలగించుకోవాలనుకుంది. శాంతారామ్‌ను పెళ్ళి చేసుకుని కొత్త జీవితంలోకి ప్రవేశించాలనుకుంది. అయితే తప్పు చేసి ఎవరూ తప్పించుకోలేరు.

ధర్మేంద్ర, విజయల మీద కేసు నమోదు చేసి ఇద్దరినీ కోర్టులో హాజరు పరిచాడు ఇన్‌స్పెక్టర్ సింగ్. ప్రస్తుతం వాళ్ళిద్దరూ జైలులో ఉన్నారు.

—సూర్యనేత్ర






## స్వర్ణహంస

హర్షనైషధ కావ్య పరిశీలన

శేషేంద్ర

**ధర:** 125 రూపాయలు,

**పేజీలు:** 134

**ప్రతులకు:** తెలుగురాష్ట్రాల్లోని అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

**15వ** శతాబ్దంలో శ్రీనాథ మహాకవి తెనిగించిన శ్రీహర్షుని సంస్కృత మహాకావ్యం 'శృంగార నైషధం'లో వెలుగుచూడని, శ్రీనాథుడు దర్శించని ఎన్నో శాస్త్రాలను సప్రమాణంగా నిరూపించే శేషేంద్రశర్మ విమర్శనాగ్రంథం 'స్వర్ణహంస'. ఈ కావ్యంలోని రహస్య అంతరాత్మగా మరుగున పడిన మంత్ర, యోగ, వేదాంతశాస్త్ర సంబంధాన్ని వెలికితీసి భాషా అధ్యయన అవగాహన పరిధిని విస్తరించిన ఈ రచన తెలుగు, ఆంగ్ల భాషల్లో వెలువడింది.

---

## పెళ్ళాడేబొమ్మా

ఉషశ్రీ

**ధర:** 120 రూపాయలు

**పేజీలు:** 168

**ప్రతులకు:** దీప్తి ప్రచురణలు, మ్యూజియం రోడ్, విజయవాడ-02, సెల్: 9849065280

తెలుగునాట ఉషశ్రీ అంటే తెలియనివారు లేరు. డెబ్బయ్యవ దశకంలో రేడియో మాధ్యమం ద్వారా శ్రోతలను ఉర్రూతలూగించిన కవి, కథకుడు, నాటక, ఉపన్యాసకర్త, వ్యాఖ్యాత ఉషశ్రీ. ప్రధానంగా ఆయన స్త్రీ పక్షపాతి. పెళ్ళాడే యువతులు, స్త్రీలు ఇంటా బయటా, ఆఫీసులో ఎలా ఉండాలో, రాబందులు, గుంటనక్కల బారిన పడకుండా ఎలాంటి జాగ్రత్తలు పాటించాలో, ఎలా మాట్లాడాలో వివరించిన చక్కటి పుస్తకం ఇది. అరవయ్యో దశకంలో నాటి కృష్ణాపత్రికలో ధారావాహికగా వెలువడిన ఈ నవలా లేఖావళి ఆడపిల్లల్లో కావాల్సినంత ధైర్యం నూరిపోసింది. చిరంజీవినీ, సౌభాగ్యవతీ, కన్నతల్లీ అని సంబోధిస్తూ రాసిన కాలం చెల్లని ఈ 30 లేఖలు ఈ నాటి యువతులకు, ప్రవర్తనలకు సంబంధించిన జ్ఞానాన్ని, చైతన్యాన్ని అందిస్తాయి.



---



## అద్దంలో ఆభరణం

**(పెద్దనోట్ల రద్దుపై కవితలు)**

**ప్రధాన సంపాదకులు:**

చీకోలు సుందరయ్య

**ధర:** 180 రూపాయలు,

**పేజీలు:** 296

**ప్రతులకు:** తెలుగురాష్ట్రాల్లోని అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

గత ఏడాది నవంబరు 8వ తేదీన ప్రభుత్వం పెద్దనోట్లు రద్దు చేసిన తర్వాత దేశవ్యాప్తంగా గందరగోళం చెలరేగింది. నోట్లరద్దుపై కవులు స్పందించారు. వ్యతిరేకంగా, అనుకూలంగా, తటస్థంగా స్పందిస్తూ వారు రాసిన 153 కవితల సంకలనమిది.

---

## లోకాభిరామమ్

**వ్యాస సంకలనం (మొదటిభాగం)**

కె.బి.గోపాలం

**ధర:** 250 రూపాయలు, **పేజీలు:** 234

**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

**జీ**వితం అనుభూతులమయం. ఎన్నెన్నో జ్ఞాపకాలు, భావోద్వేగాలు, అడుగుజాడలు. రచయిత, కాలమిస్టు కె.బి.గోపాలం అందించిన ఆవకాయ, పెరుగన్నం లాంటి ఈ ప్రచురిత వ్యాసాల సంకలనం కొత్త తరం చదువుకుంటే చిత్రంగా అనిపిస్తాయి. అనుసరించాలనిపిస్తాయి.



## స్వీకారాలు

### విప్లవ సూర్యుడు

జాని బాషా చరణ్, తక్కెడశిల

ధర: 100 రూపాయలు,

పేజీలు: 104

**ప్రతులకు:** జ్యోతి వలబోజు, హైదరాబాద్ మొబైల్ 8096310140., అన్ని ప్రధాన పుస్తక దుకాణాలు

### మూడో మనిషి

మాడభూషి సంపత్‌కుమార్ కవిత్వం

ధర: 50 రూపాయలు, **పేజీలు:** 64

**ప్రతులకు:** పాలపిట్ట బుక్స్, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్-36.

**—లలితా త్రిపురసుందరి**




## కార్డ్‌బోర్డ్ ఫర్నీచర్

**మ**నిషి తన అవసరాల కోసం కలపను విపరీతంగా వాడుతున్నాడు. అందుకు చెట్లను నరుకుతున్నాడు. కానీ అదే మొత్తంలో చెట్లు పెరగడం లేదు. దీని మూలంగా పర్యావరణ సమస్యలతో సతమతమవుతున్నాం. ప్లాస్టిక్ వాడకం ప్రత్యామ్నాయం అనుకున్నా, దానితో ముప్పు ఇంకా తీవ్రతరమైంది. అందుకే ఈ రెండింటికీ ప్రత్యామ్నాయంగా కార్డ్‌బోర్డ్‌తో ఫర్నీచర్ తయారుచేస్తున్నాడు హరీష్ మెహతా. ముంబైకి చెందిన హరీష్ మెహతా వుడెన్ ఫర్నీచర్‌కి బదులు కార్డ్‌బోర్డ్ ఫర్నీచర్ తయారుచేస్తున్నాడు. పేపర్ షేపర్ అనే బూట్ స్ట్రాప్ కంపెనీని లాంచ్ చేశాడు. ముడతలు ముడతలుగా ఉండే కార్డ్‌బోర్డ్ ఇతని ముడిసరుకు. దీంతో



తయారుచేసిన ఫర్నీచర్ వంగిపోదు, కుంగిపోదు అంటున్నాడు. తేలిగ్గా అసెంబుల్ చేసుకోవచ్చు. అవసరమైతే రీసైకిల్ కూడా చేయొచ్చు. పెద్దగా ఖర్చు కూడా ఉండదంటున్నాడు.

హరీష్ తయారుచేసే ఫర్నీచర్ పట్టణ జీవితానికి సరిగ్గా సూటవుతుంది. డ్యూరబుల్, లైట్ వెయిట్, పోర్టబుల్ దాంతోపాటు ట్రెండీగా కూడా ఉంటుందీ ఫర్నీచర్. ఒకవేళ వస్తువు పనికిరాదు అనుకుంటే నిమిషాల్లో దాన్ని డిస్మాంటిల్ చేయొచ్చు. చిన్న ముక్క కూడా వేస్ట్ కాదట. అయితే మొదట్లో ఫర్నీచర్ క్వాలిటీ విషయంలో కస్టమర్లను మెప్పించే విషయంలో చాలా ఇబ్బందులు ఎదుర్కొన్నాడు హరీష్. ఇప్పటికీ జనంలో కార్డ్‌బోర్డ్ ఫర్నీచర్ మన్నిక పట్ల నమ్మకం చాలా తక్కువ అంటున్నాడతను. ఈ ఫర్నీచర్‌ని జనానికి దగ్గర చేయడానికి ఆన్‌లైన్‌లో కూడా ప్రారంభించాడు. వీటి ధర మూడువేలనుంచి మొదలవుతుంది. డెలివరీ ఎక్కడైనా ఇస్తారు. అంతేకాదు చిల్డ్రన్ ఫర్నీచర్ శ్రేణి కూడా ఆన్‌లైన్‌లో అందుబాటులో ఉంది. పిల్లలకు దీని వల్ల అడ్వాంటేజ్ ఏంటంటే.. మార్కెట్లో దొరికే రెగ్యులర్ వుడెన్ ఫర్నీచర్ అంచులు చాలా పదునుగా ఉంటాయి. దాంతో వాళ్లు గాయపడే ప్రమాదం ఉంది. పైగా బరువు కూడా ఎక్కువే. అదే కార్డ్‌బోర్డ్ ఫర్నీచర్ అయితే బరువుండదు. అంచులు కూడా మెత్తగా ఉంటాయి. పిల్లలకు అవే సురక్షితం. వాటితో ఫన్ యాక్టివిటీస్ కూడా చేయొచ్చంటాడు హరీష్. పైగా ఎక్కడికంటే అక్కడికి తేలిగ్గా షిఫ్ట్ చేసుకునే అవకాశం కూడా ఉంది. హరీష్ చేస్తున్న ఈ వినూత్న ప్రయోగం ఇప్పుడిప్పుడే జనంలోకి వెళ్తోంది. ప్రస్తుతానికి ముంబైలో మాత్రమే పాపులర్ అయిన తన కంపెనీని దేశమంతా విస్తరించాలని చూస్తున్నాడు. ప్రజల ఆదరణ ఇలాగే ఉంటే పర్యావరణానికి మేలుచేసే ప్రత్యామ్నాయ ఫర్నీచర్ వెరైటీలు తయారుచేస్తానని నమ్మకంతో చెప్తున్నాడు హరీష్.

**—లక్ష్మీశ్రీ నర్మద**




# మా ఇస్కూలు రోజులు

**అబ్బో! ఇప్పటి మాటా?!**
**అరవై ఏళ్ళ క్రితం సంగతి.**

అప్పటికింకా ఇంత నేచురల్ పొల్యూషనూ, కల్చరల్ పొల్యూషనూ, పొలిటికల్ పొల్యూషనూ ముదిరిపోలేదు. ఊళ్లు చిన్నవిగానూ, మనుషులు ఎక్కువభాగం మధ్యతరగతిగానూ ఉండేవారు. పోలీసులంటేనూ, పొలిటీషియన్లంటేనూ, స్కూలు మాస్టర్లంటేనూ, పెద్దలూ పిన్నలు కూడా జంకుతూండే వాళ్ళు. చేదతో నూతినీళ్ళు తోడి మంచినీళ్ళు తాగడం, వేసవి ఖాళీ పొలాలవెంటా, ఊరవతల తోటలవెంటా, చిన్నచిన్న సందుల్లోనూ, పరుగులు పెడుతూ శ్రీశ్రీ వర్ణించినట్టు 'దేహధూళితో కచభారంతో" కుర్రాళ్ళు రికామిగా తిరిగే రోజులు. దాదాపు ప్రతి ఇంటా నలుగురేసి, ఆరుగురేసి పిల్లలు.

అదిగో ఆ రోజుల్లో మా ఊరు ఆంధ్రదేశంలో ఒక మిడిల్‌క్లాసు టౌను. మాఊరికి చుట్టుపక్కల ఏడెనిమిది పల్లెటూళ్ళ వాళ్ళు ఏవి కావలసినా మా ఊరు మీదనే ఆధారపడేవాళ్ళు.

మా ఊళ్లో ఇస్కూలు చాలాపెద్దది. బ్రహ్మాండమైన బిల్డింగు. దానికి సరిపడా ఏడెనిమిది వందల మేర స్టూడెంట్సు, మాస్లర్లు కూడా పాతికకు పైమాటే. బోటనీ, జువాలజీలకొకటి, ఫిజిక్సు, కెమెస్ట్రీలకు చెరొకటి లాబొరేటరీలుండేవి. చదవాలేగాని, గుండెలు బద్దలైపోయేటంత లైబ్రరీ ఉండేది. పెద్ద 'ప్లేగ్రవుండు' 'రా, రా' అని పిలుస్తూండేది. ఇదంతా బాహ్యస్వరూపం. ఇక అంతరంగ విషయానికొస్తే, మా ఇస్కూలు హెడ్మాస్టర్లు ప్రతిఒక్కరూ గ్రీష్మసూర్యుళ్ల లాగుండేవారు. తెల్లటి పంచెమీద 'కమీజు' టక్-అప్ చేసి ఆపైని కోటుధరించి అందుమీద నూకాలమ్మ జాతరలో పోతురాజు భుజంమీద ధరించే కమ్చీనిపోలిన కండువా మడతను భుజంమీద వ్రేలాడేయడమో లేదా పరమశివుడు మెడకు చుట్టుకునే పాములాగా జమీకండువా మడత ధరించడమో చేసేవారు. చేతిలో, చివర రబ్బరు తొడుగున్న పొడవాటి పేము బెత్తం వహించేవారు. మా ఇస్కూల్లో తరచుగా హెడ్మాస్టర్లు, లెక్కలమాస్టర్లు కూడా అవుతుండడం వల్ల, మాకు ఇనుమిక్కిలి భయంగా ఉండేది. మరీ పాతకాలంలో వారు తలపాగాలు కూడా ధరించే వారటగాని మా కాలానికి లేవు.

మా ఇస్కూలు చరిత్రలో మూడు ముఖ్యవిషయాలు చెప్పదగినవి ఉన్నాయి. ఒకటి: విద్యా వైభవం, రెండు: క్రీడావైభోగం, మూడు: సాంస్కృతిక వికాసం.

మొదటి విషయానికొస్తే స్కూలు అసెంబ్లీ పూర్తి కాగానే, ఎవరిక్లాసుల్లోకి వాళ్ళం వెళ్ళే వాళ్ళం. ఫస్టుఫారం నుంచి థర్డుఫారం వరకు ఉన్న స్టూడెంట్స్ కంటే, ఫోర్తుఫారం నుంచి స్కూలు ఫైనలువరకు ఉండే స్టూడెంట్స్‌కి హోదా ఎక్కువ. మేం క్లాసుల్లో స్థిరపడి, మాస్టర్లు పాఠాలు ప్రారంభించిన సుమారు పావు గంట తరువాత, మా హెడ్‌మాస్టరుగారు, స్కూలు ప్యూను వెంట అనుసరించగా, చేతిలో రబ్బరుతొడుగు పేముబెత్తం ఝుళిపిస్తూ, రవుండ్లకు వచ్చేవారు. అలా తిరుగుతూ వరండాలో, క్లాసు తలుపుచాటుగా నక్కి విహంగ విలోకనం చేసేవారు. సవ్యంగా స్టూడెంట్సుకీ మాస్టర్లకీ సామరస్యం కుదిరివుంటే సరే, లేకపోతే హఠాత్తుగా సర్జికల్ స్ట్రైక్ జరిపేవారు. అందరూ అదిరిపడేలాగా క్లాసులో ప్రవేశించి నేరుగా 'ట్రబుల్ మేకర్' సన్నిధికివెళ్ళి రెండుతగల్నిచ్చి బెంచీ ఎక్కించేవారు. పాఠం ధ్యాసలోపడి క్లాసులో ట్రబుల్‌ని గమనించుకోని మాస్టర్ని, ఇంగ్లీషులో హెచ్చరించి, "ఐ డోంట్ వాంట్ దిస్ అగైన్" అనేసి వెళ్ళిపోయేవారు.

మా ఇస్కూల్లో మాస్టర్లందరూ వారివారి సబ్జెక్టుల్లో నిజంగా మాస్టర్సు. అయితే ఆ కాలపు ఆచారంగా లెక్కలమాస్టర్లు సైన్సుమాస్టర్లు క్రూరంగా ఉండేవారు. సెలవులొస్తేచాలు. అభ్యాసాలకు అభ్యాసాలు లెక్కలు హోంవర్కు ఇచ్చేవారు. సైన్సు మాస్టర్లయితే ల్యాబ్‌వర్కు బుక్కుల్లో తేడాలొస్తే క్షమించేవారుకాదు. లోయర్ ఫారమ్స్ కుర్రాళ్లనైతే ఎండలో నిలబెట్టడం, హయ్యర్‌ఫారమ్స్ వాళ్లనైతే "మీ ఫాదర్‌ని ఒకసారి కనపడమను" అని బెదిరించడం చేస్తూండే వారు.

స్కూల్లో మాకున్న ఊరటల్లా తెలుగుమాస్టర్లు, డ్రిల్లు మాస్టర్లూను.

డ్రిల్లు ప్రస్తావన వచ్చింది కనక క్రీడావైభోగం గురించి చెప్పాలి. మా స్కూల్లో, అరుదైన అమెరికన్ బేస్‌బాల్‌తోసహా చాలా ఆటలుండేవి. ఇసుకలో మాగ్నెట్‌ని ఆడిస్తే ఇనపరజను అతుక్కునే మాదిరి, కొందరు దృఢకాయులు డ్రిల్లుమాస్టర్లని అతుక్కుని ఉండేవారు. వాళ్ళకి ప్రత్యేకహోదా ఉండేది. బ్యాడ్మింటన్, వాలీబాల్‌నెట్లు కట్టడం, ఫుట్‌బాల్స్ లోపలి తిత్తులకు గాలిపట్టి, లేసులు బిగించడం, బేస్‌బాల్ గ్రవుండు ప్రిపేర్ చేయడంవంటి విశేషచర్యలకు వాళ్లకే అవకాశాలుండేవి. గ్రిగ్‌స్పోర్ట్స్ అనబడే 'ఇంటర్ – డిస్ట్రిక్ట్' క్రీడోత్సవాల సందర్భంగా మా స్కూలు టీములకి ప్రత్యేక డ్రెస్సులుండేవి. డ్రస్సుల రంగులమీద వ్యామోహం ఉన్నా, క్రీడల్లో దెబ్బలు తగులుతాయనే విరక్తివల్ల నాబోటి కళాకారులు కొందరం ఆ ఉత్సవాలు చూసి ఆనందించే వాళ్లం.

ఇంకో విషయం చెప్పాలి. మా మాస్టర్లు ఎప్పుడూ 'ఒరేయ్' అని ఇంటిపేరుతోనో, నిక్‌నేమ్‌తోనో మాత్రమే మమ్మల్ని పిలిచేవారు. అప్పుడప్పుడు 'ఒరేయ్ నండూరీ, తాతబ్బాయి కొట్టుకెళ్లి గోలీసోడా తీసుకురా' వంటి సొంతపనుల్ని కొందరు 'ఎంపుడు స్టూడెంట్లకి' పురమాయించే వారు. వాడు సోడా కాయని 'ఓపెనర్'తో సహా తెచ్చి, రబ్బరు ముక్క జోడించి ప్రేయసి ముద్దుపెట్టుకున్నంత చప్పుడుతో 'తెరిచే'వాడు. పొగలు లేచే గోళీసోడాని గురువుగారు గ్రోలుతూంటే నండూరి వాడి మొహం తృప్తిగా వెలిగిపోయేది.

ఇక సాంస్కృతికరంగం మాట. మా ఇస్కూల్లో ఏటా వార్షికోత్సవాలు బ్రహ్మాండంగా జరిగేవి. దేశంలో గొప్పరచయితలొచ్చి ఉపన్యాసాలిచ్చేవారు. రకరకాల పోటీలలో, 'కళాకారులు'గా పేరుపడ్డవాళ్లం కప్పులు, సర్టిఫికెట్లు కొట్టుకొస్తుండే వాళ్లం. ఇంగ్లీషుమాస్టార్లూ, తెలుగు మాస్టారూ, నాటకాలు వేయించేవారు. ఫాన్సీ డ్రెస్సుల ముచ్చటలో 'ముష్టి' వేషానికి బాగా, గిరాకీ ఉండేది. మరేం ప్రత్యేకత లేదు. ప్రేక్షకుల్లో కొందరు ఉదారులు డబ్బులు వేసేవారు. సాంస్కృతిక రంగంలో మరో ముఖ్యవిషయం: స్కూల్లో 'లా



అఫైర్స్'కి పెద్దగా అవకాశాలుండేవి కావు. నాన్న భయం, హెడ్‌మాస్టరు భయం తీవ్రంగా ఉండేవి. అయితే 'లా అఫైర్‌లే' లేకపోతే ఇక సాంస్కృతికవికాసం ఎక్కడ? అనే నమ్మకంతో నా వరకు నేను, మా హనుమంతరావుగాడితో సంయుక్తంగా ఒక 'గ్రూపు'గా ఉన్న నలుగురు అమ్మాయిల్ని రైల్వేవాళ్ల ఆర్.ఎ.సి. పంపిణీ మీద ప్రేమించాం. ఆనక ఎవరో ఒకర్ని ఖాయం చేసుకోవచ్చునని. అయితే నా భయం నాకు ఉండేది. మా వీధిలో ఒక స్థానికమైన "కేసులో" ఇరుక్కున్న నన్ను మా అమ్మ 'భయభ్రాంతులకు' గురిచేసిన కారణంగా నేను 'క్రియాశీలక ప్రేమ వ్యవహారం'లో చురుకుగా పాలు పంచుకోలేకపోయాను.

ఏమైతేనేం మా ఇస్కూలు మమ్మల్ని 'ఖాయిదా'లో పెట్టింది. చదువునేర్పింది, ఆటలాడించింది.

ఇదిగో, నన్ను ఇలా తయారుచేసింది.

నవ్య

# అన్వేషణ

8

-సలీం

**శిరీషగారితో పరిచయమయ్యాక మోహిత్ గదికెళ్ళడం బాగా తగ్గించాను. సాయంత్రం కావడం ఆలస్యం శిరీష వాళ్ళింట్లో వాలిపోవటం, ఎన్నో విషయాలు గురించి చర్చించుకోవడం దినచర్యగా మారింది.**

**ఆరోజు చర్చ మానవ జీవితానికి అర్థం ఏమిటనే విషయం మీదికి మళ్ళింది.**

**"దాన్ని తెలుసుకోవడం కోసమే ఎంతోమంది మహానుభావులు తమ జీవితాన్ని ధారపోశారు. సాధారణంగా లభ్యం కాని మానవజన్మ ఎత్తి భగవంతుణ్ణి తెలుసుకోలేని మనిషి పుట్టుక నిరుపయోగం అన్నాడు రామక్రిష్ణ పరమహంస. ఆయన ఉద్దేశంలో జీవితానికి అర్థం పరమాత్మను తెలుసుకోవడమే! భగవద్గీతలో సచ్చిదానందమే జీవిత పరమార్థం అని చెప్పబడింది" అంది శిరీష.**

"మీ ఉద్దేశంలో జీవిత పరమార్థం ఏమిటి?"

"అద్వితీయమైన ప్రేమని పొందటం, అంతులేని శాంతిని, సంతోషాన్ని అనుభవించటం."

"ఇందాక మీరు రామక్రిష్ణ పరమహంసని కోట్ చేశారు. మీరు దేవుణ్ణి నమ్ముతారా? దేవుణ్ణి అన్వేషించడం, కనుక్కోవడం, ఐక్యం కావడం... ఇవేనా జీవిత లక్ష్యాలు?"

"నేను దేవుణ్ణి నమ్మను. తలరాతను నమ్మను. జోసెఫ్‌ని పెళ్ళి చేసుకోవడమనేది నా ఛాయిస్. ఈ విషయంలో నాకేమీ పశ్చాత్తాపం లేదు. నేనేమీ దుఃఖపడటం లేదు. జోసెఫ్ ప్రేమను పొందడంలోనే నా జీవితానికి సార్థకత ఉందనుకున్నాను. అందులోనే సంతోషాన్ని వెతుక్కున్నాను. నా ఉద్దేశంలో జీవితానికి అర్థం అంటూ ప్రత్యేకంగా ఏమీ ఉండదు. మనం కల్పించుకోవాలి."

"అలా కాదు. మేధావులు, తత్వవేత్తలు ఈ విషయం గురించి మథనపడి ఏదో ఓ అభిప్రాయానికి వచ్చారుగా. వాటిని తెలుసుకుని చర్చించి, మనమూ ఓ నిర్ణయానికి రావచ్చు."

శిరీష నవ్వింది. "ఫిలాసఫీ చదువుతున్నావుగా... నువ్వే చెప్పాలి."

"జీవితాన్ని శోధించకపోతే అది నిరర్ధకం అంటాడు సోక్రటీస్. ప్లాటోనిజం ప్రకారం జీవితానికి అర్థం సమున్నతమైన జ్ఞాన సముపార్జన. అరిస్టాటిల్ ఉద్దేశంలో జీవితోద్దేశం సేవ చేయడం, ఇతరులకు మంచి చేయడం. సోక్రటీస్ శిష్యుడొకడు సినిసిజం అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. జీవిత పరమార్థం నీతిగా, ప్రకృతి నియమాలకు లోబడి బతకటమే. దుఃఖం అనేది తప్పుడు నిర్ణయాల వల్ల కలుగుతుందంటాడు. ఏది ముఖ్యమో ఏది కాదో నిర్ణయించుకోవటంలో మనిషి చేసే తప్పుల వల్లే కష్టాలు వస్తాయంటాడు. వస్తు వ్యామోహం, ధనాన్ని పోగేయడం, కీర్తికోసం పాకులాడటం వంటి వాటికి దూరంగా బతకమంటాడు".

"హిందూమతం ఏం చెప్తుందో తెలుసా? జీవితానికి అర్థం 'కర్మ సిద్ధాంతం'తో, పుట్టుక, చావు, తర్వాత మోక్షంతో ముడిపడి ఉంది. జీవితం యొక్క

## జరిగిన కథ

రామక్రిష్ణ తల్లి వసుధ ఎవరితోనో వెళ్ళిపోతుంది. తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడు. దాంతో రామక్రిష్ణ బాధ్యతను వాళ్ళ పెదనాన్న తీసుకుంటాడు. ఒంగోలు కాలేజీలో డిగ్రీలో చేరిన రామక్రిష్ణ, మోహిత్‌తో స్నేహం చేస్తాడు. మోహిత్ ఎక్కువగా సుఖాల గురించి, అమ్మాయిల గురించే మాట్లాడటం రామక్రిష్ణకి నచ్చదు. ఒకరోజు కాలేజీనుంచి ఇంటికెళుతుండా వర్షం పడుతుంది. ఓ ఇంటిముందు ఆగిన రామక్రిష్ణకి శిరీష పరిచయమవుతుంది.

ఆ తర్వాత....



ఉద్దేశం ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాల్ని సాధించడమే."

"క్రిస్టియానిటీ ప్రకారం జీవితం ఉద్దేశం దేవుడి దయకు పాత్రులు కావడమే. ప్రభువుని ధ్యానించి పూజించటమే మనిషి జన్మకు సార్థకత. దేవుడు నన్నెందుకు సృష్టించాడు? అనే ప్రశ్నకు జవాబుగా 'ప్రభువుని తెలుసుకోడానికి, అతన్ని ప్రేమించడానికి, అతన్ని ఈ లోకంలో పూజించడానికి, పరలోకంలో ప్రభువుకి ప్రేమపాత్రుడు కావడానికి" అంటారు.

"ఇస్లాం కూడా అంతే రామక్రిష్ణా. మనిషి పుట్టిందే అల్లాని ప్రార్థించడానికి. ఖురాన్ ప్రకారం మనుష్యులకి ఈ లోకంలో పుట్టుక ఓ పరీక్ష మాత్రమే. అల్లా పెట్టే పరీక్షలో ఉత్తీర్ణులైతే స్వర్గం, లేకపోతే నరకం" అంది శిరీష.

మా చర్చ చాలాసేపు నడిచింది. మాటల్లో పడి సమయం ఎంతయిందో కూడా గమనించలేదు. అప్పటికే తొమ్మిది దాటిపోయింది.

"ఆకలి కూడా మర్చిపోయి మాట్లాడుకున్నాం కదూ" అంది శిరీష.

"నేనిక వెళ్తాను" అంటూ లేచి నిలబడ్డాను.

"ఉండిపోకూడదూ... మన సంభాషణ సగంలోనే ఆగిపోయింది. చర్చించాల్సిన చాలా విషయాలు మిగిలే ఉన్నాయి" అంది.

నాకూ ఉండిపోవాలనే ఉంది. శిరీషగారితో మాట్లాడుతుంటే చాలా విషయాలు తెలుస్తున్నాయి. ఆమె ఆలోచనల్లో పరిపక్వత ఉంది. జీవితం గురించి లోతైన విశ్లేషణ చేయగల సమర్థురాలు. ఇంటికెళ్ళి కూడా చేసేదేముంది? తిని పడుకోవటం. పడుకునే ముందు కాత్యాయని చేసే అర్థరహితమైన వాగుడుని భరించడం.

అత్త అడిగితే ఏమని చెప్పాలా అని ఆలోచించాను. శిరీష వాళ్ళింట్లో పడుకున్నానంటే కాత్యాయని నానా రభస చేయటం ఖాయం. మోహిత్ గదిలో పడుకున్నానని అత్తతో చెప్పాలని నిర్ణయించుకుని రాత్రికి అక్కడే ఉండిపోయాను.

అర్ధరాత్రి వరకూ మాట్లాడుకున్నాం. ఇంట్లో ఒకటే మంచం ఉంది. నేను హాల్లో సోఫాలో పడుకుంటానన్నాను. తను వినలేదు. నాకు పడక మంచం మీద ఏర్పాటుచేసింది. తను హాల్లోకెళ్ళి పడుకుంటుందనుకున్నాను. నా మంచం పక్కన చాప పరుచుకుని పడుకుంది. మనసులో ఏ రకమైన కల్మషం లేనివాళ్ళే అలా చేయగలరు.

ఉదయం తను చేసిన పెసరట్లు తినేసి కాలేజీకి వెళ్ళిపోయాను. కాలేజీలో మోహిత్ కలవలేదు. సాయంత్రం కాలేజీ వదిలాక శిరీష దగ్గరకు వెళ్ళకుండా నేరుగా అత్తవాళ్ళింటికి వెళ్ళాను.

అత్త మొహం అదోలా కనిపించింది, గంటు పెట్టుకున్నట్టు. కాత్యాయని కళ్ళల్లో కోపం.

"రాత్రి ఎక్కడున్నావు బావా?" అని అడిగింది కాత్య.

"మోహిత్ రూంలో" అన్నాను.

కాత్యాయని వాళ్ళమ్మ వైపు కళ్ళెగరేసి 'చూశావా?' అన్నట్టు సైగ చేసింది.

"అబద్ధాలు చెప్పటం కూడా నేర్చుకున్నావా? ఆ మహాతల్లి వల్ల నువ్వెంత పతనమవుతున్నావో అర్థమవుతోందా?" అంది అత్త.

"ఏ మహాతల్లి వల్ల?"

దానికి సమాధానం కాత్యాయని చెప్పింది. "బావా... నువ్వు రాత్రి మోహిత్ గదిలో పడుకోలేదు. నేను రాత్రి పదిన్నరకి మోహిత్‌కి ఫోన్ చేసి తెలుసుకున్నా. అక్కడికి వెళ్ళలేదని తెలిసి అమ్మ కంగారుపడింది. నేను మళ్ళీ మోహిత్‌కి ఫోన్‌చేసి ఎక్కడికి వెళ్ళి ఉంటాడని అడిగా. 'భయపడాల్సిందేమీ లేదు. వాడు తప్పకుండా శిరీష వాళ్ళింటికెళ్ళి ఉంటాడు. అక్కడే పడుకుని ఉంటాడు' అంటూ అదోలా మాట్లాడాడు."

"నా మీద నిఘా పెట్టారన్నమాట. నేనేమీ ఆడపిల్లను కాను, ఆంక్షలు విధించడానికి" కోపంగా అన్నాను.

"మగపిల్లాడివి కాబట్టి నువ్వు ఎక్కడ తిరిగొచ్చినా ఊరుకోమంటావా? నువ్వు నా అన్న కొడుకువి. చెడిపోతుంటే చూస్తూ ఊరుకోలేను" అత్త కూడా కోపంగా అంది.

"నేను చెడిపోతున్నానని నువ్వనుకుంటే సరిపోదు. నేనేం చిన్నపిల్లాడిని కాను. నాకూ తెలుసు. ఏది మంచో ఏది చెడో" అన్నాను.

"ఈ గొడవంతా దేనికి? ఆమె దగ్గరకెళ్ళటం మానేయ్ బావా. అందరూ మీ గురించి ఎంత చెడ్డగా అనుకుంటున్నారో తెలుసా!" అంది కాత్యాయని.

"ఎవరో ఏదో అనుకుంటున్నారని నేనెందుకు మానేయాలి? మానను. నా ఇష్టప్రకారం జీవించే హక్కు నాకుంది."

"నా అన్న కొడుకు దారి తప్పుతుంటే మందలించి మంచిమార్గంలో పెట్టే హక్కు నాక్కూడా ఉంది" అంది అత్త.

"దారి తప్పినప్పుడు నువ్వలా మందలించినా



సహిస్తా. కానీ ఏ తప్పు చేయకుండానే దోషిగా నిలబెడితే ఊరుకోను."

"పరువుగల ఆడది చేసే పనులేనా ఇవి? మొగుడు లేడు కదా అని వయసులో ఉన్న మగ పిల్లాణ్ణి ఇంట్లో పడుకోబెట్టుకోవడం తప్పు కాదా? నిన్ను కాదు. ఆవిడని అనాలి. వయసు మళ్ళిన ఆడవాళ్ళు కుర్రవాళ్ళతో కులకడానికి ఉబలాటపడ్తారటగా.. రేపు నేనే వెళ్ళి దాన్ని నాలుగు దులిపేసి వస్తాను" అంది అత్త.

"ఆమెను ఒక్కమాటన్నా ఊరుకోను" అన్నాను కోపంగా.

ఈలోపల మామ కూడా కల్పించుకున్నాడు. "రేపు నా కూతుర్ని చేసుకోవాల్సిన వాడివి. ఇలా వేరే ఆడవాళ్ళతో తిరిగితే మా పరువేం కాను?" అన్నాడు.

"నేను మీ కూతుర్ని చేసుకుంటానని ఎప్పుడూ అన్లేదే" అన్నాను.

"నువ్వు ఇంటల్లుడివి అవుతావనే కదా, నిన్ను తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాం" అన్నాడు.

నాకు చాలా కోపం వచ్చింది. "నాకేమీ గతిలేక మీ ఇంటికి రాలేదు. అత్త బతిమాలితేనే వచ్చాను. మీ ఇంట్లో తేరగా ఏమీ తినడం లేదు. నెలకింతని మీకు చెల్లించి ఉంటున్నాను. ఇష్టం లేకపోతే చెప్పండి. ఈ క్షణమే వెళ్ళిపోతాను" అన్నాను.

"చూశారా... నన్ను పూటకూళ్ళమ్మని చేశాడు వీడు? అన్న కొడుకని కదా అభిమానంతో ఇంట్లో పెట్టుకున్నాను. వాడి డబ్బులు ఆశించానా? వద్దనే అన్నాగా. బలవంతంగా ఇస్తోందే కాక ఎన్నెన్ని మాటలంటున్నాడో చూశారా?" అంది అత్త ఏడుస్తూ.

"ఆ అమ్మకు పుట్టిన కొడుకేగా... ఎక్కడికెళ్తాయిలేకి బుద్ధులు" అన్నాడు మామ.

చేతిలో ఉన్న పుస్తకాల సంచిని కిందికి విసిరి కొట్టాను. అసలు ఈ సంచితో వాడి మొహం పగల కొట్టాలన్నంత కోపం వచ్చినా బలవంతంగా ఆపుకున్నాను.

"మా అమ్మ విషయం ఎత్తావా మర్యాద దక్కదు. మా అత్త మొగుడివని కూడా చూడను. ఏం చేస్తానో నాకే తెలియదు" అన్నాను.

కాత్యాయని ముందుకు వచ్చి "నాన్నా... నువ్వు మాట్లాడకు. ఏది ఎక్కడ మాట్లాడాలో తెలియదు నీకు" అంటూ వాళ్ళ నాన్నని కసురుకుని నన్ను గదిలోకి లాక్కెళ్ళింది.

నా కోపం తగ్గలేదు. ఇన్నాళ్ళూ బయటివాళ్ళే కాట్లకుక్కల్లా నా వెంటబడి తరుముతున్నారనుకున్నాను. ఇప్పుడు ఇంట్లోవాళ్ళు కూడా అంటున్నారు.

"సారీ బావా... నాన్న మాట్లాడింది తప్పే! ఆయన తరపున నేను సారీ చెప్తున్నాను" అంది కాత్యాయని.

"ఒక్కమాట నిజం చెప్పు. నీతో ఎప్పుడైనా నేను సన్నిహితంగా మెలిగానా? పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చానా?"

"అలా చేయటం లేదనేకదా బావా నా బాధ. నీకు నేనంటే ఇష్టం లేదా చెప్పు? నన్ను పెళ్ళి చేసుకోవా?"

"చేసుకోను"

"ఎందుకు? నాలో ఏం తక్కువని? అందంగా లేనా... చదువుకోలేదా.. నాకు నువ్వంటే పిచ్చి ప్రేమ బావా.. నేనంటే ఎందుకంత అయిష్టత?"

"నువ్వు ఇష్టం లేక కాదు. నాకు పెళ్ళంటేనే ఇష్టం లేదు."

"ఎందుకిష్టం లేదు? పెళ్ళంటే విముఖత కలగడానికి ఏదో ఓ కారణం ఉండాలిగా."

"ఏమో తెలియదు. నేను పెళ్ళి చేసుకోను."

"అందరూ ఆమోదించే వ్యవస్థ పెళ్ళి. ప్రతి ఒక్కరి జీవితంలో పెళ్ళి చాలా ముఖ్యమైన ఘట్టం బావా... సంసారం అంటూ లేకపోతే బతుక్కి అర్థం ఏం ఉంటుంది?"

"జీవితానికర్థం ఇంత పరిమితమైందని నేననుకోను. మనిషి జన్మకు వేరే అర్థం ఏదో ఉంటుంది. అది పెళ్ళీ, పిల్లలూ మాత్రం కాదు".

"బావా, నా మాట విను. నేను నీ మీదే ఆశలు పెట్టుకుని ఉన్నాను. నీకు నిజంగా ఆవిడంటే.. అదే... శిరీష ఇష్టమైతే వెళ్ళు. నీ ఇష్టాల్ని కాదనను. కాని నన్ను మాత్రం పెళ్ళి చేసుకో."

"నువ్వు కూడా అలా అంటావేమిటి కాత్యా? శిరీషగారు చాలా మంచివారు. నాకు గురువు లాంటి స్త్రీ. అంత తప్పుగా మాట్లాడటానికి నీకు మనసెలా ఒప్పుతోంది?"

"బావా... నువ్వు ఎన్నయినా చెప్పు. ఒక ఆడ, ఒక మగ మధ్య ఉండేది శారీరక ఆకర్షణే. పైకి ఎన్ని ముసుగులైనా కప్పుకోనీ.. గౌరవం అనుకో, ఇష్టం అనుకో, స్నేహం అనో ప్రేమ అనో అనుకో. కానీ అంతర్లీనంగా ఉండే కోరిక ఒకటే. శారీరక

**ఇద్దరూ అర్ధరాత్రి వరకూ మాట్లాడుకున్నారు. ఇక వెళతానని లేచాడతను. కానీ ఆమె మాత్రం ఉండిపోకూడదూ... సంభాషణ సగంలోనే ఉంది కదా అంది. ఆలోచనలో పడ్డాడతను. వెళ్ళాలా వద్దా అన్న మీమాంస అది. ఏదయితే అదయిందని ఆ రాత్రి అక్కడే ఉండిపోయాడు. ఆ తరువాత అతను ఎలాంటి పరిణామాలు ఎదుర్కొన్నాడు?**

వాంఛ. మన శరీరం ఒక బయోకెమికల్ యంత్రం. హార్మోన్లు పనిచేస్తున్నంత కాలం కోరికలుండటం సహజం బావా. నిన్ను తప్పు పట్టను."

"మనిషి యంత్రం కాదు. అతనో బుద్ధి జీవి. ఆలోచనలతో పాటు ఆత్మ ఉన్న వ్యక్తి. శారీరక వాంఛ అనేది పశు ప్రవృత్తి.

"పిచ్చి బావా... నీకు గురువే కావాలనుకుంటే ఆమె తప్ప మగవాళ్ళెవ్వరూ తారసపడలేదా? ఆవిడ టీచర్ కదా. తన శిష్యరికం చేయడానికి ఆడపిల్లలే దొరకలేదా? అదే ఆడా మగా మధ్య ఉండే మ్యాజిక్."

"ప్లీజ్ కాత్యా! శిరీషగారి గురించి అలా మాట్లాడితే నేనూరుకోను."

"కానీ అది నిజం బావా, పచ్చి నిజం. దాన్నెందుకు ఒప్పుకోవు."

"ప్లీజ్! నా గదిలోంచి వెళ్ళిపో కాత్యా. కొద్దిసేపు ఒంటరిగా ఉండనీ, నా మనసేం బాగోలేదు."

"నీ మనసు బావుండాలనేగా నా ఈ ప్రయత్నమంతా" అంది నుదుటి మీద చేయి వేస్తూ.

"నువ్వు వెళ్ళకపోతే నేనే బయటికి వెళ్ళిపోతాను" అంటూ మంచం మీదనుంచి లేచాను.

"సరే బావా... నీ ఇష్టం" తలుపు దగ్గరగా వేసి కాత్యాయని వెళ్ళిపోయింది.

లైట్ తీసేశాను. చీకటి. నాకిష్టమైన చీకటి. నా జీవితం నిండా పర్చుకుని ఉన్న చీకటి. నాకిప్పుడు వెలుతురు కావాలి. బాహ్య ప్రపంచాన్ని వెలిగించే వెలుతురు కాదు. లోపలి నుండి ప్రజ్వరిల్లే వెలుతురు. నా కణకణాన్ని వెలిగించే వెలుతురు. నా ఆత్మకు దివిటీలా దారి చూపే వెలుతురు.

***

మరునాడు కాలేజీకెళ్ళలేదు. సూట్‌కేస్‌లో నా బట్టలు, పుస్తకాలు సర్దుకుని వెళ్ళబోతుంటే అత్త "ఎక్కడికెళ్తున్నావు?" అని అడిగింది.

"నేను బయట రూం తీసుకుని ఉండాలని నిర్ణయించుకున్నానత్తా" అన్నాను.

"నీ మేనత్తగా ఓ మాట అనే అధికారం నాకు లేదా? సంసారం అన్నాక మాటా మాటా అనుకోరా? దానికే అలిగి ఇలా వెళ్ళిపోవాలా?" ఏడుస్తూ అంది అత్త.

"నేనెవరిమీదా అలిగి వెళ్ళటం లేదత్తా. నాకెవరి మీదా కోపం లేదు. నాకు స్వేచ్ఛ కావాలి. ఒకరి ఆజమాయిషీలో ఇమడలేను."

"పెద్దదాన్ని కాబట్టి నా అన్న కొడుకువన్న చనువుతో ఏదో అన్నానే అనుకో. దాన్ని మందలించడమనో, ఆజమాయిషీ చేయడమనో అనుకోవాలా?



బంధుత్వాలని బందీఖానాలు అనుకుంటే ఎలా?" అంది అత్త.

కాత్యాయని నా చేతుల్ని కలిపి గట్టిగా పట్టుకుంది. ఆమె కళ్లనిండా కన్నీళ్ళు. "వద్దు బావా... మమ్మల్ని వదిలి వెళ్ళకు. రోజుకు ఒక్కసారైనా నిన్ను చూడకుండా ఉండలేను బావా" అంది.

"నువ్వు ఆ ఇష్టాన్ని మరింత పెంచుకోకూడదనే వెళ్తున్నా" అన్నాను.

"నాకు తెలుసు నువ్వెందుకు వెళ్తున్నావో... అప్పుడు ఎవరింట్లో ఎన్నిరోజులు పడుకున్నా అడిగే వాళ్ళుండరని కదా" అన్నాడు మామ.

"నువ్వు మాట్లాడకు నాన్నా. నీ వల్లనే ఇదంతా" అంటూ కసురుకుంది కాత్యాయని. నా వైపు తిరిగి "బావా... నిన్ను బలవంతపెట్టి ఉండమనలేను. నిన్ను కట్టిపడేసే శక్తి నా ప్రేమకుంటుందని అపోహ పడ్డాను. నువ్వు సునాయాసంగా తెంపుకుని వెళ్ళిపోతున్నావు" అంది.

మోహిత్ రూంలో చేరాను. భోజనం కోసం మెస్‌లో డబ్బులు కట్టాను.

ఆ రోజు సాయంత్రం శిరీష వాళ్ళింటికెళ్ళినపుడు జరిగిన విషయం చెప్పాను.

"నువ్వు చేసిన మొదటి తప్పు అబద్ధం చెప్పడం. మనం తప్పు చేయనప్పుడు అబద్ధం చెప్పాల్సిన అవసరం ఏమొచ్చింది? నా ఇంట్లోనే పడుకున్నానని చెప్పాల్సింది. ఇంకా వివరాలడిగితే ఒకే గదిలో నీ మంచం పక్కన నేను చాప పరుచుకుని పడుకున్నానని చెప్పాల్సింది. నిజం చెప్పటంలో ఓ బలం ఉంటుంది. ఓ ధైర్యం ఉంటుంది."

"నిజం చెప్తే మెచ్చి, మేకతోలు కప్పే మనుషులనుకున్నారా? సంస్కార హీనులు. మీ ఇంట్లో పడుకున్నందుకే అంత తప్పుగా మాట్లాడారే.. ఒకే గదిలో మనం పడుకున్నామని తెలిస్తే ఇంకేమైనా ఉందా? ప్రళయం వచ్చేయదూ..."

"పరాయి వ్యక్తులు అలా మాట్లాడటంలో ఉద్దేశం 'తాము మాత్రమే పవిత్రులు, ఎదుటి వ్యక్తులే తప్పులు చేస్తారు' అని పదిమందికీ తెలియటం కోసం అలా నిందలు వేస్తారు. కానీ మనవాళ్ళు మాట్లాడటంలో ఉద్దేశాలు వేరుగా ఉంటాయి క్రిష్ణా. నీ మరదలికి నువ్వంటే ఇష్టం. ఆ ఇష్టంలోంచి పుట్టుకొచ్చిన అభద్రతా భావన. నువ్వెక్కడ తనకు కాకుండా పోతావోనన్న భయం. మీ అత్తామామలదీ అంతే. నిన్ను అల్లుణ్ణి చేసుకోవాలనుకుంటున్నారు. ఇంకెవరినైనా ఇష్టపడి తమ కూతురికి అన్యాయం చేస్తావేమో నన్న అనుమానం. వాళ్ళ కోణంలోంచి ఆలోచిస్తే వాళ్ళది తప్పనిపించదు. కోపం రాదు."

"నేను మీ అంత మంచివాడిని కానులెండి."

"ఇక్కడ మంచితనంకాదు ముఖ్యం. ఎంపతీ అంటారే... ఎదుటి వ్యక్తి అలా ఎందుకు మాట్లాడాడూ, అలా ఎందుకు ప్రవర్తించాడూ అని ఆలోచించగలిగితే అసలు మనుషుల మధ్య గొడవలే ఉండవు. ఏదేమైనా నువ్వు ఇంట్లోంచి బైటికి వచ్చి తప్పు చేశావు" అందామె.

రెండ్రోజుల తర్వాత మా పెదనాన్న, పెద్దమ్మ వచ్చారు. వాళ్ళను పిలుచుకొచ్చింది సుందరం. వాడికి మోహిత్ రూం అడ్రస్ తెలుసు. అత్త వీళ్ళకు ఫోన్ చేసి చెప్పి ఉంటుంది.

"అత్తతో పోట్లాడి వచ్చేశావటగా" అన్నాడు పెదనాన్న.

"నేనేమీ పోట్లాడలేదు పెదనాన్న. నా చదువు అక్కడ సరిగ్గా సాగటం లేదు. ఎప్పటి నుంచో రూం తీసుకుని ఉండాలనుకుంటున్నా, సందర్భం కలిసి వచ్చింది, అంతే" అన్నాను.

"అది నాకూ, మీ నాన్నకూ చెల్లెలు. నీమీద మీ నాన్నకు ఎంత అధికారం ఉంటుందో అంతే అధికారం తనకూ ఉంటుంది. నువ్వు వెళ్ళిపోయావని ఎలా ఏడుస్తోందో తెలుసా? నా కొడుకైతే ఇలా వెళ్ళిపోయే వాడా అని కుమిలి ఏడుస్తోందిరా?" అన్నాడు.

"ఇంతకూ ఎవరావిడ?" అని అడిగింది పెద్దమ్మ. ఆ ప్రశ్న వస్తుందని ఎదురు చూస్తున్నా.

"ఆమె స్కూల్ టీచర్. నాకంటే వయసులో చాలా పెద్దది పెద్దమ్మా. ముప్పయ్యేళ్ళ పైనే ఉంటాయి. బాగా చదువుకున్న స్త్రీ. మంచి సంస్కారవంతురాలు. మేము కలిసినప్పుడల్లా చాలా విషయాలు చర్చించుకుంటూ ఉంటాం. అంతే తప్ప అత్త అనుకునేలాంటి సంబంధమేమీ లేదు. అటువంటి సంబం

## మనమీదేనర్రోయ్!

సరసి





ధాలమీద నాకు ఆసక్తి కూడా లేదు పెద్దమ్మ" అన్నాను.

సుందరం కల్పించుకుని "ఒకవేళ ఆమె పదహారేళ్ళ పడుచుపిల్ల అయినా, తమ్ముడలా చేస్తాడంటే నేను నమ్మను. రామక్రిష్ణ మా తరంలో పుట్టాల్సిన వాడు కాదమ్మా. మీ అమ్మమ్మల కాలంలో పుట్టాల్సిన వాడు. వాడికి కొన్ని ఆదర్శాలు ఉన్నాయి. వాటిని ఆచరించడానికి అవసరమైన మానసిక స్థైర్యం ఉంది. వీడు నా తమ్ముడయినందుకు గర్వపడుతుంటానమ్మా" అన్నాడు.

నాకు వత్తాసుగా సుందరం మాట్లాడటం వల్ల అనుకుంటాను... పెద్దమ్మ, పెదనాన్న ఎక్కువగా క్లాస్ పీకలేదు.

"సర్లే... వచ్చేశావుగా. కానీయ్... అప్పుడప్పుడు వెళ్ళి అత్తను కలుస్తూ ఉండు. లేకపోతే చాలా బాధ పడుతుంది" అన్నాడు పెదనాన్న.

సరేనని చెప్పాను.

వాళ్ళు వెళ్ళడానికి బయల్దేరినప్పుడు "మీరు కిందికి దిగండి. నేనిప్పుడే వస్తాను. వీడితో మాట్లాడాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి" అన్నాడు సుందరం.

వీడు వాడి అమ్మానాన్నా ముందు నన్ను సపోర్ట్ చేసినట్టు మాట్లాడినా, నాకిప్పుడు క్లాస్ పీకడానికే ఉండిపోయాడనుకున్నా.

"చెప్పరా అన్నయ్యా... వింటాను" అన్నాను బుద్ధిమంతుడిలా తల కొద్దిగా వంచి.

"నీకంటే వయసులో పెద్దవాడినైనా నీకు చెప్పేంతవాడిని కాదని నాకు తెలుసులేరా! నిన్ను నేను కాక మరెవరు అర్థం చేసుకుంటారు? రేపు నీకు పెళ్ళయితే నీ భార్య కూడా నా అంత బాగా అర్థం చేసుకోలేదేమో" అన్నాడు.

"హమ్మయ్య! సంతోషంగా ఉందిరా అన్నయ్యా... ఇంతమందిలో కనీసం నువ్వొక్కడివైనా నన్ను సరిగ్గా అర్థం చేసుకున్నావు" అన్నాను.

"నీకో ముఖ్యమైన విషయం చెబుదామని, అమ్మావాళ్ళని వెళ్ళమని చెప్పాను. యునో... ఐ యాం ఇన్ లవ్" అన్నాడు మొహం నిండా వెలుతురు నింపుకుని.

"ఓ... ప్రేమలో పడ్డావన్నమాట. ఎవరా అమ్మాయి?"

"నా క్లాస్‌మేట్ చెల్లెలు. డిగ్రీ చదువుతోంది. పేరు అద్విత."

"పేరు చాలా బావుంది. మోడ్రన్‌గా."

"అమ్మాయి కూడా చాలా బావుంటుంది."

"అయితే తొందర్లోనే నాకు వదిన రాబోతుందన్నమాట."

"ఏమోరా... అందులో ఓ సమస్య ఉంది. అమ్మ ఒప్పుకోదేమో!"

"మన కులం కాదా?"

"మన కులమే. ఇంజనీరింగ్‌లో స్నేహాలన్నీ కులాల వారీగానే ఉంటాయి. మా క్లాస్‌లో మన కులం వాళ్ళు నాతో కలిసి ఐదుగురం ఉన్నాం. మేమంతా ఒక జట్టు. అద్విత నా స్నేహితుడి చెల్లెలు."

"మరి?"

"అద్విత వాళ్ళ మేనత్త..."

"ఆపేశావేం? చెప్పు. వాళ్ళ మేనత్త అడ్డు పడుతోందా?"

"కాదు. పాతికేళ్ళ క్రితం వాళ్ళ మేనత్త వేరే కులం వాడితో లేచిపోయిందట."

"లేచిపోవటం ఏమిటి? పెళ్ళి చేసుకుంది. అంతేగా... అందులో తప్పేం ఉంది?"

"అమ్మ ఒప్పుకోదు రామక్రిష్ణ. నీకు తెలుసుగా అమ్మకి ఇలాంటివంటే చాలా కోపం."

"అయినా ఇందులో ఆ పిల్ల తప్పేముంది? పాతికేళ్ళ క్రితం ఎవరో ఏదో చేశారని ఆ పిల్లని శిక్షించడం ఏం న్యాయం?"

"పెద్దవాళ్ళు మనలా ఆలోచించరు రామక్రిష్ణా..."

"నువ్వు మొదట నీ చదువు పూర్తి చేయి. తర్వాత మంచి ఉద్యోగం తెచ్చుకో. అప్పుడు అద్వితని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్టు ఇంట్లో చెప్పు. అడ్డు చెప్పారనుకో. వదిన్ని పెళ్ళి చేసుకుని కాపురం పెట్టు. రిజిస్టర్ మ్యారేజ్‌కి నేను సాక్షి సంతకం చేస్తాను" అన్నాను.

"అందుకేరా నువ్వంటే నాకిష్టం" అంటూ నన్ను కౌగిలించుకుని "ఉండు. నీకు కాబోయే మీ వదిన ఫోటో చూపిస్తాను" అని తన పర్స్‌లో దాచుకున్న ఫోటో తీసి నా చేతికిచ్చాడు.

ఆమె అందంకన్నా నన్నాకర్షించింది ఆ కళ్ళలో ఉన్న కరుణ.

"నువ్వు చాలా అదృష్టవంతుడివిరా అన్నయ్యా" అంటూ మనస్ఫూర్తిగా అభినందించాను.

సుందరం వెళ్ళాక చాలాసేపటివరకు అశాంతిగా గడిపాను. మనసులో ముళ్ళకంచెలు మొలిచినట్టు... దిగుళ్ళ గాయాలు. భూమి పొరల్లోపల పాతిపెట్టాననుకున్న జ్ఞాపకాలు ఎదురుగా నిలబడి దయ్యాల్లా భయపెడుతూ, శిలాజాలుగా మారినా కనురెప్ప పాటులో ప్రాణం పోసుకుని నా ప్రాణాల్ని తోడేసే చావంటూ లేని జ్ఞాపకాలు.

లేచిపోయింది అనే మాట వింటే చాలు, అమ్మ రూపం కళ్ళముందు మెదులుతుంది. నేనూ, నాన్నా పడిన అవమానాలు, భరించిన అవహేళనలు కళ్ళ ముందు సరికొత్తగా సాక్షాత్కరిస్తాయి. నాన్న అనారోగ్యం, చావు ఎప్పటికీ తెరపడని నాటకంలా కనిపిస్తూనే ఉంటాయి.

ఎప్పుడో పాతికేళ్ళ క్రితం... అద్విత పుట్టక ముందు ఆమె మేనత్త ఎవర్నో ప్రేమించి పెళ్ళి చేసుకుంటే అదిప్పుడు అద్విత పెళ్ళికి ఆటంకం కావడమే విషాదం. ఆమె మా అమ్మలా పెళ్ళి చేసుకున్నాక భర్తనీ, పిల్లల్నీ వదిలి మరొక వ్యక్తితో వెళ్ళిపోలేదే. అయినా సమాజం ఆ కుటుంబం మీద లేచిపోయిన దాని కుటుంబం అని పచ్చబొట్టు పొడవటం ఎంతవరకు న్యాయం? పాతికేళ్ళు గడిచినా అది శాపంలా ఆ ఇంట్లో పుట్టిన ఆడపిల్లల జీవితాల్ని శాసించటం ఎంతటి దుర్మార్గం?

సమాజం చాలా క్రూరమైంది. మానవమృగాలు తిరిగే అడవి ఈ సమాజం. పైకి మాత్రం సంస్కారవంతుల్లా ముసుగులు తొడుక్కుంటారు. అంతే.

సుందరం చెల్లెలు కీర్తిని చూసినప్పుడల్లా నాకు చెల్లెలు ఎందుకు లేదని అమ్మతో పోట్లాడేవాడిని. చెల్లెలుంటే ఎంత బావుంటుందో కదా అనిపించేది. గిల్లికజ్జాలు పెట్టుకోవచ్చు. జడ లాగి ఏడిపించవచ్చు. అన్నగా అథారిటీ చెలాయించవచ్చు. దర్జాగా కూచుని పనులు పురమాయించవచ్చు.

ఏ ఆట ఆడినా సుందరం, కీర్తి ఒక జట్టులా ఉండి నన్ను ఓడించేవారు. కారమ్స్ ఆడుతున్నప్పుడూ అంతే. తన అన్న గెలవాలని కాయిన్స్‌ని సుందరానికి అనుకూలంగా తెచ్చిపెట్టేది కీర్తి. పేకాట ఆడినా అంతే. సుందరానికి కావలసిన ముక్కలు వేసేది. ఒకసారి జోకర్ కూడా వేసేసి, పొరపాటున వేసేశాను అనేసింది.

'నాక్కూడా నీకో చెల్లెల్ని ఇవ్వాలని ఉండేదిరా. మీ అమ్మే పడనివ్వలేదు' అన్నాడోసారి నాన్న.

కూరగాయల ధరలతో పాటు అన్నీ ఎలా మండిపోతున్నాయో చూస్తున్నారుగా. చదువులు కూడా ఖరీదైపోయాయి. లక్షలు పెడితే తప్ప ఇంజనీరింగ్ డిగ్రీ చేతికి రాని రోజులు. ఒకర్ని పెంచితే చాల్లెండి" అంది అమ్మ.

ఇప్పుడు ఆలోచిస్తే అమ్మ పథకం ప్రకారం రెండో సంతానం వద్దనుకుందేమోనన్న అనుమానం వస్తోంది. ఇద్దర్ని వదిలి వెళ్ళటం కన్నా ముగ్గుర్ని వదిలి వెళ్ళటం కష్టం కదా.

ఆ ఆలోచనకే నాకు నవ్వొచ్చింది. సంఖ్య ముఖ్యం కాదుగా. అనుబంధం ఎంత బలంగా ఉందనేదే ముఖ్యం. అప్పుడు ఒక్కర్ని వదిలి వెళ్ళాలన్నా మనసు ఎదురు తిరుగుతుంది.

ఒకవేళ నాకే ఓ చెల్లి ఉండి ఉంటే... ఆ ఊహకే ఒళ్ళంతా భయంతో వణికిపోయింది. తల్లి మరో మగాడితో లేచిపోయిందని తెలిస్తే ఆ పిల్లకు పెళ్ళవుతుందా? ఎవరో మేనత్త తను ఇష్టపడిన వ్యక్తిని చేసుకున్నందుకే సమాజం కాట్లకుక్కలా ఆ పిల్ల వెంటపడి తరుముతోందే... మరి మా అమ్మ చేసిన నిర్వాకానికి నా చెల్లెలికి సంబంధాలొచ్చేవా? అది మానసికంగా ఎంత నరకం అనుభవించేదో కదా.

నాకు చెల్లెలు లేనందుకు చాలా సంతోషమనిపించింది.

**(ఇంకా వుంది)**

## తెనాలి విశిష్టత

*"తెనాలిలో పెళ్ళి పత్రికలు ముమ్మరం అయిన రోజులవి. తెలంగాణలో రైతుకూలీ పోరాటాలు ఉధృతమవుతున్న స్థాయిలోనే తెనాలిలో భ్రష్ట సెక్స్ సాహిత్యం ముమ్మరం అయింది. శారద నేనూ (ఆలూరి భుజంగ రావు) ఇంకా చాలా మందిమి అలాంటి కథలు వ్రాశాం. చౌడేశ్వరీదేవి, భరద్వాజ ఒకరేమిటి చెత్త కుండీ మీద ముసిరే ఈగల్లా అలాంటి బూతు కథలు, రాసే కథకులు తయారయ్యారు. వాళ్లకు ప్రోత్సాహాన్నిచ్చే పత్రికలు, రేరాణి, అభిసారిక. వీటిని నడిపిన పెద్దలు, 'రాడికల్ హ్యూమనిస్ట్ సిద్ధాంతాన్ని మెచ్చేవారన్న విషయం మరువరానిది" అని 'సాహిత్యబాటసారి శారద' పుస్తకంలో ఆలూరి భుజంగరావు పేర్కొన్నారు.*



*సేకరణ: ఎస్.తారకరామారావు*






## అడల్ట్ స్కూల్!

సంపాదన, పోటీతత్వం, కెరీర్ ధ్యాసలో మనిషి జీవితం యాంత్రికంగా తయారైంది. బంధాలు, బాధ్యతలు, ప్రణాళికలు కరువయ్యాయి. సరిగ్గా ఇదే అంశాన్ని రాచెల్ వెయిన్‌స్టీన్, క్యాటీ బ్రైనెల్లె తమకు అనుకూలంగా మార్చుకున్నారు. ఇద్దరూ కలిసి 'ది అడల్టింగ్ స్కూల్'ని ఏర్పాటు చేశారు. అమెరికాలోని పోర్ట్‌లాండ్‌లో ఏర్పాటుచేసిన ఈ స్కూల్లో కుటుంబపరమైన అంశాలు, సామాజిక అంశాలపై అవగాహన కల్పిస్తారు. అంటే సమయాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలి? డబ్బును ఎలా ఆదా చేయాలి? ఇతర మార్గాల ద్వారా ఆదాయం ఎలా సమకూర్చుకోవాలి? బంధువులతో సఖ్యతగా ఎలా మెలగాలి? ఖర్చుల జాబితా ఎలా తయారు చేసుకోవాలి? వంటి అంశాలన్నమాట. సెమినార్లు, వెబ్ తరగతుల ద్వారా టీనేజర్ల నుంచి మధ్య వయస్కుల వరకు అందరికీ కుటుంబ బాధ్యతలు, అవసరాలపై అవగాహన కల్పిస్తున్నారు. ఇందుకోసం ఒక్కో వ్యక్తి నుంచి 30 డాలర్లు ఫీజుగా తీసుకుంటున్నారు. కాలం మారుతోంది అంటే ఇదేగాబోలు!

## పెప్పర్

మనిషి ఆధునిక జీవనశైలిలో రోబోలు ఒక భాగంగా మారుతున్నాయి. మొన్నామధ్య ఓ చర్చిలో ఫాదర్‌గా రోబోను ఉంచారు. పోలీస్ ఉద్యోగాల్లో రోబోలు చేరుతున్నాయి. ఇక ఇప్పుడు కాటికాపరిగా తన సేవలు అందివ్వబోతోంది పెప్పర్ అనే రోబో! జపాన్‌కి చెందిన సాఫ్ట్ బ్యాంక్‌కి పెప్పర్‌ను తయారుచేసింది. ఈ రోబో బౌద్ధుల అంతిమ సంస్కారాలను తన చేతుల మీదుగా జరిపిస్తోంది. అంతేకాదు...అంతిమ కార్యక్రమాల సమయంలో ఈ రోబో బౌద్ధమత స్తోత్రాలు వల్లిస్తుంది.. డ్రమ్స్ వాయిస్తుంది. ఒక వేళ మరణించినవారి సంబంధీకులు ఎవరైనా అంతిమ సంస్కారాలకు రాలేకపోతే తనకు అమర్చిన టీవీ ద్వారా వారికి ప్రత్యక్ష ప్రసారం చేస్తుంది. ఈ రోబో సేవలు వినియోగించుకోవాలంటే మాత్రం కాస్తంత ఎక్కువ మొత్తంలోనే ఫీజు చెల్లించాల్సి ఉంటుంది.

## బామ్మగారి పిచ్చి

కొంతమంది క్రేజ్‌తోనో, ఫ్యాషన్ కోసమో టాటూలు వేయించుకుంటారు. మరి కొంతమంది అభిమానంతో వేయించుకుంటారు. ఆ కోవలోకే వస్తుంది ఈ బామ్మ కూడా. ఆరు పదుల వయసులోకి అడుగు పెడుతూ కూడా తన అభిమానాన్ని టాటూల రూపంలో చాటుకుంటోంది. అభిమాని అనగానే ఏ సినీహీరోనో అనుకునేరు... కానేకాదు. ఓ ఫుట్‌బాల్ టీం మేనేజర్‌కి ఫిదా అయిపోయి తన శరీరం మొత్తాన్ని ఆయనగారి చిత్రాలతో, పేరుతో నింపేసింది. ఆమె బయటికి వెళ్ళిందంటే ఇక టాటూతోనే తిరిగి ఇంటికి చేరుతుందట. అసలామె ఇంతవరకూ ఒక్కరోజు కూడా ఆ ఫుట్‌బాల్ మేనేజర్ చిత్రాలను ఆన్‌లైన్‌లో చూడకుండా లేదట. ఇప్పటివరకు ఆమె ఈ




టాటూల మీద 800 యూరోలదాకా ఖర్చుపెట్టింది. ఇంతకీ ఆమె ఎవరో చెప్పనేలేదు కదూ! ఆ బామ్మ పేరు వివి బాడీకోట్! వయసు 59. హింక్‌లే, లీసెస్టర్‌షైర్‌లో నివాసముంటుంది. ఇక ఆ ఫుట్‌బాల్ మేనేజర్... జోస్ మోరిన్హో! అభిమానం కాస్తంత ముదిరింది కదూ!

## పెట్ సెలూన్

ఆడవాళ్ళకి బ్యూటీపార్లర్‌లు, మగాళ్ళకి సెలూన్లు అన్నట్టుగా ఇప్పుడు పెంపుడు జంతువులకు కూడా సెలూన్లు వచ్చేశాయి. తైవాన్‌లోని తైనన్ నగరంలో ఇగోగో అనే సెలూన్‌కో ప్రత్యేకత ఉంది. అక్కడికి మీ పెంపుడు శునకాలనో, పిల్లులనో తీసుకెళ్ళారే అనుకోండి...బయటికి వచ్చేసరికి వాటి రూపురేఖలే మారిపోతాయి. ఎందుకంటే ఆ సెలూన్‌లో మీ పెంపుడు జంతువుల శరీరాలపై రకరకాల ఆకృతులను ఆవిష్కరిస్తారు మరి. టెడ్డీబేర్, హలో కిట్టీ, సింహం, స్టెగోసారస్ స్పైన్(డైనోసారస్ జాతి) వంటిరూపాలన్నమాట. మీ పెంపుడు జంతువుల బొచ్చును ట్రిమ్ చేస్తూ ఈవిధంగా చేస్తారు. అలా చేసినందుకు ఫీజు కూడా తక్కువేమీ ఉండదండోయ్... మీ పెంపుడు జంతువు శరీరం మీద ఉన్న ఫర్‌ని బట్టి, ట్రిమ్ చేయాల్సిన ఆకృతిని బట్టి ఛార్జ్ చేస్తారట. భలే ఉంది కదూ!



## ముచ్చటైన డ్రస్సు

చాక్లెట్ రేపర్లతో బుట్టలు, మ్యాట్‌లు అల్లటం తెలుసు. కానీ ఈ అమ్మడు వాటితో ఏకంగా డ్రస్సే తయారుచేసింది. పెన్సిల్వేనియా, ఎలిజబెత్‌టౌన్‌కి చెందిన ఎమిలీ సీహామర్‌కి ఫేస్‌బుక్‌లో ఆర్టిస్ట్రీ అండ్ అప్‌సైక్లింగ్ అనే పేజ్ ఉంది. పనికిరాని వాటితో, వ్యర్థాలతో వస్తువులను తయారుచేస్తూ, ఆ వీడియోలను, ఫోటోలను ఆమె తన పేజ్‌లో అప్‌లోడ్ చేస్తుంటుంది. ఆవిధంగానే ఈ చాక్లెట్ డ్రస్ కూడా వెలుగులోకొచ్చింది. దాదాపు నాలుగు సంవత్సరాలనుంచి స్టార్‌బస్ట్ చాక్లెట్ రేపర్లను సేకరించడం మొదలుపెట్టి, వాటిని ఇస్త్రీ చేసి, లింకులను కలుపుకుంటూ నూతన ఆవిష్కరణ చేసింది. కాకపోతే దాన్ని కేవలం షోకేసులో పెట్టుకోవటానికి మాత్రమే అనుకుంటే పొరబాటే! ఎందుకంటే ఆ డ్రస్సుని ఎంచక్కా పార్టీలకీ వాటికీ వేసుకెళ్ళచ్చుట మరి. మొత్తానికి ఎమిలీ ఓపికకు మెచ్చుకోవాల్సిందే అంటున్నారు ఆమె ఫేస్‌బుక్ పేజ్‌ను ఫాలో అయ్యేవాళ్ళు.

–నర్మద వాసిరెడ్డి



# పాతసామాను

-పినిశెట్టి శ్రీనివాసరావు

**'పాతసామాను కొంటాం, పాత టీవీలు కొంటాం, పాత ఫ్యాన్లు, గ్రైండర్లు పాత సోఫాలు, పాత కుర్చీలు, పాత మంచాలు పాత పరుపులు, పాత స్టీలు సామాన్లు, ప్లాస్టిక్ సామాన్లు ఖరీదుకు కొంటాం...'**

**ఓ ఆటోరిక్షా, దానికో మైకు... రికార్డెడ్ కేసెట్‌పెట్టి వీధులెమ్మట తిరుగుతున్నారు ఇద్దరు కుర్రాళ్లు.**

నేను ఫలహారం పూర్తిచేసి అపార్టుమెంటు బాల్కనీలో కూర్చుని దినపత్రిక చదువుతుంటే పాత సామాన్లు కొంటాం అని మైకులో వినపడగానే చదవడం ఆపేసి మా మేడమ్‌ని పిలిచా.

"ఏమోయ్! ఇంట్లో ఏమైనా పాతసామాను ఉంటే ఇలాపట్రా. వీళ్లు ఖరీదుకు కొంటారట" అన్నాను.

"ఏం తమాషాగా ఉందా? ఇదేమైనా మన ఇల్లను కున్నారా, పాతసామాన్లు ఉండడానికి? కోడలు బయటకు వెళ్లింది కనుక సరిపోయింది. తను వింటే మీకు క్లాసుపీకేది. ఆ మాటకొస్తే మీరూ నేనే ఈ ఇంట్లో పాత సామాన్లం, కొంటారేమో కనుక్కోండి " మా మేడమ్ రియాక్షన్, డబుల్‌స్ట్రాంగ్ ఫిల్టర్‌కాఫీ... షుగర్‌లెస్ తాగినట్లనిపించింది.

'అమ్మో! పొద్దున్నే ఇంతలా రియాక్టయిందంటే ఈరోజు ఒళ్ళు దగ్గర పెట్టుకుని మసులుకోవాలి' అనుకుని మళ్లీ పత్రిక చదవడంలో నిమగ్నమయ్యాను

కాసేపటికి తనే వచ్చి "కాఫీ తాగుతారా?" అంది.

నేను ఇందాకటి షాక్‌నుంచి తేరుకోలేదేమో "ఊ" అన్నాను మంద్రస్వరంలో.

"గట్టిగా చెప్పండి. ఫలహారం చేశారుగా?" అంది చిన్నపిల్లాడిని గద్దించినట్లుగా.

"ఇస్తే తాగుతా" అన్నాను.

"ఏం మరీ అంత భయపడి చస్తున్నారు, నేనేమైనా బ్రహ్మరాక్షసిలా కనపడుతున్నానా?" అంటూ వంటింట్లోకి వెళ్ళింది.

మేడమ్ ఇవాళెందుకో 'గరమ్‌గరమ్'గా ఉంది. కోడలుపిల్లతో ఏమైనా 'డిష్యుండిష్యుం' అయ్యిందేమో అనుకుంటూ ఆ తెచ్చే కాఫీ ఎలా ఉంటుందో అని ఆలోచిస్తున్నాను.

కాఫీ కప్పు నా చేతికి అందించి నా ఎదురుగా ఉన్న కేన్‌ఛైర్‌లో కూర్చుంది.

తలెత్తి ఆమె ముఖంలోకి సూటిగా చూడాలంటే ధైర్యం చాలడం లేదు. చేతిలో కాఫీ కప్పు బేలన్స్ చేసుకుంటూ అలానే ఉండిపోయాను. చెయ్యి వణుకుతోంది.

"అలా ఎంతసేపు పట్టుక్కూర్చుంటారు? కాఫీ తాగనైనా తాగండి. కప్పు పక్కనైనా పెట్టండి. లేకపోతే బట్టలమీద పోసుకుంటారు" అంది

"బాగా వేడిగా ఉంది" అంటూ ముందుకు వంగి కప్పు పక్కనపెట్టాను.

"రోజూ వేడిగానే తాగుతారుగా. ఈరోజు ఏమైంది? వేషాలేస్తున్నారు" అంది.

"అంటే ఆ వేడికాదు. నువ్వేదో వేడిగా ఉన్నట్లుంటేనూ?" అంటూ గొణిగాను.

"లేకపోతే ఏవిటి చెప్పండి. అది ఇంకా చంటిపిల్ల. మూడేళ్ళైనా నిండలేదు. ప్లేస్కూలు దాని బొందస్కూలు అంటూ నిద్రపోతున్న పిల్లని బలవంతంగా లేపేసి నిద్రమత్తులో ఉండగానే పళ్ల తోమేసి పాలుపట్టేసి స్నానం చేయించి స్కూలు యూనిఫాం వేసేసి అది వద్దు మొర్రో అని మొత్తుకుంటున్నా తిను తిను అంటూ ఇడ్లీనో నాలుగు దోశముక్కలో నోట్లో బలవంతంగా కుక్కేసి తీసుకెళ్ళి స్కూల్లో పడేసివస్తే ఏమనాలి? రెండేళ్ళు నిండి రెండునెలలైనా కాలేదు. అప్పుడే స్కూలుకు పంపడం ఎందుకు చెప్పండి? అక్కడికివెళ్ళి ఆడుకునేదేవిటి, నేర్చుకునేదేవిటి? వీళ్ళకి ఒక్కపిల్లని పెంచడంకూడా కష్టంగానే ఉంది, మరైతే కనటం దేనికో? ఎవరితోనైనా మాట్లాడమనండి, గంటలతరబడి మాట్లాడుతారు, ఇక టీవీ, ఫోనువచ్చి అందర్నీ పాడుచేశాయి. అవి కనిపెట్టినవాళ్లని తన్నాలి. ప్రతి ఒక్కరు అమూల్యమైన సమయం వృథా చేసుకుంటున్నారు, ఈ రెండింటి వల్ల".

"నిజమేరా, నువ్వు చెప్పిందంతా నిజమే" అన్నాను మేడమ్‌తో.

"కాఫీ తాగరేమిటి? చల్లారిపోతే మళ్లీ వేడి చేసుకురమ్మంటారు" అంది.

"ఇదిగో తాగేస్తున్నా" అని ఎత్తినకప్పు దించకుండా తాగేశాను. లేకపోతే అష్టోత్తరం తప్పదు.

"దాని తల్లి, తండ్రికి ఎలాగూ రాత్రి పన్నెండైతే కాని నిద్ర పట్టదు. అప్పటిదాకా ఆ సెల్‌ఫోన్లో ఏముంటాయో ఏమో, అది చూస్తూ అర్ధరాత్రిదాకా కూర్చుంటారు. ఆ పిల్లకీ సెల్‌ఫోను చూడటం అలవాటు చేశారు. వీళ్లతోపాటే అదీనూ. అర్ధరాత్రి అయితే గానీ నిద్రపోదు. అంతలేటుగా పడుకున్న పిల్లను పొద్దున్నే నిద్రలేపేస్తే, దానికి నిద్ర ఎలా సరిపోతుంది? పిల్లలకు నిద్రే బలం"

"కాదుమరీ"

"దాన్నెందుకమ్మాయ్ అలా నిద్రలేపి బాధపెడ్తారు? ఇంకో సంవత్సరందాక స్కూలుకు పంపకపోతేనేం? ఆ ఆటలేవో ఇంట్లోనే ఆడుకుంటుందిగా. మా రోజుల్లో అయితే ఐదో ఏట బడికి పంపేవాళ్లం" అన్నానని,

"మీకు తెలీదులే అత్తయ్యా. మీరోజులు వేరు, ఈరోజులు వేరు. ఇప్పుడంతా రెండు గంటలు ఆడుకుని వచ్చేస్తారు. అందరితో పాటే మనపిల్ల. లేకపోతే కాంపిటీషన్‌లో వెనుకబడిపోతుంది. ఆ తర్వాత ఏ ఇంటర్నేషనల్ స్కూల్లోనో చేర్పించాలంటే ఈ ఫౌండేషన్ అవసరం. నిద్రదేముంది మధ్యాహ్నం పడుకుంటుంది అంది మీ కోడలు.

"పిల్లకు సరిగ్గా మాటలే రాలేదు. బాత్రూంకి వెళ్లాల్సొస్తే స్కూల్లో ఇబ్బందికదా? వచ్చే ఏడాది పంపించ వచ్చులే స్కూలు మాన్పించేయ్" అన్నందుకు, "అదేవిటీ పాతికవేలు కట్టాం ఫీజు. ఇప్పుడు స్కూలు మాన్పించేయమంటారేవిటి.? మీకేం తెలీదు ఊరుకోండి. ఈవిషయంలో మీరు జోక్యం చేసుకోకండి. ఆయన నేను మాట్లాడుకునే ఈ నిర్ణయం తీసుకున్నాం. అని నన్ను తీసిపారేసింది. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్లుంది. ఏమైనాసరే చంటిదాన్ని బలవంతాన నిద్రలేపి స్కూలుకి పంపడం నాకు ఇష్టం లేదు. మనం చెప్పినా వాళ్ళు మనమాట వినరు. మన అబ్బాయి ఎప్పుడూ బిజీనే. మనతో మాట్లాడటానికే టైముండదు వాడికి. ఇలాంటప్పుడు మనం ఇక్కడ ఉండి ఏం లాభం చెప్పండి? పదండి, రేపే బయల్దేరి మనూరు వెళ్ళిపోదాం."



మేడమ్ కోపానికి కారణం తెలుసుకున్న నేను, "అది కాదురా.. మనంవచ్చి వారమే అయింది. వచ్చేవారం అబ్బాయి కంపెనీ ప్రాజెక్టు పనిమీద ఓ నెల అమెరికా వెళ్తున్నాడు. ఆ సమయంలో కోడ లికి తోడుగా ఉండడానికి మనం వచ్చాం. వాడు అమెరికా నుంచి తిరిగొచ్చేంతవరకు మనం ఉండ కపోతేఎలా చెప్పు?" అన్నాను.

"ఏమో, మొన్నటికిమొన్న చంటిది ఒకపూట అన్నం తినకపోతే, పోన్లే అమ్మాయి ఊరికే దాన్ని ఏడి పించకు. తిన్న అన్నం కూడా ఒంటపట్టదు' అన్నా నని నా వంక సీరియస్‌గా చూసింది. అంటే నన్ను నోరుమూసుకోమనేగా అర్థం? పిల్లలు వద్దన్నారని ఊరుకుంటే వాళ్లు అసలేం తినరు. అపార్టుమెంటులో మిగతా పిల్లలు ఎంత బొద్దుగా ఉన్నారో చూడండి. మనపిల్లే సన్నగా ఎలా ఉందో అంది.

"అయితేనేం మనపిల్ల యాక్టివ్‌గానే ఉంది కదా? బొద్దుగా ఉన్న పిల్లలది ఊబశరీరం. చాక్లెట్లు, బిస్కట్లు తింటే ఒళ్ళు రాకేం చేస్తుంది? సన్నగా ఉన్నా మన పిల్లే నయం అయినా అన్నం తింటున్నంత సేపు ఆ సెల్‌ఫోన్‌లో ఏదో ఒకటి చూస్తూనే ఉంటుంది చంటిది. అది అంత మంచిది కాదు. ఆ అలవాటు మాన్పించేయమన్నా నని, మీరెక్కడో బిసి కాలంలో ఉన్నారంది. పిల్ల బాగా దగ్గతోందిగా స్కూలుకు పంపించక పోతేనేం అన్నానని, 'ఏం ఫర్వాలేదు వెళ్ళనివ్వండి రెండుగంటలు ఆడుకుని వచ్చేస్తుంది. నాకూ కాస్త విశ్రాంతి దొరకుతుంది' అంటూ పంపింది. స్కూలు నుంచి వచ్చేటప్పటికి చంటిదానికి జ్వరం వచ్చేసింది. ఏం చెప్పినా వినదు కదా మొండిఘటం" అంది.

"మనం ఇక్కడ శాశ్వతంగా ఉంటామా ఏమ న్నానా? ఎవరి పిల్లల్ని వాళ్ళు తమ ఇష్టం వచ్చినట్లు పెంచుకుంటారు. మనల్ని ఏదైనా సలహా అడిగి నప్పుడు చెప్దాం. లేకపోతే ఊరుకుందాం. మనం చెప్పింది కూడా వాళ్లకు నచ్చాలనేం లేదు. వాళ్ళకు నచ్చకపోయినంత మాత్రాన మనం మనస్సుని కష్ట పెట్టుకోవడం అనవసరం. చెప్పడంవరకే మన ధర్మం. వినడం, వినకపోవడం వాళ్ళ నిర్ణయం" అన్నాను మేడమ్ మూడ్ మార్చాలన్న ఉద్దేశంతో.

ఏం సమాధానం చెప్పకుండా ఊరుకుంది మేడమ్.

***

"భోజనానికి నువ్వు, నేను వెళ్తే బాగుంటుంది కాని మీ మావగారు వస్తే ఏం బాగుంటుంది చెప్పు. ఆ పిలిచిన వాళ్లా మన బంధువులు కూడా కాదు".

"ఇందులో బాగుండక పోవడానికి ఏముంది అత్తయ్యా? వాళ్ళు అందర్నీ రమ్మని పిల్చారు. మీరు నేను వెళ్తున్నాక మావయ్యగారు ఒక్కరికే ఇంట్లో వంట ఎందుకు చెప్పండి? అక్కడే తినేద్దాం. ఈ పూట కుక్కర్ పెట్టేపని తప్పుతుంది".

"ఆయనకు మొహమాటం ఎక్కువ అమ్మాయ్. ఇలాంటి ఫంక్షన్లకి రావడానికి ఒప్పుకోరు. ఆయన్ని ఇబ్బంది పెట్టడం ఎందుకు? కుక్కర్ నేను పెట్టే స్తాలే"



**భార్యావిధేయుడాయన. బుద్ధిగా మెలుగుతాడు. భార్య హాట్‌హాట్‌గా ఉన్నప్పుడు వినయ విధేయతలు ప్రదర్శిస్తూ మోస్ట్ ఒబీడియంట్లీ అన్నట్టు ఉంటాడు. ప్రెషర్ కుక్కర్‌లో స్టీము బయటకొచ్చేందుకు ఉపయోగపడే సేఫ్టీవాల్వ్ తరహాలో భార్య కోపాగ్ని శాంతింపజేసేందుకు సహన కౌశలం ప్రదర్శిస్తాడు. భార్యమాటలకు ఔదలదాల్చుతూనే అన్నీ బ్యాలెన్స్ చేసుకొస్తాడు. ఓసారి కొడుకు ఇంటికి వెళ్ళినప్పుడు ఏం జరిగిందంటే....**

"అన్నం ఒక్కటే వండితే సరిపోతుందా? కూరలు అవసరం లేదా? నేను చెప్తాలెండి మావయ్యగారికి. కింద సెల్లార్‌లోనేగా భోజనాలు. ఆ టైముకి మనం చెప్పాక మామయ్యగారు వచ్చి భోజనంచేసి వెళ్ళిపోతారు. అక్కడ వెయిట్ చేయవలసిన అవసరం ఉండదు. ఇంకా కొంతమంది మగవాళ్లు ఉంటారు కూడా"

అత్తా కోడళ్ళ సంభాషణ నా చెవిన పడుతూనే ఉంది. ఇంతకీ మా మేడమ్ మాట నెగ్గలేదు కనుక ఆవిడ ఈరోజు కూడా హాట్‌హాట్‌గానే ఉంటుంది అనేది అర్థమైపోయింది. అప్పటివరకు పడకగదిలో కూర్చుని దినపత్రిక చదివి మంచంమీద కాస్త నడుం వాల్చుదామనుకున్న నేను ప్రస్తుత పరిస్థితి దృష్ట్యా ఆ ఆలోచన విరమించి దినపత్రిక చదవడం కొనసాగిస్తున్నాను.

ఇక్కడో చిన్న విషయం. మేడమ్ అంటే నేను నిజంగానే భయపడిపోతున్నానని కాదు. మేడమ్ హాట్‌హాట్‌గా ఉన్నప్పుడు మనం కాస్త వినయ విధేయతలు ప్రదర్శించి 'యువర్స్ మోస్ట్ ఒబీడియంట్లీ' అన్నట్లు మనం నటనాకౌశలం చూపించామనుకోండి... 'ఫర్వాలేదు నా మొగుడైనా కనీసం నా చెప్పు చేతల్లో ఉన్నాడు అన్న భావన ఆవిడలోని అహాన్ని శాంతింపజేసి గుండె అనే ప్రెషర్ కుక్కర్‌లో పొంగి పొర్లుతున్న కోపాగ్ని అనే స్టీము 'సేఫ్టీవాల్వ్' ద్వారా బయటకొచ్చి గుండె బరువు తగ్గుతుంది. ఆ తర్వాత అంతా కూల్‌కూల్. లేకపోతే రోజంతా ఘర్షణ, సంఘర్షణ. కృష్ణపరమాత్మకు ఈ కిటుకులన్నీ తెలుసు కనుకనే, 'మీర జాలగలడా నా యానతి వ్రతవిధాన మహిమన్ సత్యాపతి...' అంటూ సత్యభామ గర్వాహంకారాలతో కాలుతో తన్నినా 'అయ్యో నీకాలు కందిందేమో' అంటూ పరిహాసమాడాడే గానీ ఆగ్రహించలేదు ఆ జగన్నాటక సూత్రధారి మురారి. కనుక పతి అన్నవాడు కాస్త సహనకౌశలం ప్రదర్శించాలేగానీ ఆ తర్వాత సరస శృంగార మదనకేళీ విలాసాల్లో ఆ సతీసతుల సంగమం అనురాగ సంగమం.. ఆనంద సంగమమేగా!

మేడమ్‌గారు గదిలోకి ప్రవేశించి తలుపు మూసేశారు. గదంతా పొగలు వేడి సెగలు వ్యాపించినట్లైంది. కళ్ళద్దాల్లోంచి కళ్ళు రిక్కించి చూస్తున్నాను.

పక్కనున్న టేబుల్‌మీద నుంచి పుస్తకం ఒకటి కింద పడింది. పడింది అనడం కంటే మేడమ్ పడేసింది అనడం కరెక్ట్. మేడమ్‌కు కోపం వచ్చిందని నాకు తెలియచెప్పడానికి ఏ పళ్ళెమో, గరిటో, గ్లాసో ఇలా చేతికి అందుబాటులో ఉన్నది ఏదో ఒకటి కిందపడేసి, నా అటెన్షన్ తనవైపు తిప్పుకోవడం అలవాటు.

"మూడోఫ్లోర్‌లో ఓ పిల్ల పెద్దమనిషి అయిన సందర్భంగా వాళ్ళు భోజనాలు పెట్టుకుంటున్నారు. అందర్నీ రమ్మని పిలిచారు. దానికి మీరెందుకు చెప్పండి. ఆడవాళ్లం మేము వెళ్తే బాగుంటుందిగానీ. ఆ మాటంటే ఒప్పుకోదే. మీ ఒక్కరికి కుక్కర్ పెట్టి అన్నం వండడం దేనికంటుంది మీ కోడలు. అది అలాగే మాట్లాడుతుంది కానీ మీరేం రాకండి భోజనానికి. బయట ఎక్కడైనా హోటల్లో భోజనంచేసి వచ్చేయండి" అంది మేడమ్, నా ముఖంలోకి సీరియస్‌గా చూస్తూ.

"దానిదేముందిరా? ఒక్కపూట భోజనం చేయకపోతే ఏమవుతుందట? నేను ఈ మధ్యాహ్న భోజనం మానేస్తానులే" అన్నాను.

"అదే నాకు నచ్చదు. నావల్ల మీరు ఉపవాసం ఉన్నారని, కోడలుపిల్ల అపార్టుమెంటులో అందరికీ టముకేసి చెప్తుంది" నావంక ఉరిమురిమి చూస్తూ అంది.

"అలా కాదుగానీ ఓ ప్లేటులో వాళ్ళు పెట్టిన ఐటమ్స్ అన్నీ తీసుకొచ్చి ఇస్తాను. మీరు ఇంట్లోనే కూర్చుని తిందురుగాని" అంది.

'ఇదేదో మధ్యేమార్గంలా ఉందనిపించింది. కానీ ఇంత యాతన దేనికి? అక్కడికివెళ్ళి తినేస్తేనేం? అనిపించింది కానీ మేడమ్ రావొద్దన్నాక ఎలా వెళ్తాను? అలా చేస్తే పుడ్డుండదు, బెడ్డుండదు అని కాదు కానీ మనశ్శాంతి ఉండదు'.

"అంతేలెండి మనిల్లు వదిలి వేరేచోటకి వచ్చాక వాళ్ళు చెప్పిందే వినాలి. కాదనే స్వతంత్ర్యం మనకెక్కడుంది?" అంది గది తలుపుతీసి బయటకు వెళ్ళబోతూ.

"పుస్తకం కింద పడింది" అన్నాను.

"తీసి పైన పెట్టండి. అలా గంటల తరబడి కదలకుండా కూర్చుంటే కీళ్లు పట్టేస్తాయి. కాస్త కదలండి" అంది బయటకు వెళ్తూ.

ఆ వెంటనే కోడలు వచ్చింది. "మావయ్యగారు, మధ్యాహ్నం కింద సెల్లార్‌లో భోజనాలున్నాయి. మూడో ఫ్లోర్‌వాళ్ళు అందరినీ రమ్మని పిలిచారు. మీకేం అభ్యంతరం లేదుగా?" అంది.

"అబ్బే" అన్నాను.

కోడలు వెళ్ళిపోయింది, మేడమ్ వచ్చింది.

"ఏవిటీ.. భోజనానికి పిలుపొచ్చినట్టుంది. ఏం చెప్పారేవిటి?" అంది.

"ఏం చెప్తాను?" అన్నాను.

"ప్రశ్నకు ప్రశ్న జవాబుకాదు, నేను చెప్పినట్లు చేయండి" అంది.

ముందు నుయ్యి వెనుక గొయ్యి.

నాకొడుకు అమెరికావెళ్ళి అప్పుడే పదిరోజులైంది. ఇంకో ఇరవై రోజులకుగానీ రాడు. అప్పటిదాకా కళ్ళు చెవులు మూసుకుని కాలక్షేపం చేస్తే చాలు అనుకుంటూ మేడమ్ కింద పడేసిన పుస్తకం తీసి టేబుల్‌మీద పెట్టాను.

మరోసారి కూడా ఫుడ్‌ప్రాబ్లమ్ ఇలానే వచ్చింది. అది దినం భోజనం రూపంలో. పెంట్‌హౌస్‌లో ఉన్న ఆయన తల్లి కాలం చేశారట. పెద్దదినంరోజు అపార్టుమెంట్‌లో వాళ్ళని భోజనానికి పిల్చారు. వాళ్ళెవరో మా కోడలు, కొడుక్కితప్ప మాక్కూడా తెలియదు.

మళ్లీ గొడవ మొదలైంది.

"నువ్వెళ్ళమ్మాయి.. మేం రాం".

"వాళ్ళు అందర్నీ రమ్మని పిల్చారు. వెళ్ళకపోతే బాగోదు" అంటోంది కోడలు.

"ఏంటి బాగోదు? అసలు మేము ఎవరమని? ఇవాళ ఉంటాం రేపు వెళ్ళిపోతాం, ఆ పోయినావిడ ఎవరో మాకు తెలియదు. నువ్వెళ్ళు మేం ఇంట్లోనే వండుకుని తింటాం. ఖాళీగా కూర్చుంటే నాకు ఏం తోచడం లేదు. వంట పూర్తిగా మర్చిపోయేలాగున్నాను. ఈ ఒక్కరోజైనా కాస్త వంట చేసుకోనీ" మేడమ్ సీరియస్‌గానే చెప్పింది.

కోడలుపిల్ల ఇంకేం మాట్లాడలేదు. పన్నెండింటికి కోడలుపిల్ల చంటిదాన్ని తీసుకుని వెళ్ళిపోయింది.

మా మేడమ్ అప్పుడు వంట మొదలుపెట్టబోతే గ్యాస్ అయిపోయింది. రెండో సిలిండరు ఉంది కానీ సిలిండరు మార్చడం, రెగ్యులేటర్ తీసిపెట్టడం ఇవన్నీ ఎందుకనుకుందేమో ఇక వంట చెయ్యను లెండి, మీకు ఆకలేస్తే బయటకెళ్ళి తినేసి రండి నేనేం తినను" అంది.

అట్లాకాదులే అని, హోటల్ నుంచి కర్డ్‌రైస్ తెచ్చాను. ఇద్దరం తిన్నాం.

***

"నాకు కోడలి తీరు ఏం నచ్చలేదు. ఇంట్లో పెద్దవాళ్ళం ఉన్నాం, వంటచేసి పెట్టాలన్న ఇంగితం ఉండొద్దూ? నేను వద్దన్నానే అనుకోండి... ఊరుకోవడమేనా? ఇదేనా అత్తమామలకు ఇచ్చే గౌరవం?





## దాని గురించి చెప్పలేదట!

*హీరోయిన్‌లు కథ క్యారెక్టర్ డిమాండ్ చేయటం వల్లే లిప్‌లాక్ సీన్లలో నటించామని చెబుతుంటారు. ఇప్పుడు షాలినీ పాండే కూడా అదే మాట చెబుతోందంటున్నారు సినీ జనాలు. అర్జున్‌రెడ్డితో తెరంగేట్రం చేసిన షాలిని ఈ సిని మాతో హాట్‌గర్ల్ అనిపించుకుంది. అయితే ఆ సినిమా డైరెక్టర్ షాలినీకి లిప్‌లాక్ సీన్ గురించి ముందే చెప్పలేదట. షూటింగ్ సమయంలో క్యారెక్టర్ డిమాండ్ చేయడంతో ఆ సీన్‌లో నటించాల్సి వచ్చిందని అందరిదగ్గరా వివరణ ఇస్తోం దట ఈ నూతనతార.*

వాళ్ళ అమ్మానాన్నలు వస్తే ఇలానే వదిలేసి పోతుందా? అస్సలు భయం లేకుండా పోయింది. మనవాడు ఓ చవటాయి. వాళ్ళు రమ్మంటేనేగా మనం వచ్చింది? అబ్బాయిని రానీయండి చెప్తాను"

"ఇంకో నాలుగు రోజుల్లో అబ్బాయి ఎలాగూ వచ్చేస్తాడు. ఆ మాత్రం దానికి గొడవెందుకుచెప్పు. కోడలు మీద కొడుక్కి కంప్లయింట్ చేస్తే బాగుం టుందా చెప్పు? వాళ్ళు గొడవలు పడితే మనకు ఆనం దమా చెప్పు? మన అమ్మాయే అలా చేస్తే సర్దుకు పోమూ? వయసులో ఉన్నప్పుడు పిల్లలకు ఆ జోరు పొగరు ఉంటాయి. వయసు మీరినవాళ్ళు మాత్రం అంత ఫాస్టుగానూ ఉండట్లా"

"అంటే నన్ను ఉద్దేశించేగా మీరనేది?"

"ఛఛ... నువ్వు ఫాస్టు ఏంటి" అని బయటకు అని 'నువ్వు సూపర్‌ఫాస్ట్' అని మనసులో అనుకు న్నాను.

"ఈ ఎటకారమే వద్దంట. అసలు మీరు గట్టిగా ఉంటే పిల్లలెందుకిలా తయారవుతారు?"

"పిల్లలేంటి నువ్వు కూడా నా మెతకతనం చూసే కదా?" అన్నాను.

"ఆ ఆ మాటకు మాట, మీది వృశ్చికరాశి అని నాకు తెలుసు. బయటకు కనబడరు, ఏం తెలీనట్టే ఉంటారు. గప్‌చుప్‌గా చేసేది చేసేస్తుంటారు"

"రామరామ! మీ సింహరాశివాళ్ళతో పోరాడి నెగ్గగలమా?" అన్నాను.

మా వాగ్యుద్ధానికి అంతరాయం కల్గిస్తూ కోడలు, మనవరాలు నీహారిక వచ్చేశారు.

గ్యాస్ అయిపోయిందన్న విషయం తెలు సుకుని, "అయ్యో... నాకు ఫోను చెయ్యకపోయారా మామయ్యా? ఇక్కడకు దగ్గర్లోనే ఉన్నాను. వచ్చి సిలిండరు మార్చేదాన్ని కదా?" అంది కోడలు. మేము హోటల్ నుంచి తెచ్చుకు తిన్నామని తెలిసి నిజంగానే బాధపడింది.

"పర్వాలేదులే అమ్మా! గ్యాస్ అయిపోవడం వల్ల కానీ లేకపోతే మీ అత్తగారే వంట చేసేసే వారు" అన్నాను.

"సారీ మావయ్య ఇలా అవుతుందనుకోలేదు" అంటూ బాధపడింది.

"మీతో మర్యాదగానే మాట్లాడుతుంది. నా దగ్గర కొచ్చే సరికి వేషాలు" మేడమ్‌గారు ఉడుక్కున్నారు

అత్తాకోడళ్ల అనుబంధంలో అపశ్రుతులు అనా దిగా వస్తున్నవే. ఆధిపత్యం కోసం అత్తగారు, అప్పట్లా అణిగిమణిగి ఉండటానికి ససేమిరా అంటూ నేటి విద్యాధికులైన కోడళ్లు.

***

నా కొడుకు అమెరికా నుంచి వచ్చేశాడు.

ఓవారం తర్వాత 'గరీబ్‌రథ్'కి టికెట్లు దొరి కాయి.

స్టేషన్‌కి బయల్దేరేముందు. అత్తగారికి చీర జాకెట్టు పెట్టి వంగి మా ఇద్దరి కాళ్లకు నమస్కరిం చింది కోడలు. మనవరాలికి మేము వెళ్ళిపోతున్నాం అని తెలిసిందేమో నేనూ వస్తా అంటూ ఏడుపు మొదలుపెట్టింది.

"మళ్లీవస్తాం నాన్నా అంటూ చంటిదానికి నచ్చజెప్పి బయల్దేరాం. కారులో స్టేషనుకు తీసుకెళ్ళి ట్రైను ఎక్కించాడు నాకొడుకు.

స్టేషనుకు చేరుకున్నాక "ఏమ్మా, నేను అమె రికా వెళ్ళినప్పుడు ఏమైనా ఇబ్బంది అయిందా? నీ కోడలికి కొంచెం తొందరపాటు ఎక్కువ. నీ మన సుకు ఏదైనా బాధ కలిగిస్తే నన్ను క్షమించమ్మా" అంటూ తల్లి చేతులు పట్టుకున్నాడు నా కొడుకు.

"అలాంటిదేం లేదులే అయ్యా" అంటూ కొడు కును దగ్గరకు తీసుకుంది. ట్రైను కదిలింది. కొంచెం సేపయ్యాక, "చూశావా వాడు నా కొడుకు, కోడలు కూడా మంచిపిల్లేరా" అన్నాను మేడమ్‌తో.

ఎందుకో తెలీదుగానీ, కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లు తుంటే నాభుజంమీద తలవాల్చి కళ్ళు మూసు కుంది. మేడమ్ పిచ్చిది. అలా గయ్యాళిలా కనపడు తుంది కాని దాని మనసు వెన్న, సెంటిమెంటు వేడి తగిలిందంటే ఇట్టే కరిగిపోతుంది, ఆ తరువాత నెయ్యిలా ఘుమఘుమలాడుతుంది.

ఇంటికి చేరుకోగానే అబ్బాయికి ఫోనుచేసి చెప్పాను. సురక్షితంగా చేరామని. ఆ తర్వాత మేడమ్ కూడా కోడలితో ఫోనులో మాట్లాడింది. నీహారికను జాగ్ర త్తగా చూసుకోమని మరీ మరీ చెప్పింది. ఏదైనా అవసరముంటే ఫోను చెయ్యండి తప్పకవస్తామని చెప్పింది.

ఇంటికి చేరుకుని అప్పుడే రెండురోజులైంది. బ్రేక్‌ఫాస్ట్ చేసి కూర్చున్నాను.

"పాతసామాన్లు కొంటాం, పాత కుర్చీలు, పాత సోఫాలు, పాత మంచాలు....." కింది నుంచి అరుపువినిపిస్తోంది.

"ఏమోయ్" అన్నాను.

"ఈ ఇల్లు, ఇంట్లో ఉన్న సామాను మను షులు.. అన్నీ పాతే, ఏది అమ్మాలో మీరే నిర్ణ యించుకోండి" అంది.

"ఇవేమీ అమ్మేవి కాదురా. పాతబడ్డాయి గానీ, పనికిరానివి కావు. వీటి నాణ్యత, మన్నిక, పనితనం ఇప్పుడు వచ్చేవాటికేది? ఇప్పుడొచ్చేవి దాదాపు యూజ్ అండ్ త్రో అల్పాయుష్షు వస్తు వులే. అలాగే మన మన్నిక వేరు. నాటి శక్తి సామ ర్థ్యాలు, క్రమశిక్షణ, సహనం, ఓర్పు, వివేకం, విచక్షణ, విశ్లేషణ, భయభక్తులు నేటితరంలో ఎంతవరకు ఉన్నాయన్నదే ప్రశ్న. ఇప్పుడంతా వేగం, విచ్చలవిడి తనం, ఆవేశం, ఆర్భాటమే. వాటి పర్యావసనం తడ బాటు, తప్పటడుగులు, నిరాశ, నిస్పృహ, నైరాశ్యం, ఆత్మహత్యలు, అర్థాంతరంగా నిండు జీవితాలకు ముగింపు.

ఈ దుష్పరిణామాలనుంచి నేటి తరాన్ని రక్షించ గల శక్తి మన పాతతరానికే ఉంది. అందుకని మనకి మనం పాతసామానుకింద జమకట్టుకుని అచేతనంగా కూర్చోకుండా నేటి తరాన్ని పట్టిపీడి స్తున్న అనేకానేక రుగ్మతల నుంచి కాపాడేందుకు అవకాశం దొరకపుచ్చుకుని వారి తప్పొప్పులు నిదా నంగా తెలియజేస్తూ తగు సూచనలిస్తూ వారిలో ఆత్మవిశ్వాసం, స్థైర్యం ఇనుమడింపచేసి వారికి వెన్ను దన్నుగా నిలిచి విజయపథంవైపు నడిపించవలసిన గురుతర నైతిక బాధ్యత మన పాతతరంమీద ఉంది. మనం పాత సామాన్లమే కానీ పనికొచ్చే పాతసామాన్లం 'ఓల్డ్ ఈజ్ గోల్డు' కదా" అన్నాను.

మేడమ్ మౌనంగా నన్ను చూస్తూ ఉండిపోయింది.

**సెల్: 8978539038**



# ధ్యానంతో మద్యపానం దూరం

**'తాడిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడగడ్డికోసం ' అన్నాడట ఒక ప్రబుద్ధుడు. తాగుబోతులను ఉద్దేశించి రివాజుగా అనే మాట ఇది. ఇదివరలో సిగరెట్టు , మద్యపానం చాలా రహస్యంగా ఎవరికీ తెలియకుండా ఊరు చివర చేసేవారు. కానీ ఇప్పుడది ఊరు మధ్యకు, గుడిపక్కకు, బడి పక్కకు వచ్చి చేరింది. మద్యం దుకాణాల దగ్గర గుంపులు గుంపులుగా పడిగాపులుపడడం, మద్యం కోసం లైనులో నిలబడడం ఇప్పుడు మన దేశంలో సరికొత్త రకం క్రమశిక్షణగా మారింది.**

**పర్యవసానాల్ని పక్కకు నెట్టేసి తాగడాన్ని ఫ్యాషన్‌గా, మోడ్రన్ కల్చర్‌గా మార్చేశారు. ఒక్కసారి మద్యానికి అలవాటుపడ్డాక, ఆ వ్యసనాన్ని మాన్పించడానికి ఆ కుటుంబం నానా తిప్పలూ పడుతూ విసిగి వేసారిపోతోంది. ఆర్థికంగా చతికిలబడి, కుటుంబం సాంఘిక గౌరవం కోల్పోతోంది. పిల్లల భవిత నాశనమవుతోంది. చివరకు భార్యకూడా తప్పుతోవనపోయే స్థితికి వస్తున్నాయి పరిస్థితులు. మరి ఈ అలవాటు మాన్పించడం ఎలా? అని ఆలోచిస్తే, మన పురాతన ధ్యాన, యోగ మార్గాలు అత్యుత్తమమైనవంటున్నారు పరిశోధకులు. ఆ విషయాలు చదవండి.**

చాలామంది ఎమోషనల్ వాక్యూమ్‌ను కవర్ చేసుకోవడానికే మద్యం తాగుతారు. మన అభిప్రాయాలు వినేవారు లేనప్పుడు, తల ఆన్చి కన్నీరు కార్చడానికి వెంటిలేషన్‌గా ఒక భుజం మనకు దొరకనప్పుడు మద్యానికి అలవాటుపడతారు. నిజానికి మనచుట్టూ వందలమంది ఉన్నా వెక్కిరించేవాళ్ళు, బెదిరించేవాళ్ళే తప్ప ఓదార్చేవాళ్ళుండరు. వ్యక్తిగత అభిప్రాయాలు పంచుకోవడానికి ఎవరూ దొరక్కపోతే మద్యానికి అలవాటుపడతారు. తనకంటే బలవంతుల ఎదుటపడి తిట్టేందుకు, సుపీరియారిటీని చూపించేందుకు, ఇన్ఫీరియారిటీని పోగొట్టుకునేందుకు కూడా చాలామంది మద్యం సేవిస్తారని సైకాలజిస్టులు చెప్తారు. ధైర్యం తెచ్చుకుని ఎదుటివాణ్ణి తిట్టడానికి ఒక వెహికల్‌గా కొందరు మద్యం సేవిస్తారు. గుర్రం ఎక్కితే (తాగడం) కొండంతబలం వస్తుందని, ఏమైనా చేయగలుగుతామని మందుబాబులు అంటారు. ఆ మత్తులో ఎన్నో నేరాలు చేస్తారు. దేశంలో ఇప్పుడు జరిగేవన్నీ మద్యం మత్తు నేరాలే. ఇతరులను లొంగదీసేందుకు, పనులు చేయించుకునేందుకు స్వార్థపరులు ఇక త్రీడబ్ల్యూ సూత్రం (వైన్, ఉమెన్, వెల్త్) అమలు చేస్తారు. మద్యం తాగడానికి చాలామంది కుంటిసాకులు చెబుతారు.

## ధ్యానంతో తాగుడుకు చెక్

మద్యానికి బానిసలైనవారు ఆ అలవాటు మానాలని చాలా ప్రయత్నిస్తారు. 'ఏం చెయ్యమంటారు, మానలేకపోతున్నా' అని మళ్ళీ తాగి వీరంగం చేస్తారు. చిత్తశుద్ధి, సంకల్పబలం కొరవడటంవల్లే తమను తాము నియంత్రించుకోలేకపోతున్నారు. ఈ అలవాటుకు దూరం కావాలంటే, ధ్యానం చేయాలని యూకేలోని యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ లండన్ పరిశోధకులు సూచిస్తున్నారు. రోజుకు కనీసం 11 నిమిషాలపాటు ధ్యానం చేస్తే ఒత్తిడి దూరమై మానసిక ప్రశాంతత ఏర్పడి మద్యం సేవించాలన్న భావన పోతుందని పరిశోధనలో వెల్లడైంది. దాదాపు 68 మంది మద్యం బానిసలతో వారంపాటు ధ్యానం చేయించి పరీక్షించగా, వారిలో మద్యం సేవించాలన్న ఆలోచనే దూరం అయ్యిందని వెల్లడించారు. ఈ శాస్త్రవేత్తల బృందంలో భారత సంతతి శాస్త్రవేత్త కూడా ఉన్నారు.

## మెడిటేషన్‌తో డిప్రెషన్ దూరం

భారతీయ పురాతన మెడిటేషన్ చిట్కా ద్వారా డిప్రెషన్‌కు దూరంగా ఉండవచ్చునని శాన్‌ఫ్రాన్సిస్కో వెటరన్స్ మెడికల్ సెంటర్ నిపుణుడు Lindsey Hopkins చెప్పారు. సంపూర్ణమైన మానసిక ఆరోగ్యానికి ఈ ట్రెడిషనల్ థెరపీ ఎంతో దోహదం చేస్తుందని పరిశోధకులు చెప్పారు. మెడిటేషన్, బ్రీత్ ఎక్సర్‌సైజెస్, హఠయోగాలో డిప్రెషన్‌ను పారద్రోలే విధానాలు శరీరానికి ఎంతో మేలు చేస్తాయని తెలిపారు. దీనివల్ల ఎలాంటి దురలవాట్లయినా మటుమాయమవుతాయని వారు పేర్కొన్నారు. ప్రపంచ యోగా దినోత్సవానికి ముందునుండే పాశ్చాత్యదేశాలలో యోగా చాలా పాపులర్ అయింది. స్ట్రెస్ రిడక్షన్ థెరపీగా చాలామంది యోగాకు చేరువయ్యారు. ఇప్పుడు అనేక యోగా కేంద్రాలు ప్రపంచదేశాలలో వెలిశాయి.

## హఠయోగం

లాస్‌ఏంజిల్స్‌కు చెందిన జెన్ లెవిన్ మద్యం, సిగరెట్ మత్తునుండి బయటపడేందుకు హఠయోగాభ్యాసం చేసింది. డ్రగ్స్, ఆల్కహాల్, ఫుడ్ అబ్యూజ్‌లకు యోగా, ధ్యానం దోహదపడతాయంటారామె. అక్కడ గోల్డెన్‌బ్రిడ్జి యోగా స్టూడియోలో కుండలినీ యోగాతో సిగరెట్ మాన్పించే శిక్షణ ఉంది. ఈ మహమ్మారి నుండి బయటపడేందుకు యోగా,



ధ్యానం ఒక బయాలజీ, సైకాలజీ చికిత్సగా ఉప యోగిస్తుందని న్యూయార్క్‌కు చెందిన థెరపిస్ట్ మేరీ మార్గరెట్ ఫ్రెడరిక్ అంటారు.

### తాగుబోతుల రాష్ట్రం

దక్షిణాది రాష్ట్రాలలో మద్యపానీయంలో మొదటి స్థానంలో ఆంధ్రప్రదేశ్, రెండో స్థానంలో కేరళ ఉన్నాయి. తర్వాతి స్థానాలు తెలంగాణ, తమిళనాడు, కర్ణాటక ఉన్నాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారం కేరళలో తలసరి ఏటా 8 లీటర్లు మద్యం తాగుతారు. మనదేశంలో మద్య నిషేధం అమలులో ఉన్నది గుజరాత్, బిహార్, నాగాలాండ్, కేంద్రపాలిత ప్రాంతం లక్షద్వీప్‌లలో మాత్రమే.

మనదేశంలో 2 శాతంగా ఉండే మందుబాబులు 38 శాతానికి పెరిగిపోయారని డబ్ల్యుహెచ్‌ఓ (ప్రపంచ ఆరోగ్యసంస్థ) పేర్కొంది. రష్యా, ఎస్తోనియా, చైనా దేశాల తర్వాత అతిపెద్ద గ్లోబల్ స్పిరిట్ మార్కెట్ భారతదేశమే!

34 దేశాల్లో ఇటీవల మద్యపానం 2.5 శాతం తగ్గితే మనదేశంలో తలసరి మద్యపానం 55 శాతం పెరిగిందని ఆర్గనైజేషన్ ఫర్ ఎకనమిక్ కోపరేషన్ అండ్ డెవలప్‌మెంట్ (ఓఇసిడి) పేర్కొంది. అమెరికా, సింగపూర్ దేశాల్లో మద్యంపై ఏటా విపరీతంగా పన్నులు పెంచుతారు. 'ఓడ్కావల్ల మానవ వనరుల క్షీణత, ఉత్పాదకత నష్టం వాటిల్లింది' అని రష్యానేత పుతిన్ కొన్నేళ్ళక్రితం కంటనీరు పెట్టుకున్నారు. ఇప్పుడు రష్యన్లు ఆ దశ దాటి 33 శాతం మేరకు అలవాటు తగ్గించుకున్నారు. మద్యం మృతులు మహారాష్ట్రలో ఎక్కువ. మన దేశంలో ప్రతి 96 నిమిషాలకు ఒకరు మద్యం వల్ల మరణిస్తున్నారు.

### డీ-అడిక్షన్ కేంద్రాలు

ప్రభుత్వాలే మద్యపానం ప్రోత్సహిస్తూ తిరిగి డీ-అడిక్షన్ కేంద్రాలకు నిధులిస్తోంది. ఈ కేంద్రాలలో ధ్యానం, యోగాతో పాటు ఇతర మార్గాల్లో కూడా 12 దశల్లో మద్యం అలవాటు మాన్పిస్తారు.

మనదేశంలో చెన్నై, యూపీ, బెంగళూరు, ముంబై, కేరళ, న్యూఢిల్లీ సహా ఇప్పటివరకు 800 డ్రగ్-ఆల్కహాలిక్ డీ-అడిక్షన్, రీహాబిలిటేషన్ కేంద్రాలున్నాయి. వీటన్నింటిలో మద్యం బానిసలను ధ్యానం, యోగా థెరపీతో క్యూర్ చేస్తారు. కొత్తగా 2016-17లలో కేంద్ర ప్రభుత్వానికి 521 కేంద్రాల ఏర్పాటుకు ప్రతిపాదించారు. ప్రస్తుతం ఇవి మహారాష్ట్రలోనే అత్యధికం. కొత్తగా మరో 76 కేంద్రాలు ప్రారంభించాలని ఆ రాష్ట్రం ప్రతిపాదించింది. ప్రభుత్వం ఇప్పటికే 46 కోట్లు కేటాయించి మహారాష్ట్రకు ఆరు కోట్లు ఇచ్చింది.

## మందుబాబులకు అమృతబిందు ఉపనిషత్ చిట్కా



ధ్యానం మనిషిని ఉన్నతునిగా మారుస్తుంది. మానసిక సమతుల్యత కోల్పోయి, మద్యం మత్తులో చతికిలబడిపోయినవారు అనుసరించ దగిన ధ్యాన రహస్యాన్ని సులభమార్గంలో చెప్పింది అమృతబిందు ఉపనిషత్.

ఏకాగ్రతతో ధ్యానం చేస్తే మన దురలవాట్లు, వాంఛలు, ఆగ్రహం, ఆశ, అసూయ, ద్వేషం, కపటం, దురహంకారం వంటివాటిని ఈ చిట్కా తుడిచిపారేస్తుంది. అదే యోగా, అదే నిష్ఠ, అదే ఆత్మ సమర్పణ. అలాంటి స్థితిలో ఉన్న నిర్మల హృదయమే అంతరాత్మలో మన ఆలోచనల (భావింతన) జన్మస్థానాన్ని చేరుకుని వివేకాన్ని మేల్కొలుపుతుంది. ధ్యానం మనలో నిర్మలమైన సచేతనత్వం నింపి కంటికి కనిపించే వాస్తవ ప్రపంచాన్ని గుర్తించేట్టు చేస్తుంది. విచక్షణతో మెలిగేట్టు చేస్తుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలపై దృష్టి పెడితే ఓంకారం దానికి జత కలిసి ధ్వని ప్రపంచానికి దూరంగా మన ఆలోచనల జన్మస్థానానికి చేరుకుంటాం. దుమ్ముధూళి నిండిన కారు విండ్‌స్క్రీన్‌పై వైపర్‌జెట్ నీటిని స్ప్రేచేసి వైపర్స్‌తో నీటిని, ధూళిని ఎలా శుభ్రంచేసి రోడ్డు క్లియర్‌గా కనిపించేట్టు చేస్తుందో అదేవిధంగా మద్యం మత్తులో ఉన్నవారి మనసును ధ్యానం నిర్మలం చేసి తిరిగి విచక్షణగల ఉన్నతులుగా తీర్చిదిద్దుతుందని, కుటుంబ సభ్యులు వారిని చీదరించుకోకుండా ప్రేమతో డీల్ చెయ్యాలని శరణచైతన్యాచార్య (చిన్మయ మిషన్) పేర్కొన్నారు.

### పురాతన చరిత్ర

ఐదువేల ఏళ్ళనాడే బీర్, వైన్ వినియోగం ఆరంభమైంది. డిస్టిల్లేషన్ లిక్కర్ వినియోగాన్ని రెండువేల ఏళ్ళక్రితమే మొదలెట్టారు. సుమేరియన్ నాగరికతలో మద్యాన్ని పవిత్రమైనదిగా (డివైన్) భావించగా, పురాతన గ్రీస్‌లో వైన్‌కు మత ప్రాధాన్యముండేది.

ఓడ్కా, జిన్‌లను ఔషధంగా వాడేవారు. 14వ శతాబ్దంలో బీరు, జిన్‌లను యూరోపియన్లు ప్లేగు వ్యాధికి విరుగుడుగా, జిన్‌ను క్వినైన్ మిశ్రమంలో మలేరియా నివారిణిగా వాడేవారు. పురాతన రష్యాలో ఓడ్కాను పూజలలో వాడేవారు.

మనదేశంలో బియ్యం నుండి సంప్రదాయ బీరు తయారు చేసేవారు. క్రీస్తుపూర్వంనాటి గ్రీకు చరిత్రకారుడు మెగస్తనీస్ తన యాత్రావిశేషాల్లో దీన్ని ప్రస్తావించాడు. బియ్యం నుండి Medaka, ప్రసన్న అనే మత్తు పదార్థాలు తయారుచేస్తారని కౌటిల్యుడు పేర్కొన్నారు.

### స్కిన్ కేన్సర్

రెగ్యులర్‌గా ఆల్కహాల్ తీసుకునేవారిలో నాన్-మెలనోమ స్కిన్ కేన్సర్ (ఎన్ఎంఎస్‌సి) వచ్చే అవకాశాలు ఎక్కువని తాజా పరిశోధనల్లో వెల్లడైంది. ఆల్కహాల్‌కి, ఎన్ఎంఎస్‌సికి మధ్య సంబంధంపై మెటా ఎనాలసిస్ చేసి ఈ కేటగిరీలోనే బేసల్ సెల్ కార్సినోమా (బిసిసి), సిఎస్ఎస్‌సి లాంటి అనేక రకాల చర్మవ్యాధులొస్తాయని తేల్చారు.

### 2050 నాటికి క్లోజ్!

వాతావరణ మార్పులవల్ల ప్రపంచవ్యాప్తంగా బీరు, వైన్, కొరత ఏర్పడుతుందని శాస్త్రవేత్తలు అంచనా వేశారు. వర్షపాతం కొరతవల్ల 2050 నాటికి ఫ్రాన్స్‌లో ద్రాక్షతోటల పంటసాగు అసాధ్యమైపోతుంది. దీనివల్ల బీరు, వైన్, చాక్లెట్, కాఫీ పంటలసాగు కూడా దెబ్బతిని వీటి కొరత గణనీయంగా పెరుగుతుంది.

-రామ్మోహన్

## క్రియేటివిటీ కావాలా? కొంచెం బీరు తాగు!



మీలో క్రియేటివిటీ చచ్చిపోయిందా? మీ కళాత్మకమైన లక్ష్యాల సాధనలో విభిన్న దృక్కోణంలో ఆలోచించలేకపోతున్నారా? అయితే పన్నెండు ఔన్సులు (అరబుడ్డి) బీరు తీసుకోండి అని లేటెస్ట్ అధ్యయనం వెల్లడించింది. ఆశ్చర్యంగా అనిపించినా ఇది నిజమే! అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు! మితంగా ఉంటే ఏదైనా ఔషధమే.. కానీ అంతటి క్రమశిక్షణ మనలో కొరవడింది గనుకనే మద్యం మనదేశాన్ని మహమ్మారిలా పీడిస్తోంది.

క్రియేటివ్ టాస్కుల్లో బెటర్ పర్ఫార్మెన్స్ కావాలంటే మగవారు ఒక అరబుడ్డి, ఆడవారు 350 మిల్లీలీటర్లు ఆల్కహాల్ సేవిస్తే పర్ఫార్మెన్స్ 40 శాతం పెరుగుతుందని ఆస్ట్రేలియాలోని Graz యూనివర్సిటీ శాస్త్రవేత్తలు కనుగొన్నారు. ఇది క్రియేటివ్ ఆలోచనలకి దోహదపడొచ్చుతప్ప మోటార్‌స్కిల్స్‌వంటి ఫీట్స్‌లో ప్రాణాంతకమని గుర్తుంచుకోవాలని రీసెర్చ్ లీడ్ ఆథర్ Mathias Benedek Consciousness and Cognition జర్నల్‌లో పేర్కొన్నట్లు The Telegraph వెల్లడించింది.

# సౌభాగ్య చక్రం

సెప్టెంబర్ 6 నుంచి
సెప్టెంబర్ 12 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

సమీక్షలు, వృత్తి, వ్యాపారాలు, కొత్త ప్రాజెక్టులు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. రహస్య సమాచారం తెలుసుకుంటారు. 8, 9 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగవుతుంది. విందుల్లో పాల్గొంటారు. సహోద్యోగుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 10, 11 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇంక్రిమెంట్లు అందుకుంటారు. హోటల్, వైద్యరంగాల వారికి ప్రోత్సాహకరం. 12న ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తిపరమైన చర్చలు ఫలిస్తాయి.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, విద్యా విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 8, 9 తేదీల్లో వృత్తి విద్యా కోర్సుల్లో ప్రవేశానికి అనుకూలం. దూరంలో ఉన్న ప్రియతముల నుంచి కీలక సమాచారం అందుకుంటారు. సినీ, రాజకీయ రంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి. 10, 11 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సాంకేతిక కోర్సుల్లో ప్రవేశానికి అనుకూల సమయం. 12న ఫీజులు, బిల్లులు చెల్లించేందుకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, మార్పులు, విద్యా విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత పదవులు అందుకుంటారు. 8, 9 తేదీల్లో బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా శుభప్రదం. బ్యాంకులు, ఆర్థిక సంస్థల వారికి కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. 10, 11 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. 12న బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

విద్య, ఇంటర్వ్యూలు, సోదరీసోదరుల విషయాలు, ప్రయాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో ప్రయాణాలు, చర్చలకు అనుకూలం. న్యాయ, బోధన, రక్షణ రంగాల వారికి ప్రోత్సాహకరం. 8, 9 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. పెద్దలతో చర్చలు సత్ఫలితాలనిస్తాయి. ఇంటర్వ్యూలలో ఆచితూచి వ్యవహరించాలి. 10, 11 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. విద్యాసంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. స్నేహ బాంధవ్యాలు విస్తరిస్తాయి. 12న ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, షాపింగ్, ఆర్థికపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. వాయిదా పద్ధతులపై వస్తువులు కొనుగోలు చేస్తారు. 8, 9 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఖర్చులు అధికం. 10, 11 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 12న బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో ప్రియతముల సహకారం అందుకుంటారు.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఆర్థిక నిర్ణయాలు, ప్రయాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. పోటీల్లో గెలుపొందుతారు. 8, 9 తేదీల్లో పెట్టుబడుల గురించి ఆరా తీస్తారు. రుణాలు మంజూరవుతాయి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. 10, 11 తేదీల్లో బంధుమిత్రుల కలయిక ఉల్లాసం కలిగిస్తుంది. ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలిస్తాయి. న్యాయ, బోధనా రంగాల వారికి ప్రోత్సాహకరం. 12న వృత్తి, వ్యాపారాల్లో కీలక అంశాలపై దృష్టి సారిస్తారు.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

భాగస్వామి విషయాలు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం మెరుగవుతుంది. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. విందుల్లో పాల్గొంటారు. 8, 9 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారు గౌరవ మన్ననలు అందుకుంటారు. న్యాయ, రక్షణ రంగాల వారికి శుభప్రదం. జనసంబంధాలు విస్తరిస్తాయి. శ్రీవారు, శ్రీమతి వైఖరి ఆవేదన మిగులుస్తుంది. 10, 11 తేదీల్లో పాత బకాయిలు వసూలవుతాయి. వైద్యం, విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 12న రాజకీయ, సినీరంగాల వారికి అనుకూలం.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధ, గురువారాల్లో చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పెట్టుబడులు లాభిస్తాయి. 8, 9 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఆర్థిక విషయాల్లో సహోద్యోగుల సహకారం లభిస్తుంది. హోటల్, పరిశ్రమలు, వైద్య రంగాల వారికి ఆర్థికంగా అనుకూలం. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 10, 11 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లలో సత్ఫలితాలు సాధిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. 12న రుణప్రయత్నాలు ఫలిస్తాయి. మ్యూచువల్ ఫండ్స్, బీమా గురించి ఆరా తీస్తారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో బదిలీలు, వృత్తి, వ్యాపారాల్లో మార్పులకు అనుకూలం. కుటుంబ వ్యవహారాల్లో పెద్దల సహకారం లభిస్తుంది. 8, 9 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. విద్యా విషయాల్లో పెద్దల సహకారం లోపిస్తుంది. 10, 11 తేదీల్లో ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. సిబ్బందిని నియమించుకుంటారు. పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. 12న జనసంబంధాలు విస్తరిస్తాయి. వేడుకల్లో ప్రముఖులను కలుసుకుంటారు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. శుభవార్త అందుకుంటారు. 8, 9 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. కుటుంబ వ్యవహారాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. 10, 11 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. అడ్మిషన్లు లభిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 12న హోటల్, వైద్య, ఉపాధి రంగాల వారికి ప్రోత్సాహకరం.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో పెట్టుబడులు, పొదుపు పథకాలకు అనుకూలం. అదనపు ఆదాయం లభిస్తుంది. విలువైన వస్తువులు సేకరిస్తారు. 8, 9 తేదీల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థిక విషయాల్లో సోదరీ సోదరుల సహకారం లభిస్తుంది. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 10, 11 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 12న చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం మెరుగవుతుంది. పెట్టుబడులు, పొదుపు పథకాలకు అనుకూలం.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, సోదరీ సోదరుల విషయాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. 8, 9 తేదీల్లో స్పెక్యులేషన్లు, పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం సమకూర్చుకుంటారు. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. 10, 11 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో కీలకపాత్ర పోషిస్తారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. ప్రియతములకు సంబంధించి ఒక శుభవార్త వింటారు. 12న కుటుంబసభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి అనుకూలం.

నవ్య






## ఆ మూడు క్యారెక్టర్లంటేనే ఇష్టం

బాలీవుడ్ నుంచి హాలీవుడ్‌కి వెళ్లి గ్లోబల్ స్టార్‌గా మారింది ప్రియాంక చోప్రా. తన నటనతో, అందంతో కుర్ర కారు గుండెలను కొల్లగొట్టేసింది. సింపుల్‌గా ఉండడానికి ఇష్టపడే ఈ గ్లామర్ గాళ్ తన 15 ఏళ్ల సినీ కెరీర్‌లో ఎన్నో వైవిధ్య పాత్రలతో ప్రేక్షకులను మెప్పించింది. అయితే ఇప్పటివరకు తను నటించిన క్యారెక్టర్లలో, అన్నింటికంటే మూడు క్యారెక్టర్లంటేనే తనకిష్టం అని చెబుతోంది ఈ మాజీ ప్రపంచ సుందరి. డాన్ చిత్రంలోని 'రోమా' పాత్ర , 'దిల్ ధడక్‌నే దో' సినిమాలో అయేషా పాత్ర, 'గుండే' సినిమాలోని నందిత పాత్రలు తనకెంతో నచ్చిన పాత్రలని అంటోంది ఈ బ్యూటీ క్వీన్.

## ఎవరూ అతీతులు కారు




కాలానికి చిన్నా పెద్దా తేడా లేదు అంటే ఇదేకాబోలు. ప్రపంచ బాడీ బిల్డర్, హాలీవుడ్ హీరో ఆర్నాల్డ్ స్క్వాజ్‌నెగర్ ఓ రాత్రి తన విగ్రహం ముందు పడుకోవాల్సిన పరిస్థితి వచ్చింది. కొలంబస్‌లోని ఓహియోలో ఆ రాత్రి బసచేయడానికి ఓ హోటల్‌కి వెళ్ళాడు ఆర్నాల్డ్. అయితే అక్కడ రూంలు ఖాళీలేవని చెప్పడంతో, కలత చెందిన ఆర్నాల్డ్, ఆ హోటల్ ముందున్న తన విగ్రహం ముందే నిద్రకుపక్రమించాడు. కొసమెరుపేంటంటే.. గవర్నర్‌గా ఉన్న సమయంలో ఆర్నాల్డే ఆ హోటల్‌ను ఓపెన్ చేశాడట. తాజాగా దీనికి సంబంధించిన ఫోటోలను ఆర్నాల్డ్ సోషల్ మీడియాలో పెట్టారు. దాంతో ఈ ఫోటోలు చూసిన జనాలు కాలానికి ఎవరూ అతీతులుకారు అంటూ కామెంట్లు చేస్తున్నారు.

## థియేటర్ నుంచి బయటకు రానక్కరలేదు

బుల్లితెర సీరియళ్ళు సంవత్సరాలకు సంవత్సరాలు అలా సాగుతూనే ఉంటాయి. సినిమాను కూడా అలా సాగదీస్తే... అలాంటి ఆలోచనే స్వీడన్ డైరెక్టర్ ఆండర్స్ వెబర్గ్‌కి వచ్చింది. ఆయన ఏకంగా 720 గంటల నిడివి గల చిత్రాన్ని తెరకెక్కించనున్నారు. నెలరోజులపాటు థియేటర్ నుంచి కదలకుండా ఈ సినిమా చూడొచ్చు. మూకీ సినిమాగా తెరకెక్కనున్న దీని పేరు ఆంబియన్స్! దాదాపు వందమంది నటీనటులతో తీసే ఈ సినిమాను 2020కల్లా ప్రపంచవ్యాప్తంగా ఒకేసారి విడుదల చేసి కేవలం ఒక షో మాత్రమే వేస్తారట. అంతేకాదు అలా షో వేసిన తర్వాత ఆ సినిమా కాపీలను తగులబెడతారట. ఇలాంటి సాహసోపేతమైన నిర్ణయంపై అందరూ పెద్ద ఎత్తున విమర్శలు గుప్పిస్తున్నారు. ఈ సినిమాకు సంబంధించిన ట్రైలర్ 72 నిమిషాల నిడివిలో 2018 సంవత్సరంలో విడుదల కానుంది.





## హీరో టు ప్రొడ్యూసర్

డబుల్ హ్యాట్రిక్‌తో మంచి ఫామ్‌లో ఉన్న యంగ్ హీరో నాని. విభిన్న కథాంశాలను ఎంచుకుంటూ నేచురల్ స్టార్‌గా ప్రేక్షకుల మదిలో నిలిచిపోయాడు. ఒకపక్క హీరోగా కంటిన్యూ అవుతూనే, అప్పుడప్పుడు నిర్మాతగా తన అదృష్టాన్ని పరీక్షించుకుంటున్నాడీ యంగ్ హీరో. గతంలో డీ ఫర్ దోపిడీ అంటూ ఓ సినిమాని నిర్మించిన నాని, తాజాగా మరోసారి నిర్మాత అవతారం ఎత్తబోతున్నాడు. ప్రశాంత్ అనే ఓ నూతన దర్శకుడు చెప్పిన కథకి ఫిదా అయిపోయి, తనే నిర్మాతగా మారి ఆ సినిమా తీసేందుకు సిద్ధమయ్యాడట నాని. ఆ సినిమా కనుక హిట్ అయితే అటు హీరోగానూ, ఇటు ప్రొడ్యూసర్‌గానూ నానీకి ఎదురుండదంటున్నారు సినీ జనాలు.

# మూడు రోజులు నిద్ర పట్టలేదు

## -శ్రద్ధాదాస్

**టాలీవుడ్‌లో అందంగా, హుందాగా ఉండే హోమ్లీ క్యారెక్టర్లు చేస్తూనే, గ్లామరస్‌గా కనిపించే హీరోయిన్ శ్రద్ధాదాస్. 'సిద్ధూ ఫ్రం శ్రీకాకుళం' సినిమాతో సక్సెస్‌ఫుల్ హీరోయిన్‌గా గ్రాండ్‌గా టాలీవుడ్‌లోకి ఎంట్రీ ఇచ్చి, ప్రస్తుతం బాలీవుడ్‌లో బిజీ హీరోయిన్‌గా మారింది. తాజాగా ఆమె నటించిన బాబు మొషాయ్ బందూక్‌బాజ్ అనేక వివాదాల మధ్య విడుదలైంది. హిట్లు, ఫ్లాపులతో తనకు సంబంధం లేదని, సినిమాల్లో తన పాత్రకు ప్రాముఖ్యం ఉంటే చాలు, ఎలాంటి పాత్ర చేయడానికైనా సిద్ధమేనంటున్న శ్రద్ధ ముచ్చట్లు, తన సినిమాల లేటెస్ట్ కబుర్లు మీకోసం...**



### మీ గురించి చెప్పండి?

మేము బెంగాలీయులం. నేను పుట్టిందీ పెరిగిందీ అంతా ముంబైలోనే. నాన్న బిజినెస్‌మేన్. అమ్మ హౌస్‌వైఫ్. అందరూ డాక్టర్ కాబోయి యాక్టర్ అయ్యాను అంటుంటారు. కానీ నేను జర్నలిస్ట్ అవ్వాలనుకుని యాక్టర్‌ని అయ్యాను. యూనివర్సిటీ ఆఫ్ బొంబాయి నుంచి జర్నలిజం డిగ్రీ పూర్తి చేశాను. ఆ తర్వాత 2008లో తెలుగు సినిమా ద్వారా ప్రేక్షకులకు పరిచయమయ్యాను.

### 'బాబు మొషాయ్ బందూక్‌బాజ్'లో మీ పాత్ర గురించి?

ఈ చిత్రంలో కష్టాలను ఎదుర్కొంటున్న భోజ్‌పురి అమ్మాయిగా నటించాను. చాలా గ్లామరస్‌గా ఉండే పాత్ర నాది. ఈ సినిమాలో నేను చూడడానికి సాఫ్ట్ కార్నర్ అమ్మాయిలా కాకుండా చాలా గంభీరంగా కనిపిస్తాను. కానీ ఎదిరించి మాట్లాడే పాత్ర కాదు. అలా నవాజుద్దీన్ జీవితంలోకి ప్రవేశిస్తాను. ఇప్పటివరకు చేసిన పాత్రల్లోకెల్లా ఇది కాస్త డిఫరెంట్. ఈ చిత్రంలో నటించడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది. సినిమా ప్రారంభానికి ముందే కొంత వర్క్ చేశాను. అసలు భోజ్‌పురి అమ్మాయిలు ఎలా ఉంటారో, వారి హావభావాలు, వారి భాష, బాడీలాంగ్వేజ్ ఎలా ఉంటుందో తెలుసుకున్నాను. అన్నీ ముందే తెలుసుకుని కష్టపడటం వల్ల సినిమా చేస్తున్నప్పుడు పెద్దగా కష్టమనిపించలేదు.

### నవాజుద్దీన్ సిద్ధిఖీతో నటించడం ఎలా ఉంది?

ఈ సినిమా చేస్తానని ఒప్పుకోవటమైతే ఒప్పుకున్నాను కానీ సినిమా ప్రారంభానికి ముందు మూడు రోజుల వరకు అస్సలు నిద్రపట్టలేదు. భోజ్‌పురి అమ్మాయిగా నేను మెప్పించగలనా? లేదా? అనే భయం నన్ను నిద్రపోనివ్వలేదు. కానీ ఆ భయం ఎక్కువ రోజులు లేదు. సినిమా ప్రారంభమై నా పాత్రలోకి ప్రవేశించగానే, ఆ భయం పోయింది. షూటింగ్‌లో నవాజుద్దీన్‌గారు, డైరెక్టర్ కుషాయ్‌నందిగారు నాకు చాలా హెల్ప్ చేశారు. ఇక హీరో గురించి చెప్పాలంటే, నవాజుద్దీన్ సిద్ధిఖీ చాలా కామ్ పర్సన్. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. కానీ సెట్‌లోకి అడుగుపెడితే నవాజుద్దీన్ కనిపించడు. ఆయనలోని పాత్రే కనిపిస్తుంది. మంచి హార్డ్‌వర్కర్.

### ఈ సినిమాలో మీరు ధరించిన కాస్ట్యూమ్స్ గురించి ఓ వార్త వచ్చింది. అది నిజమేనా?

అవును. డైరెక్టర్ కుషాయ్‌నంది ఈ చిత్రంలోని ప్రతీ పాత్రనూ అద్భుతంగా డిజైన్ చేశారు. ఎక్కడా కాంప్రమైజ్ కాలేదు. ఏ చిన్న విషయాన్నీ వదిలిపెట్టలేదు. కాస్ట్యూమ్స్ దగ్గరనుంచీ ప్రతిఒక్క విషయంలోనూ ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. ఈ సినిమాలో కాస్ట్యూమ్స్‌కు చాలా ప్రాధాన్యం ఉంది. చాలా వరకు క్యాస్ట్యూమ్స్ రోడ్డు పక్కన కొనుగోలు చేశారు. నా కాస్ట్యూమ్స్ ఒక్కొక్కటి కేవలం రూ.250 పెట్టి కొన్నారు. రూ.25 పెట్టి కొన్న సందర్భాలు కూడా ఉన్నాయి. సహజంగా కనిపించేందుకు మాత్రమే అలాంటి దుస్తులు కొన్నారు. సినిమాలో నా పాత్ర

సహజంగా ఉండాలని అంత తక్కువ ఖరీదు పెట్టి కాస్ట్యూమ్స్ తీసుకున్నారు.

**ఒక సినిమా ఒప్పుకునేముందు మీ పాత్ర నచ్చి చేస్తారా? లేక పారితోషికమా ?**

నేను రెండింటికీ సమాన ప్రాధాన్యం ఇస్తాను. నేనేం రాజ కుటుంబం నుంచి రాలేదు. అందరి లాగానే నాక్కూడా పర్సనల్ ఖర్చులుంటాయి. అందుకే నటించేటప్పుడు రెమ్యునరేషన్ విషయంలో కచ్చితమైన అభిప్రాయంతో ఉంటాను. అలాగే పాత్ర కూడా మంచి పేరు తేవాలని కోరుకుంటాను. అలా అని డబ్బుకోసం ఏదిపడితే అది మాత్రం చేయను. నాకు నచ్చితేనే చేస్తాను.

**బుల్లితెర రియాలిటీ షో 'బిగ్ బాస్'లో అవకాశం వచ్చిందట కదా?**

తెలుగులో బిగ్‌బాస్ షో చూశాను. చాలా బాగుంది. ఎన్టీఆర్ చాలా బాగా యాంకరింగ్ చేస్తున్నారు. ఆ షోలో పాల్గొనేందుకు నాకూ అవకాశం వచ్చింది. కానీ నా చేతిలో కొన్ని ప్రాజెక్టులు ఉన్నాయి. వాటిని పూర్తి చేయాలి. ఏకంగా మూడు నెలలు అక్కడ ఉండాలంటే నాకు కష్టం. అందుకే ఆ అవకాశాన్ని వదులుకున్నాను. అసలు నేను అవుట్‌డోర్ వెళ్ళినా కూడా నెలల తరబడి ఉండలేను. మధ్యలో ఒకసారి వచ్చి మళ్ళీ షూటింగ్‌కి హాజరవుతుంటాను. ఎందుకంటే నేను, నా పెట్ డాగ్స్‌ని వదిలి ఎక్కువ రోజులు ఉండలేను.

**టాలీవుడ్‌లో ఏ హీరోలు ఇష్టం?**

ఒకరు ఇద్దరని చెప్పలేను. ఎందుకంటే నాకు టాలీవుడ్‌లో చాలామంది హీరోలు ఇష్టం. కానీ అందరిలోకి అల్లు అర్జున్ అంటే కొంచెం ఎక్కువ ఇష్టం. అతని స్టైల్, డ్యాన్స్ చాలా బాగుంటుంది. అతనితో నేను ఆర్య–2లో నటించాను. ఆ సినిమా నాకు మంచి పేరు తెచ్చిపెట్టింది. ఇక జూనియర్ ఎన్టీఆర్‌తో నటించాలని ఉంది. తారక్ యాక్టింగ్ చాలా బాగా చేస్తారు. ఇప్పుడు యాంకరింగ్‌లోనూ తన సత్తా చాటుకుంటున్నాడు. బిగ్‌బాస్ చూశాక ఆయనతో నటించాలన్న కోరిక ఇంకా బలపడింది.

**బాలీవుడ్‌లో బంధుప్రీతి(నెపోటిజం)పై చర్చ జరుగుతోంది. కదా... దానిపై మీ అభిప్రాయం..?**

సినిమా ఇండస్ట్రీలో నెపోటిజం ఎప్పటినుంచో ఉంది. నటిగా నేను స్థిరపడాలని ప్రయత్నిస్తున్న తొలినాళ్లలో రోజూ 10, 15 ఆడిషన్లకు వెళ్తుండే దాన్ని. అలా ఓసారి ఓ ప్రముఖ సినీ నిర్మాణ సంస్థ వాళ్లు నన్ను పరీక్షించారు. నాతోపాటు మరో అమ్మాయి కూడా హీరోయిన్ పాత్రకోసం పోటీ పడింది. ఆ సంస్థ నిర్వాహకులు నన్ను సెలెక్ట్ చేసినట్టు అనధికారికంగా చెప్పారు. కానీ కొన్ని రోజుల తర్వాత నేను ఫోన్ చేయగా హీరోయిన్ పాత్రకు నన్ను ఎంపిక చేయలేదన్న సమాధానం వచ్చింది. ఇలాంటి సంఘటనలు సినిమా పరిశ్రమలో తరచుగా జరుగుతూనే ఉంటాయి. కొన్నిసార్లు అంతా అనుకూలంగా ఉందని అనిపించినా, ఉన్నట్టుండి పరిస్థితులు ప్రతికూలంగా మారిపోతుంటాయి. సినిమా పరిశ్రమలో ఒక చిన్న పాత్ర కోసం వందలమంది పోటీ పడుతుంటారు. ప్రతిభ ఉన్నా, కొన్నిసార్లు అవకాశాలు లభించవు. తమకు తెలిసిన వాళ్లకే ఆఫర్లు ఇస్తుంటారు. ఇలాంటి సంఘటనలను నేను చాలానే ఎదుర్కొన్నా.

**ఎలాంటి భాగస్వామి కావాలనుకుంటున్నారు ?**

నటిగా మారిన తర్వాత వందల కొద్దీ ప్రపోజల్స్ వచ్చాయి. కానీ నేనే వాటిని రిజెక్ట్ చేస్తున్నా. ఎందుకంటే వాటిల్లో నిజాయితీ లేదు. నేను సినిమా పరిశ్రమకు సంబంధించిన వారితోనే రిలేషన్ పెట్టుకోవాలని అనుకుంటున్నాను. కానీ నాకు ఇతర రంగాలకు చెందినవారి నుంచి ప్రపోజల్స్ వస్తున్నాయి. సినిమా పరిశ్రమకు చెందిన వారయితే అర్థం చేసుకుంటారని అనుకుంటున్నా. దేవుడు ఎవరిని నిర్ణయిస్తాడో వేచిచూడాలి. పెళ్ళికి నమ్మకమే పునాది. అందుకే ఎవరైనా సరే నాతో నమ్మకంగా ఉండే వాళ్లంటేనే ఇష్టపడతాను. అలాంటి వాళ్ళనే నా జీవితంలోకి ఆహ్వానిస్తాను.

**భవిష్యత్తులో మీరు చేయబోయే సినిమాలు....?**

నా పదేళ్ల సినీ కెరీర్‌ను చూసుకుంటే ఇప్పుడిప్పుడే వేగం పుంజుకుంటున్నట్టు అనిపిస్తోంది. ఎంతోమంది కథలతో నా దగ్గరకు వస్తున్నారు. నా అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని నాకు నచ్చిన వాటికి మాత్రమే ఓకే చెబుతున్నాను. అందుకే చాలా జాగ్రత్తగా సినిమాలు ఎంపిక చేసుకుంటున్నా. ప్రస్తుతం తెలుగులో రాజశేఖర్ సరసన 'పీఎస్‌వీ గరుడవేగ 126.18ఎమ్' అనే సినిమా చేస్తున్నాను. ఇంకా ఇతర భాషల్లో రెండు మూడు ప్రాజెక్ట్‌లు ఫైనల్ కావాల్సి ఉన్నాయి.

**–రామకృష్ణశర్మ**



# నూరుకట్ల పిశాచం కథలు

10

-వసుంధర

**దండకారణ్య ప్రాంతంలోని ఓ కొండగుహలో ఓ రాక్షసుడు, రాక్షసి కాపురం చేస్తుండేవారు. రాక్షసుడు మహా శక్తిసంపన్నుడు. అతడికి భార్య అంటే అమితమైన ప్రేమ. అయితే రాక్షసి పరమగయ్యాళి. భర్తకు రోజూ కష్టమైన పనులుచెప్పి వేధించేది. భార్యమీద ప్రేమతో రాక్షసుడు ఆ పనులన్నీ చేసేవాడు.**

**తనకు చతురిక పుష్పాలు కావాలని రాక్షసి ఒకసారి భర్తను అడిగింది. రాక్షసుడికి చతురిక పుష్పాలు ఎలా ఉంటాయో, ఎక్కడుంటాయో తెలియదు. అతడు వాటికోసం వారంరోజుల పాటు ప్రపంచం అంతా గాలించి, ఎలాగైతేనేం సంపాదించి తెచ్చాడు.**

## అటకమీద రాక్షసుడు

ఒకొక్కసారి రాక్షసి బాగా ఇబ్బందిపెట్టే పనులు చెబుతుండేది. ఒకరోజు ఓ బండరాయి చూపించి, "నాకో లేడిపిల్ల కావాలి. అది బ్రతికుండాలి. సరిగ్గా ఈ బండరాయంత బరువే ఉండాలి. చిన్నమెత్తు ఎక్కువగానీ, తక్కువగానీ ఉండకూడదు. వెళ్ళి తీసుకురా" అని భర్తకు చెప్పింది. రాక్షసుడు ఇబ్బందిలో పడ్డాడు. లేడిపిల్లను చంపి తెమ్మంటే చిటికెలమీద పని. కానీ బ్రతికి ఉన్న లేడి చేతికి దొరకడమే కష్టం. ఒకవేళ ఎలాగో అలా పట్టుకున్నా, ఆ తర్వాత దాన్ని తూకం వేయాలికూడా. మరి బ్రతికున్న జంతువును తూకంవేసేదెలా? తక్కెడలో వేస్తే అది పారిపోతుంది కదా!

పాపం! రాక్షసుడు చాలా ఆలోచించి, చివరకు ఓ తెలివైన పథకం వేశాడు. ఓ తక్కెడ తయారు చేసి అడవిలో వేలాడతీశాడు. తక్కెడకు ఓ పళ్లెంలో బంకజిగురు పూశాడు. తక్కెడ రెండువైపులా సరిసమానంగా ఉన్నదని ధ్రువపర్చుకున్నాక, రాక్షసుడు ఆ జిగురులేని పళ్లెంలో భార్య చూపిన బండరాయిని ఉంచాడు. ఆ తర్వాత లేడి పిల్లల్ని బెదిరించి రెండోపళ్లెంలోకి చేరేలా తరిమేవాడు. పళ్లెంలో ఉన్న జిగురుకి అంటుకున్న లేడిపిల్ల కదలలేకపోయేది. దాని బరువు తేడాగా ఉంటే, దాన్ని విడిపించి వదిలేసేవాడు రాక్షసుడు. అలా పదిరోజులు గడిచాక ఒకరోజున అతడికి సరిగ్గా బండరాయి అంత బరువున్న లేడిపిల్ల దొరికింది. భార్య అతడి ప్రయత్నాన్నీ, తెలివినీ, ప్రేమనీ మెచ్చుకుంది. రాక్షసుడు పొంగిపోయాడు. కొన్నాళ్లు సంతోషంగా గడిచిపోయాయి. మళ్ళీ ఒకరోజు రాక్షసి భర్తతో, "మాంసం తిని తిని విసుగుపుట్టింది. ఇప్పుడు నాకు వేడి వేడి అన్నంలో ఆవకాయ కలుపుకుని తినాలని ఉంది. అన్నమైతే మనమే వండుకోగలం. కాని, ఆవకాయ మాత్రం మనుషుల దగ్గరనుంచి తెచ్చుకోక తప్పదు. ఆ పని నువ్వే చెయ్యాలి. ఐతే ఇలా అన్నానని, ఏదో ఒక ఇంటికెళ్ళి ఆవకాయ ఎత్తుకుని రావడం కాదు. తెచ్చిన ఆవకాయ చాలారుచిగా ఉండాలి" అని చెప్పింది. అంతకుముందు చేసిన పనులతో పోల్చితే రాక్షసుడికి 'ఇదీ ఒక పనేనా' అనిపించింది. చాలా సునాయాసంగా సంపాదించగలననుకున్నాడు. ఆవకాయకోసం రాక్షసుడు వెంటనే బయలుదేరి ఓ గ్రామం చేరుకున్నాడు. మనిషిరూపం ధరించి ఊళ్లో కెళ్లాడు. ఆవకాయను రుచికరంగా పెట్టుకోవాలంటే ఏంచెయ్యాలని తనకు ఎదురుపడ్డవారిని అడగడం మొదలెట్టాడు. "ఆవకాయ పెట్టడం బ్రహ్మవిద్యేమీ కాదు, కానీ కుటుంబయ్య ఇంట్లో ఆవకాయ తింటే మాత్రం అది బ్రహ్మవిద్యే అనిపిస్తుంది. అంత గొప్పగా ఉంటుంది ఆ ఇంటి ఆవకాయ" అని చాలామంది అతనికి చెప్పారు.

భార్యకోరిన రుచికరమైన ఆవకాయను కుటుంబయ్య ఇంట్లోంచి తీసుకు వెళ్లాలనుకున్నాడు రాక్షసుడు. చీకటి పడేదాకా అదృశ్యరూపంలో ఉండి ఆ తర్వాత కుటుంబయ్య ఇంటికి వెళ్లాడు రాక్షసుడు. ఆ సమయానికి కుటుంబయ్య భోజనం చేస్తూ, ఆవకాయ కావాలని అడిగాడు. "తీసిన ఆవకాయ అయిపోయింది. ఆవకాయ జాడీలన్నీ అటకమీద ఉన్నాయి. అటకెక్కడానికి నిచ్చెన కావాలి. మన నిచ్చెన పుల్లన్నగారు తీసుకువెళ్లారు. రేపు నిచ్చెన తెప్పించి అటకమీదనుంచి ఆవకాయ తీస్తాను. ఈరోజుకి మాగాయతో సరిపెట్టుకోండి" అని భర్తతో అన్నది కుటుంబయ్య భార్య. సరేనని తలూపి, మాగాయతోనే భోజనం ముగించాడు కుటుంబయ్య. ఆవకాయ అటకమీద ఉన్నదని తెలియగానే రాక్షసుడు ఎగిరివెళ్లి అటకమీద వాలాడు. అక్కడ అతడికి చాలా జాడీలు కనిపించాయి. ప్రతి జాడీలోనూ ఒకోరకం ఊరగాయ ఉన్నది. వాటిలో ఏది ఆవకాయో అతడికి తెలియలేదు. ఏం చేయాలో తెలియక ఆలోచనలో ఉండగా, కింద అలికిడి వినిపించింది. రాక్షసుడు కిందకు తొంగిచూశాడు. అప్పుడు ఓ దృఢకాయుడు పరుగున ఆ గదిలోకి వచ్చి, గాలిలోకి ఎగిరి, అటకమీదకు వచ్చి చేరాడు. అతడి వెనుకనే కుటుంబయ్యవచ్చి, "వాడు ఇంతలోనే ఎటు పారిపోయాడు?" అంటూ నాలుగు మూలలా పరిశీలనగా చూసి వెళ్లిపోయాడు.





**ఒక కొండగుహలో రాక్షసదంపతులు కాపురం ఉండేవారు. భార్య అంటే అతడికి ఎంతో ప్రేమ. ఆమె అడిగిన ప్రతి కోరికా తీర్చేవాడు. అందుకోసం ఎన్ని కష్టాలూ, ఇబ్బందులూ వచ్చినా లెక్కచేసేవాడు కాదు. రాక్షసి ఓసారి చిత్రమైన కోరిక కోరింది. దాంతో రాక్షసుడు మారువేషంలో ఒక గ్రామానికి చేరుకున్నాడు. కుటుంబయ్య అనే ఆసామి ఇంటికెళ్ళి రహస్యంగా అటక ఎక్కాడు. రాక్షసుడు ఎందుకు అటకెక్కాడు? అప్పుడు ఏం జరిగింది?**

ఆ దృఢకాయుడి వివరాలు తెలుసుకోవాలనిపించింది రాక్షసుడికి. రాక్షసుడు అదృశ్యరూపం వదిలి నిజరూపం ధరించాడు. కుటుంబయ్య వెళ్లగానే దృఢకాయుడు తేలిగ్గా నిట్టూర్చి, అటూ ఇటూ చూస్తే ఒక పక్కన రాక్షసుడు కనిపించాడు. రాక్షసుడి భయంకర ఆకారంచూసి ఆ దృఢకాయుడు ఏమాత్రం భయపడలేదు. చాలా తాపీగా, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నన్ను చూస్తే నీకు భయమేయడం లేదా? నేను రాక్షసుణ్ణి" అన్నాడు రాక్షసుడు ఆశ్చర్యంగా.

"నువ్వు రాక్షసుడివైతే నాకేంటి? గంధర్వుడివైతే నాకేంటి! నాకు భయమన్నదే తెలియదు" అన్నాడు దృఢకాయుడు నిర్లక్ష్యంగా. రాక్షసుడికి ఆశ్చర్యమేసింది. తన మహాకాయాన్నీ, వికృతరూపాన్నీచూసి ఏమాత్రం భయపడని ఈమనిషి, బక్కగా, పీలగా ఉన్న కుటుంబయ్యనుచూసి ఎందుకు భయపడ్డాడు? సమాధానం తెలియని రాక్షసుడు, తన సందేహం తీర్చమని నేరుగా దృఢకాయుణ్ణే అడిగాడు. దృఢకాయుడు నవ్వి, "నాకు చాలా బలం ఉంది. ఎన్నో విద్యలు తెలుసు. నేను లేడితో సమానంగా పరుగెత్తగలను. ఎత్తైన గోడలమీంచి కిందకు దూకగలను. ఎగిరి ఈ మాత్రం ఎత్తున్న అటకలమీదకి చేరుకోగలను. కానీ నేను ఈ ఇంటికి దొంగతనానికి వచ్చాను. దొంగతనం తప్పు. మనిషి ఎంత బలవంతుడైనాసరే, తప్పుచేస్తే బలహీనుడై పోతాడు. అందుకే నేను కుటుంబయ్యను చూసి భయపడ్డాను. నా అనుమానం నిజమైతే, నువ్వుకూడా దొంగతనానికే వచ్చి ఉంటావు. లేకపోతే, ఇంట్లోవాళ్లకి కనబడకుండా ఇక్కడ కూర్చోవు కదా!" అన్నాడు.

రాక్షసుడు ఔనన్నట్లు తలఊపి, "నువ్వు చెప్పింది నిజమే! నాకు ఆవకాయ కావాల్సివచ్చింది. అది ఈ అటకమీద జాడీల్లో ఉన్నదనితెలిసి, ఇక్కడికొచ్చాను. తీరాచూస్తే ఈ అటకమీద చాలా జాడీలున్నాయి. అన్నింట్లో రకరకాల ఊరగాయలు కనబడుతున్నాయి. వీటిలో ఏది ఆవకాయజాడీయో తెలియక తికమకగా ఉంది. ఈ విషయంలో నువ్వు నాకు సహాయం చెయ్యగలిగితే సంతోషిస్తాను" అన్నాడు.

ఇది వింటూనే, "ఆవకాయకోసం అటక ఎక్కావా?" అని పకపకా నవ్వసాగాడు దొంగ. వాడికి ఎంతగా నవ్వొచ్చిందంటే, తానున్న పరిసరాలు కూడా మరచిపోయి ఆగకుండా బిగ్గరగా నవ్వసాగాడు. ఆ నవ్వు పక్కగదిలో ఉన్న కుటుంబయ్యకు వినిపించింది. ఆయన చటుక్కున అటక ఉన్న గదిలోకి వచ్చాడు. నవ్వు అటకమీదనుంచి వస్తున్నదని ఆయనకు తెలియడానికి ఎంతోసేపు పట్టలేదు. "అటకమీద ఎవరు?" అని గట్టిగా అరిచాడాయన.

వెంటనే దొంగ నవ్వు ఆపేశాడు. తను పట్టుబడిపోతాననే భయం పట్టుకుంది దొంగకి. వాడు నెమ్మదిగా రాక్షసుడితో, "తప్పు చేసినవాళ్లు మౌనంగా ఉండాలి. నవ్వను కూడా నవ్వకూడదు. కానీ నువ్వు ఆవకాయ జాడీకోసం వచ్చాననగానే నాకు నవ్వాగలేదు. ఆ నవ్వే నాకు ప్రాణాంతకమైంది, నేనిప్పుడు పట్టుబడ్డానంటే ఊరుఊరంతా కలిసి నన్ను చిత్రహింసలు పెడతారు. మనుషుల్ని మింగే నీకు మనుషుల తప్పొప్పులతో నిమిత్తంలేదు కాబట్టి, ఈ అటకమీద ఉన్నవాటిలో ఆవకాయజాడీ ఏదో తెలుసుకోవాలని నీకుంటే, ఆ కుటుంబయ్యనే నేరుగావెళ్ళి అడుగు. అప్పుడిక్కడ పెద్ద హడావుడి ఔతుంది. ఆ సందట్లో నేను పారిపోతాను" అన్నాడు.

రాక్షసుడు మారు ఆలోచన చెయ్యలేదు. వెంటనే ఒక్క ఉదుటున అటకమీదనుంచి కుటుంబయ్య ముందుకి దూకాడు. రాక్షసుడి భయంకరాకారం కంటపడగానే కుటుంబయ్యకు పై ప్రాణాలు పైనే పోయాయి. కాసేపు ఆయనకి నోటమాట రాలేదు. ఈ లోగా దొంగ అటకమీంచి క్రిందకి దూకి శరవేగంతో అక్కణ్ణించి పారిపోయాడు.

రాక్షసుడికి కుటుంబయ్య పరిస్థితి అర్థమైంది. అతడు కుటుంబయ్యతో, "భయపడకు కుటుంబయ్యా! నేను నీకు అపకారం తలపెట్టి ఇక్కడకు రాలేదు. నావల్ల నీకు ఏ హానీ జరుగదు. నాకు మీ ఇంటినుంచి ఓ ఆవకాయజాడీ కావాలి. అది ఇచ్చావంటే తీసుకుని వెళ్లిపోతాను" అన్నాడు.

తన ఇంటికి రాక్షసుడు రావడమేమిటి? వచ్చిన రాక్షసుడు అటకెక్కి కూర్చోవడమేమిటి? కూర్చున్నవాడు తనముందు దూకడమేమిటి? దూకినవాడు ఆవకాయజాడీ అడగడమేమిటి? కుటుంబయ్యకు తన ముందు జరుగుతున్నది, కలో నిజమో అర్థం కాలేదు.

రాక్షసుడు కుటుంబయ్యను తొందరపెడుతూ, "ఏమిటలా నిలబడిపోయావు? నేనన్నది నిజం. నీ ఇంట్లో ఆవకాయ మహారుచిగా ఉంటుందని అంతా చెప్పుకుంటున్నారు. ఆ ఆవకాయున్నజాడీ ఒకటి నాకు కావాలి. జాప్యం చెయ్యక తొందరగా ఇచ్చి నన్ను పంపించు" అన్నాడు.

అప్పటికి కుటుంబయ్య ఈ లోకంలోకి వచ్చాడు. తన ఎదుట ఉన్నది నిజంగానే రాక్షసుడనీ, అతడు తనని నిజంగానే ఆవకాయ కావాలని అడుగుతున్నాడనీ గ్రహించాడు. ఆయన రాక్షసుడితో, "నీకు కావాల్సింది ఆవకాయజాడీ కదా! దాని గురించి నాకేం తెలుస్తుంది? నా భార్యను అడిగి వస్తాను" అన్నాడు నెమ్మదిగా.

"సరే, వెళ్లి తొందరగా అడిగిరా. ఆలస్యమైతే నాకు కోపం వస్తుంది. కోపంవస్తే నేనేం చేస్తానో నాకే తెలియదు" అన్నాడు రాక్షసుడు. కుటుంబయ్య పక్కగదిలోకి వెళ్లగానే ఆ భార్యాభర్తలేం మాట్లాడుకుంటారోనని రాక్షసుడికి కుతూహలం కలిగింది. అతడు మళ్లీ అదృశ్యరూపం ధరించి వాళ్ల గదిలోకి వెళ్లాడు. కుటుంబయ్య భార్యకు జరిగినదంతా చెప్పి "ఇప్పుడు నేనేం చెయ్యాలో నువ్వే

చెప్పు" అన్నాడు. "రాక్షసుడు మనింటికి రావడం, జాడీతో ఆవకాయ కావాలనడం అంతా చాలా చిత్రంగా ఉంది. ఏది ఏమైనా అంతా మన మేలుకే. రాక్షసుల దగ్గిర బోలెడు డబ్బుంటుంది. మీరు వాడికి ఆవకాయ ఊరికే ఇవ్వద్దు. బస్తాడు బంగారం ఇస్తేనే జాడీడు ఆవకాయ ఇస్తాననండి. దాంతో మన దరిద్రం తీరిపోతుంది" అంది కుటుంబయ్య భార్య.

కుటుంబయ్య భయంగా, "నీకిది వేళాకోళంగా ఉన్నట్లుంది. అడిగిన వాడు రాక్షసుడు. ఆడిగింది ఇవ్వకపోతే నన్ను మింగినా మింగేస్తాడు. ఏదైనా మంచిమాట చెబుతావని సలహాకొస్తే, అత్యాశతో ప్రాణాలమీదకే తెచ్చేలా ఉన్నావ్" అన్నాడు.

"ఊరికే అలా భయపడతారేమిటి? ఆవకాయ అడిగాడంటే ఆ రాక్షసుడు శాకాహారి అయి ఉంటాడు. కాకపోయినా రాక్షసులకి భుజబలమే కాని బుద్ధిబలం ఉండదు. దొంగాడా కరవకురా అన్నట్లు, మీరిలా అన్నారంటే, వాడు మిమ్మల్నీ, నన్ను కూడా మింగేసే ప్రమాదముంది. డబ్బిస్తేనే ఆవకాయ జాడీ ఇస్తానని తెగేసి చెప్పండి. రాక్షసుడు చచ్చినట్లు తెచ్చివ్వకపోతే నన్నడగండి" అంది కుటుంబయ్య భార్య.

"ఏమో, ఈ విషయంలో నీకున్న నమ్మకం, ధైర్యం నాకులేవు. కావాలంటే నువ్వే వెళ్లి అడుగు" అన్నాడు కుటుంబయ్య.

కుటుంబయ్య భార్య వెళ్లను అంది. అతణ్ణే వెళ్లి అడగమంది. ఇలాంటి అవకాశం మళ్లీ రాదనీ, ఉపయోగించుకుని తీరాలనీ మంకుపట్టుపట్టింది. కుటుంబయ్య ఆమెను ఒప్పించడానికి మరి కాసేపు ప్రయత్నించి, ఫలితం లేకపోవడంతో విసిగిపోయాడు. చివరికాయన, "ఈ ప్రపంచంలో పెళ్ళాం మాటకు విలువ ఇచ్చిన ఏ మగాడూ బాగుపడలేదు. నువ్వు మంచి మాట చెబితే, నేనెలాగూ వింటాను. కానీ, నువ్వేంచెబితే, అది చేయడానికి నేనేం చేతకానివాణ్ణి కాను. నాకు తోచింది నేను చేస్తాను. ఎరక్కపోయి నిన్ను సలహా అడిగాను. ఇప్పుడేంచేయాలో నాకు నేనే నిర్ణయించుకుంటాను" అని మళ్లీ రాక్షసుడున్న గదికి వెళ్లాడు. అయితే ఆశ్చర్యంగా అక్కడ రాక్షసుడు కనిపించలేదు కుటుంబయ్యకు. నేలమీద ఓ సంచి ఉన్నది. ఆ సంచి నిండా బంగారు నాణేలు ఉన్నాయి.

మూర్ఖురాలైన పెళ్ళాం మాటలకి విలువివ్వి, నానా అవస్థలూ పడుతున్న రాక్షసుడి కళ్ళు తెరిపించి జ్ఞానోదయం కలిగించాడు కుటుంబయ్య. తనకు తెలియకుండానే చేసినప్పటికీ, కుటుంబయ్యకు ప్రతిఫలం ఇవ్వాలనుకున్నాడు రాక్షసుడు. అందుకే ఆ బంగారు నాణేలు బహుమతిగా వదిలిపెట్టి, ఆవకాయజాడీ తీసుకోకుండానే అక్కడినుంచి అతివేగంగా వెళ్లిపోయాడు.

కథ పూర్తికాగానే, మహారాణి ఎంతో సంతోషించి వినయశీలుణ్ణి మెచ్చుకుంది. తనుమాత్రం ఆలోచనలో పడింది. 'అజ్ఞానంవల్ల ఆడవాళ్లు కోరరాని కోరికలు కోరవచ్చు. అప్పుడు వారి భర్తలు కేవలం భార్యలపై మోహంతో, యుక్తాయుక్త విచక్షణ లేకుండా వారికి సహకరించడం సమంజసమా? మహారాజు తనను వారించి ఉన్నట్లయితే, తన ప్రవర్తన ఇలా ఉండేది కాదేమో! అసలు తాను చేస్తున్నది తప్పేనా! తప్పు అయితే మహారాజు చెప్పడేం? తప్పు చేయడం తనతప్పా! అది తప్పు అని చెప్పకపోవటం మహారాజుతప్పా?'

మహారాణి ఆలోచనలు ఎలా ఉంటేనేం, కథ బాగుందని ఆమె మెచ్చుకోగానే, వినయశీలుణ్ణి ఆవహించిన నూరుకట్ల పిశాచానికి మరో కట్టు విడిపోయింది.

మర్నాడు, వినోద ప్రదర్శనకుముందు యథాప్రకారం కథ వినడానికి మళ్లీ వచ్చింది మహారాణి. వినయశీలుణ్ణి ఆవహించి ఉన్న పిశాచం మరో కథ చెప్పడం ప్రారంభించింది.

(సశేషం)

## సుధామ పదగారడి-330

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | 2 | | ❖ | 3 | 4 | | ❖ |
| 5 | ❖ | | ❖ | 6 | ❖ | | ❖ | 7 |
| 8 | | ❖ | ❖ | | ❖ | 8 ❖ | 9 | |
| | ❖ | 10 | ❖ | 11 | | 12 | ❖ | |
| ❖ | 11 ❖ | | ❖ | ❖ | ❖ | | ❖ | ❖ |
| 13 | ❖ | 14 15 | | 15 | ❖ | | ❖ | 16 |
| 17 | | ❖ | ❖ | | ❖ | ❖ | 18 | |
| | ❖ | 19 | ❖ | | ❖ | 20 | ❖ | |
| ❖ | 21 | | | ❖ | 22 | | | ❖ |

**ఆధారాలు**

**అడ్డం**

1. కేరళీయుల పర్వం (3)
3. అనంత పద్మనాభస్వామి ఆలయం ఇక్కడిది ప్రసిద్ధం (3)
8. సిగరెట్టు కాల్చిన బూడిద (2)
9. గ్రామము (2)
11. సమయము, తూరి, తేప, ఆవృత్తి(3)
14. ముక్కుమీద కోపం కలవాడు (3)
17. సామెత వంటిదే (2)
18. రిపేరులో నామము (2)
21. నారికేళము (3)
22. కర్పూరం వెలిగించి దేవుడికి ఇచ్చేది (3)

**నిలువు**

2. ముక్కుపొడుం (2)
4. అరవంలో వద్దు, వలదు (2)
5. శరీరము (3)
6. నెలతో మొదలైన స్త్రీ (3)
7. ఒజ్జ (3)
10. చేప (3)
12. కేరళలో నారాయణగురు ఆశ్రమము వున్న ఊరు (3)
13. అవకాశము, అనుకూల్యము (3)
15. అశని (3)
16. తొమ్మిది అడ్డంతో తొడ (3)
19. తండ్రి (2)
20. పొగరు, అహంకారం (2)

### పదగారడి-329 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1ఏ | 2నా | య | 3కు | డు | | 4మూ | 5షి | కం |
| | లు | | స్త్రీ | | 6గా | | యా | |
| 7సం | క | 8టం | | 9ఉం | డ్రా | ళ్ళు | | 10ని |
| చి | | 11క | ళ్యాం | | లు | | | లా |
| 12త | మ | ము | | | | 13పి | ద | ప |
| క | | | 14జో | | 15శె | రు | | నిం |
| ర్మ | | 16కి | రి | టం | | 17దు | 18ర | ద |
| | 19పె | | గ | | 20లై | | స | |
| 21ఏ | రా | ళం | | 22సా | మ | జ్ఞ | న | ము |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

